# అవతారిక



ఈ శుభయోగమును వంగభాషయందు రచించిన కవిచంద్రుఁడు శ్రీ సురేంద్ర మోహన భట్టాచార్యులవారు. ఇది యా కవిశిరోమణి కావ్యమున కాంధ్రానువాదము. సాంసారికంబులగు నవలలలో నిది యుత్తమశ్రేణికి జెందినదని చెప్పవచ్చును.

ఇందుఁ బరస్పరైకమత్యమును బాటింపక స్వార్థపరత్వముచే భిన్నాకాంక్షులై సహోదరులు వ్యష్టిత్వము నాపాదించుకొనుటవలన గుటుంబము లెట్లు సర్వనాశనము లగుచుండునో విదేశ సాంప్రదాయాను సారంబుగా విద్యాభ్యాసము గావించి యందలిసారమును సంపూర్ణముగ గ్రహింపఁజాలక స్వదేశసదాచారముల నీసడించుటయె నాగరకత యని భావించి కేవల భౌతిక సుఖాభిలాషులై విద్యాధికులుకూడ స్వధర్మమును బరిత్యజించి యెట్లధఃపతితు లగుచుందురో, యన్యోన్య సామంజస్యము గల సమష్టికుటుంబములం దెట్టిస్వర్గసుఖము కరతలామలకమై యుండునో యీ నవలయందుఁ గన్నులఁగట్టినట్లు, మానసముల కద్దినట్లు యథోచితముగ వర్ణింపఁ బడియుండెను.

మానవత్వముం గాంచినందు కైహికాముష్మికసుఖంబుల నందఁ గోరి తమలోఁ దా మన్నదమ్ములును, తల్లిబిడ్డలును, నత్తకోడండ్రును, బంధుమిత్రులు నగు నరనారీమణు లెల్లరు నీ నవలను శ్రద్ధతోఁ బఠించి నేర్చుకొనఁదగిన యుత్తమవిషయములిం దెన్నియో యున్నవని చెప్పుట కెట్టిసంశయమును లేదు. ఈ నవలాపఠనమువలన గొన్ని కుటుంబములైనను నిందలిపరమార్థమును గ్రహించి భారతవర్షోచితగార్హస్థ్యధర్మముల నవలంబించి పరమసుఖానందపరిపూర్ణములై యనేకసంసారముల కాదర్శస్వరూపములు గాకపోవని విశ్వసించుచున్నాము.

అనువాదకుఁడు

ఇంకను బాగుగ నెండ యెక్కకుండఁగనే పాంచకడీ యింటికి వచ్చెను. శచీశునియభావముచే నింటివారందఱును దుఃఖించుచుండిరి. పాంచకడీ వచ్చినవెంటనే వదినె యగుగౌరాంగి గదిలోనికిఁ బోయెను. అప్పు డామె పరుండి యుండెను. పాంచకడీ "వదినే! లెమ్ము! ఏడ్పుటవలన నేమియును లాభములేదు. ప్రాణములర్పించినను గూడ నా మాణిక్యము మన కిఁక లభింపదు. అట్లుదొరకుట కవకాశమే యున్నచో నాయీ నిరర్థకశరీరమునర్పించి నేనా కార్యమును సాధించియే యుందు" ననెను.

గౌరాంగి లేచి కూర్చుండి గోలుగోలున నేడ్చుచు "వాఁడెప్పుడును నీచెంతకు రావలె నని యుబలాటపడుచుండెడివాఁడు. మందభాగ్యురాల నగునేనే యాతని బలవంతముగ నడ్డగించి నిన్నుఁ జేరనిచ్చెడిదానను గాను. ఆపాపకార్యముచేతనే యాతఁడు కోపగించి నన్నుఁ ద్యజించిపోయినాఁడు! — బాబూ! శచీ! మీనాన్న యింటికి వచ్చినాఁడు! ఒక్కసారి రమ్మునాయనా! ఇఁక నేనెన్నఁడును నిన్నడ్డగింపను! తండ్రీ! ఒక్కసారి రావా?" అని యేడువఁదొడంగెను.

ఆసమయమునకు సరిగా దుర్గాంబ యటకు వచ్చి పాంచకడీని జూచి "ఇదేమిబాబూ! ఇప్పుడు నీవుమరల నేడ్పించుచున్నావా? — రామా! మీయత్తయ్య యేడ్చుచున్నది. ఒకసారిరమ్ము! నిన్నుఁ జూచియైన కొంచెము ప్రాణము కుదురుపఱచుకొనునేమో! పాంచకడీబాబూ! మఱచిపోవుచున్న వన్నియును స్మృతికిఁ దెచ్చి యేడ్పింపకుము! నీవు కొంచెమావల నుండుము!" అనెను. పాంచకడీ వెంటనే వెడలిపోయెను.

రామసేవకుఁడును దుర్గాంబయు స్థిరముగా నీయింటనే యుందురనియు, పుత్రహీనయగు గౌరాంగికి రామసేవకుఁడు పాలకపుత్రుఁడుగా నుండుననియు నానాఁడే నిశ్చయ మయ్యెను. పాంచకడీ యందుకు సంతోషింపలేదు. ఇంటిలోని వా రెవ్వరికినిగూడ నది యిష్టము

లేకుండెను. కాని గౌరాంగిమాట కాయింటిలో నెవరువినువా రెవ్వరున్నారు?

మఱికొన్నినాళ్లకు దానేశునికడనుండి పాంచకడీ కొకయుత్తరము వచ్చెను. అందిట్లున్నది:—

"చాలదినములనుండి మీయుత్తరములు లేవు. అన్నగారి కుమారుఁడు మరణించెననువార్త తెలిసి చాల విచారించితిని. కాని విధివిధానమునకు మానవు లేమి చేయఁగలరు? నేనింటికివచ్చిన కింతపనుల కేమి యును బంపకుండుట కనేక కారణములున్నవి. జీవితమునందనేక నిస్సార కష్టములు వచ్చి పోవుచుండును — ఇప్పుడు నేనుద్యోగమును వదలి వైచితిని. ఇక్కడఁ గలకత్తాలో సొంతముగా నొకచిన్న వైద్యశాలను స్థాపించితిని. నేనొక్కఁడను బనులన్నియు జూచుకొనఁ జాలను. నీకింటి యొద్ద నంతగా ముఖ్యమైనపనులు లేవుగదా! ఈయుత్తర మందగానే నీవు బయలుదేఱి రమ్ము! ఇక్కడఁ గార్యభార మంతయు నీపై నుంచి నేను నిశ్చింతుఁడనై వైద్యవ్యాపారము సాగించుకొందును. ఈసందర్భమున నమ్మకముంచి యితరుల కిది యంతయు నొప్పగించుట కష్టము. ఇంటియొద్ద నందఱును క్షేమముగ నున్నారనితలఁచెదను. విశేషములు వ్రాయుము"

శ్రీ దానేశుఁడు —

పాంచకడీ యాయుత్తరము చదివి యందఱికిని వినిపించెను. గౌరాంగి వాని యందలి మంచిచెడ్డలను గూర్చి యేమియుఁ జెప్పలేదు. పుత్రశోకతప్త యగుచు నామె యింటిగోడలలో నేమియుఁ జేయఁ జేసికొనుట లేదు. రాసూబేవియు విచారముచే మంచముపట్టి యుండెను. కాని యజమానురాలగుటచే నామెయే యన్నియును జూచుకొనవలసి యుండెను. ఇంతకష్టములలో నుండియు నామె సంసార మెప్పటికైన బాగుపడు ననునాశతోఁ గనుపెట్టుకొనియుండెను. ఆమె కుమారుఁడగు

పాంచకడీని నాంచి "బాబూ! ఇప్పటికైన నాని దురదృష్టము వదలిన బాగుపడును. నీవు సోదరా! సుజఫరపురము వదలినాఁడుగదా! ఇఁకనైన బాగుపడవచ్చును. నీ వాతనికి సాయముగా నుండుము!" అని చెప్పెను.

శాంతిదేవి యెన్నియో నోములు నోచుచుండెను. ఎందఱో దేవతలను బూజించుచుండెను. ఎన్నియోవిధములఁ బ్రార్థించుచుండెను. ఇవి యన్నియు నెందుకొఱకు? తననాథునకు సద్బుద్ధి కలుగవలె నని — అతనికి మంచినడవడి యేర్పడవలయు నని — ఆ దేవత లందఱికి నామె మొదల జాలిగాను, యామె సత్కార్యములచే సంతుష్టిగాని కలిగినదో లేదో చెప్పఁజాలము. కాని పాంచకడీ కలకత్తాకుఁ బోవుట యింటి వారి కందఱికిని సమ్మతముగనే యుండెను. శచీశుఁడు లేని యాయింటిని విడిచి పోవలెనని పాంచకడీకిని తొందరగనే యుండెను.

పాంచకడీ కలకత్తాకుఁ బయనమయ్యెను. "ఒకసారి మీయన్న గారినింటికి రమ్మని చెప్పుము!" అని పాంచకడీతో జెప్పవలె నని శాంతిదేవి మిగుల నుబలాటపడెను. కాని సిగ్గుచే నామె యేమియును జెప్పఁజాలకపోయెను. ఆమెమనసులోని వాంఛ మనసునందే విలీనమైపోయెను. పాంచకడీ ప్రయాణమై పోయెను.

## ౪౩.

ఇఁక క్షితీశుని సంగతి తెలిసికొనవలసి యున్నది. ఆతఁ డిప్పుడు దత్తవారింటనుండెను. ఆయూరికి మూడుమైళ్ళలో నున్న రామపురపువర్తకుని యొద్ద నాతఁడు నెల కాఱురూప్యముల వేతనమునకుఁ బని చేయుచుండెను. ఆతఁడు ప్రతిదినమును దెల్లవారుజామున లేచి బావయగు హరిచరణుని పొలముపనులను జూచుకొని యింటికివచ్చి స్నానముచేసి వంటయైనచో వేడియన్నము దిని లేకున్నచో చలిదియే భుజించి యదియు

లేకున్నచో నింతే లేసీరు ద్రాగి తొమ్మిదిగంటలకుఁ బన్నిద్దె రామపురమును పోయి రాత్రియెనిమిది గంటల కింటికి దిరిగి వచ్చుచుండెను.

రామపురమున వారమునకు రెండుసంతలు జరుగుచుండెను. ఆ చుట్టు ప్రక్కల పల్లెలవారందఱును దమకుఁ గావలసిన వస్తువుల నాసంతలకుఁ బోయి కొని తెచ్చుకొనుచుందురు. నేఁడు సంతదినము. క్షితీశుఁడు కూరగాయలను, గొన్ని వస్తువులను మూటలు గట్టుకొని నెత్తిమీఁదను బుజముమీఁదను బెట్టుకొని యతిశ్రమతో నింటికి వచ్చుచుండెను. రాత్రి తొమ్మిదిగంటలు కూడ దాటిపోయెను. చీకటిరాత్రి! మబ్బు క్రమ్ముకొని చినుకులు పడుచుండెను. ఆతని కట్టుబట్టలును, తలయు, సకలాంగకములును దడిసిపోయెను.

అతఁ డాయాసముతో వగర్చుకొనుచు నత్తవారింటికి వచ్చెను. అప్పుడు హరిచరణుఁ డింట గూర్చుండి తల్లితోడను, అక్కచెల్లెండ్రతోడను, సుఖసంభాషణములు గావించుచుండెను. క్షితీశుఁడు బాడికాళ్ళతో, తడిబట్టలతో ఖిన్నాననముతో, క్లాంత దేహముతో నుండెను. అప్పటి యాతని యవస్థను, ఆకారమును వాని తల్లియైన నన్నదమ్ములైన జూచియుండినచో జాలిచే వారినయనము లశ్రుజల పరిపూర్ణములు గాక మానవు! — ఆతనిం గాంచినంతనే హరిచరణుఁడు పక్కున నవ్వెను. ఆతని తల్లిగూడ నవ్వుచు "దరిద్రుఁడు! పూసంతయైనను బుద్ధిలేదు!" అనెను.

క్షితీశుని భార్య శివమోహిని యామాట విని మొగము ముడుచుకొని చటాలున నించుక జరగి కూర్చుండెను. కాని, యాసంగతి నెవ్వరును గనుపెట్టలేదు. క్షితీశుఁడు మిగులలజ్జితుఁ డయ్యెను. ఆతఁడు మూటలను క్రిందికి దింపి నిట్టూర్పు విడుచుచు "తల్లీ! విశ్వజననీ! ఇంకను! నాకెట్టిపాటులు పెట్టవలె నని తలఁచుచున్నావు!" అని యనుకొనెను.

హరిచరణుఁడు నవ్వుచు "ఏమి యాదీనాలాపము!" లనెను. క్షితీశుఁడు విరక్తితో "దీనులకు దీనాలాపములు గాక మఱేముండును?" ననెను.

హరి — నీకు బుద్ధి లేదు. అందుచేతనే యింతరాత్రివఱకు పని తేల్చుకొనలేక కష్టపడుచున్నావు! ఓహో — కాలిమీఁద నదియేమి?

క్షితీ — చీకటిలో రాయి తగిలి కాలివ్రేలు పగిలినది.

హరి — సరే - నల్లమందు తెచ్చితివా?

క్షితీ — కొంచెము తెచ్చితిని!

హరి — కొంచెమేమి?

క్షితీ — డబ్బు లేదు. ఈనెలజీతము ముందుగనే చాలవఱకు వాడితిని. నేఁటిసంతకర్చునకే సొమ్ము చాలలేదు.

హరి — ఇదే నీపాడుగుణము! ముందుగనే యంతయుఁ దిని కూర్చుండుటా?

క్షితీ — ఏమి చేయుదును? నాకాకలి యెక్కువ — తెలివి తక్కువ!

హరి — కొంచెము తంబాకు చేసియిమ్ము.

క్షితీ — ఉండుము! గుండెలలో పోటుగ నున్నది కొంచెమునే పాఁగుము! తరువాతఁ జేసియిచ్చెదను.

హరి — నీకింతబద్ధకమేమి? మనుష్యులకు బద్ధకమే దరిద్రహేతువు! నాకు తంబాకు చేసియిచ్చి తరువాతఁ గాలుసేతులు గడుగుకొని బట్టలను విడువుము!

క్షితీశుఁడు పథశ్రాంతుఁడై యున్నను బావచెప్పినపని చేయక తప్పినది గాదు. అప్పు డాతనియత్తగారు చల్లగా "నేఁడు మేమందఱమును ఘోషుగారింటికి భోజనమునకుఁ బోయితిమి — నిన్నును బిలిచినారు. కాని నీకవకాశము లేకపోయినది. వేళతప్పి భుజించుటచే రాత్రి యెవ్వరును భోజనము చేయ నిష్టపడలేదు. అందుచే నీయొక్కనికొఱకు వంట చేయలేదు. నీవీరాత్రికి గొన్ని యటుకులు దినుము. ఏమందువు?" యనెను.

"అట్లే చేసెదను" అని క్షితీశుఁడు చెప్పెను గాని, పాప మాతని జఠరానలము గర్భమును దహించివైచుచుండెను. కొంత సేపటికిఁ గొన్ని యడుకులును, గొన్ని పాలును, గొంతబెల్లము నాతనికి లభించెను. క్షితీశుఁడు వానిని గడుపునఁ బడవైచి తిన్నఁగా శయనగృహమునకుఁ బోయెను. శివమోహిని గంభీరస్వరముతో నాతనింగూర్చి "తెచ్చితిరా?" అని ప్రశ్నించెను.

క్షితీశుఁడు వినమ్రకరుణస్వరముతో "లేదు" అనెను.

"లేదా? మంచిది!" అనుచు శివమోహిని యొక్కయుదుటునఁ బడకపైనుండి లేచి "అయ్యో! ఎందుకే నాబ్రదుకు? ఓమృత్యువా! నావంటి నిర్భాగ్యురాలిని దీసికొని పోవుటకు నీకింత యశ్రద్ధ యేమి? నేనెన్ని పాపములు చేసి పుట్టితినో యీ దుఃఖము ననుభవించుటకు? పరమేశ్వరా! నాపాపముల కవధి లేదా?" అని ప్రక్కపై బోరగిలపడి యేడువఁదొడంగెను.

క్షితీశుఁడు భయపడుచు "వినుము! ఇందునాయపరాధ మేమున్నది? నాచేతిలో డబ్బున్నచో నీకొకచీర కొని తెచ్చుటకు లోభింతునా? ఏమి చేయుదును? నాకును గష్టముగనే యున్నది. దేవుఁడు కరుణించినచో నెప్పటికైన మనకష్టములు తీరును. లేకున్నచో మనబ్రదుకింతే!" అనెను. శివమోహిని "పాడుమొగముదానను! బుద్ధిలేక నీవంటి వానిని యాచించితిని! ఈబెల్లిమాటలతో నేమిపని! చాలుచాలు!" అనియొకప్రక్కకొత్తిగిలి చుఱచుఱలాడుచుండెను.

క్షితీ — ఏమని చెప్పుదును! నాకాఱుమాపాలజీతము! సంతే కర్చులు నేనే పెట్టవలెను! ఎనిమిదినంతలకు నెనిమిదిమాపాయలకుఁ దక్కువ గాదు. మీయన్నగా రొకదమ్మిడియైన నిచ్చుటలేదు.

శివమోహిని పాదములతో మంచపుపట్టెలపైఁ గొట్టుచు వికారస్వరముతో "ఎంతనీచబుద్ధి! మాయన్న మనయిద్దఱిని రెండుపూటలను

మెప్పుచున్నాఁడు. నీవు రెండుకాయలను, రెండుకూరలను దెచ్చినంత మాత్రమున నేమైనట్లు? ఇఁక మీరు తేవక్కఱలేదు. మీ పని మీరు చూచుకొనుఁడు! నాయదృష్ట మెట్లున్నదో యట్లగును!" అని యాతని ననేకవిధముల నిందింప నారంభించెను. అట్టియవస్థలో క్షితీశుఁడు శయ్యపై స్థానమును బడయఁజాలక గదిలోఁ గూర్చుండి మంచిపుస్తక మేదియును లేకుండుటచే నూతనపత్రికను జదువుకొనుచుఁ గూర్చుండెను. శివమోహిని నిద్రించెను. తరువాత క్షితీశుఁ డామెప్రక్క నించుక చోటు చేసికొని పరుండి యారాత్రి వేగించెను.

## ౪౭

హరిచరణుఁడు వేకువజాముననే లేచి క్షితీశుని లేపి "కూలివాండ్రు పొలమునకుఁ బోవుచున్నారు. వారిలోఁ గొందఱి నొకపొలమునకును, కొందఱిని మఱియొక పొలమునకును బంపి వారికిఁ బనులు చెప్పి వచ్చి తరువాత నీవు నీపనిలోనికిఁ బొమ్ము!" అని యాజ్ఞాపించెను.

క్షితీశుఁ డించుక సంకోచముతో "రెండుపొలములకును బోయి కూలివాండ్రకుఁ బని చెప్పి వచ్చునప్పటికి రెండుజాములు కాక మానదు. నేను పనిలోని కెప్పుడు పోవుదును! కొన్నాళ్ళనుండి యాలస్యముగ వచ్చుచుంటి నని సాహెబుగారు విసుఁగుకొను చున్నాఁడు!" అనెను.

హరి — అందుకు నేనేమి చేయుదును? నాపనినిమాత్రము నీవు చూడవలదా? మీయిద్దఱిపొట్టలను నీ యాఱు రూపాయలతోనే నిండుచున్నవా?

క్షితీశుఁ డిఁక మాఱు చెప్పక పై మీఁద గుడ్డ వైచికొని పొలము నకుఁ బోయి పదిగంటల కాయాసముతో నింటికి వచ్చునప్పటికి పెద్ద యల్లుఁడగు రాయచరణుఁడు వచ్చియుండెను. అతఁ డేఁబదియేండ్లవాఁ

నైనను భూస్వాంత్యములై యింకను సంపాదించుచుండెను. కుమారుడైనను, చనిపోయిననాఁటికైనను ధనవంతుఁ డగుటచే నాతనిభార్య యొడలినిండఁ గావలసినన్ని నగలను జేయించెను. ఇరుగుపొరుగువా రందఱు నాతని జూడవచ్చిరి. ఇంటివా రందఱు నాతని గౌరవించుచు బరివేష్టించి యుండిరి. అత్తగా రగుచండిక యల్లునకు మంచివంటకములు చేయుటకుఁ దొందర పడుచుండెను.

క్షితీశుఁడు వచ్చినతోడనే రాయచరణునకు నమస్కరించి కుశల ప్రశ్నలను గావించి యాతనికి తంబాకు సిద్ధముచేసి యిచ్చి స్నానము చేసి వంటయింటికిఁ బోయి "వంట యైనదా ?" అని యత్తగారినడిగెను.

చండిక ముక్కును మూతియుఁ ద్రిప్పుకొనుచు "అప్పుడే వంట యెట్లగును ? అల్లుఁడు వచ్చినాఁడు చూడలేదా ? నీ శరీరమునందు మాఁగవలెనెక్కుడు పడు బాబూ !" అని విసుగుకొనెను.

క్షితీ — నేను పనిలోనికిఁ బోవలెను.

చండి — నేనేమి చేయుదును ? ఒకనాఁడు పోకున్నఁ దప్పదా ?

క్షితీ — చాలతొందరపని యున్నది.

చండి — అట్లయిన నేమి చేయుదువు ? వంట యగుట కింకను చాల నాలస్యమగును. రాయచరణునకు సన్నబియ్యము వండి యాతని కూరలు సిద్ధమైన తరువాత నీయన్నము వండవలెను.

క్షితీ — అంతయాలస్యమా ? అట్లయినచో నీనాఁడు పోవుట పడదు. తేనీరు ద్రాగుట కేమైన నున్నదా ?

చండి — ఏమున్నది ? తొందరపడి నంతమాత్రమునఁ బప్పుడుకునా ! కొంచెము బెల్లము తీసికొని పానకము చేసికొని త్రాగుము !

క్షితీశుఁడు కొంచెము పానకము ద్రాగి వికలహృదయముతోఁ జండీ మండపమునకుఁ బోయెను. నాఁడు పనికిఁ బోలేదు. పని చాలగ నున్నది, అయిన నేమి ? తిండి తినకుండఁ బోవుట యెట్లు ? నిన్న మధ్యాహ్నము

తినియున్నాము !

పెద్దమనుష్యుఁడు స్నానము చేసి రొట్టె తిని పాలు ద్రాగి తాంబూలము నములుచుఁ జావడిమండపమునకు వచ్చెను. ఆతనితో హరిచరణుఁడును వచ్చెను. అందఱును గలసి పేకాట నారంభించిరి.

ఒంటిగంటకు వంట తయారైన దని సేవకుఁడు వచ్చెను. రాయచరణుఁడును, హరిచరణుఁడును లేచి యింటికి బోవుచుండిరి. "నేనునుగూడ వత్తునా ?" అని క్షితీశుఁడు ప్రశ్నించెను. "నీవంట యింకను గాలేదు !" అని చెప్పి హరిచరణుఁడు రాయచరణుని వెంటఁబెట్టుకొని పోయెను. క్షితీశుఁడు తెల్లవోయి మ్లానవదనముతో వెనుకకు ద్రిప్పుకొనెను.

అప్పుడొక పెద్దమనుష్యుఁ డాతనిం గాంచి "క్షితీశ బాబూ! నీ భోజన మెప్పుడు?" అని ప్రశ్నించెను. "ఎప్పుడువడ్డించిన నప్పుడు !" అని క్షితీశుఁడు విసుఁగుకొనుచు జెలియఁజేసెను.

అది చూచి యింకొకఁడు మొదటివానితో "తెలియలేదా ? భాగ్యవంతుఁడైన యల్లుఁ డింటికి వచ్చినాఁడు! ఆతనికి విందుచేయవలదా ? బావమఱఁది యాతనితోడనే యున్నాఁడు ! ఇతఁ డింటియల్లుఁడే కాదా? ఇతని బుడమబియ్యపన్న మింకను నుడుకలేదు కాఁబోలును !" అనెను.

అది విని మొదటివాఁడు "క్షితీశ బాబూ ! కోపపడకుము ! నీవు బాగుగ జదువుకొన్నావు ! విశేషించి కులగౌరవము గలవాఁడవు. ఇట్లు నీవిక్కడ బడియుండు టెందుకు ? ఇంటికిఁబోఁగూడదా ? అన్నదమ్ములతోఁ బడకున్నచో వేఱుగ నుండవచ్చును. ఇట్టి యవమానమును భరించుచు నిచ్చట నుండుటయేమి ? అత్తవారియింట బానిసతనమే నీకు బాగుగ నున్నదా?" అనెను.

క్షితీశుఁడు వారికిఁ బ్రత్యుత్తరము చెప్పలేదు. ఇంతలో రాయచరణ హరిచరణులు భుజించి వచ్చిరి. హరిచరణుఁ డాతనితో "క్షితీశా ! ఇఁక నీవు తిండికిఁ బొమ్ము ! తంబాకు సిద్ధముచేసి మాకు

బంపించి తరువాత నీవన్నము తినుము!" అని చెప్పెను. క్షితీశుఁడు దీనవదనముతో సర్లే యని చెప్పి వెడలిపోయెను.

చండిక యాతని కన్నులను వక్షించి "బాబూ! పెద్దయల్లుఁడు చాలదినములకు వచ్చినాఁడు. అతనికొఱకు ప్రత్యేకముగ గారెలును బొండివంటలును జేయవలసివచ్చినది. అతనిపంక్తి నున్న వారికిఁ గూడ వడ్డింపవలెనుగదా! అందువేత వ్యంజనములు అన్నియును నైపోయినవి. ఈపచ్చడి మాత్రము మిగిలినది. దీనితో భోజనము చేయుము" అని చెప్పెను. క్షితీశుఁడు మఱిమాటాడక భోజనము ప్రారంభించెను. అన్నములోనికి గవ్యద్రవ్యము నిన్నను లేదు — నేఁడును లేదు!

## ౪౮

ఆరాత్రి భోజనమైన తరువాత క్షితీశుఁడు తనగదిలోనికిఁ బోయి శయనించెను. గంటలపై గంటలు తిరిగిపోవుచున్నవి. కాని యాతని భార్యరాలేదు. వంటయింటిలో దీపములేదు. ఇంటి పనులన్నియు నైపోయినవి. ఇంకను రాలేదేమని క్షితీశుఁడు గదివెలుపలికి వచ్చి చూచెను. ప్రక్కగదినుండి సంగీతము వినవచ్చుచుండెను. ఆకంఠస్వర మాతనికి జిరపరిచితమైనదే. శివమోహిని పాడుచుండెను.

క్షితీశుఁడు కిటికీనుండి తొంగిచూచెను. గదిలో రాయచరణుఁడు మంచముపై నర్ధశాయియై యుండెను. ఆప్రక్కనే కూర్చుండి శివమోహిని యొక ప్రేమగీతమును గానము చేయుచుండెను. అది యాతనికి బాగుగ నగపడలేదు. కాని యాతఁడు తనభార్యను బిలువఁజాలక పోయెను. ఎవ్వరైన విని యేమనుకొందురో యని — అయినను నాతఁ డటనుండి పోఁజాలక ప్రక్కనే నిలువఁబడి తొంగి చూచుచుండెను.

ఇంతలోఁ జండిక యటకు వచ్చి తొంగితొంగి చూచుచున్న క్షితీ

తునిం గాంచి యగ్గిలోనిగుగ్గిలమువలె మండిపడుచు క్రోధగంభీరమగు స్వరముతో మెల్లగా "ఏమిచూచుచున్నావా బాబూ" అనెను. క్షితీశుఁడు వెనుకకుఁ దిరిగిచూచి యదరిపడెను. చండిక యాతని విడచి తన గదిలోనికిఁ బోయెను. ఆమె వెనువెంటనే క్షితీశుఁడుకూడ నాగదిలోఁ బ్రవేశించెను.

చండిక తనమొగమును కొరకచ్చువలె నమావాస్యరాత్రివలె నంధకారముగఁ జేసికొని "ఆచాటుననిలిచి యేమి చూచుచున్నావు బాబూ!" అని ప్రశ్నించెను.

క్షితీ — ఏమియును లేదు. వెలుపలికిఁ బోయితిని. పాట వినవచ్చుటచే నెవరు పాడుచుండిరో యనిచూచితిని.

చండి — నాకట్లు తోఁచుటలేదు. అక్కమగనియొద్ద మజువం డ్రెంతో చనువుగా నుండును. నీవంత తొంగితొంగి చూచు చుందువు!

క్షితీ — నాకాసంగతి తెలియదా? అక్కమగనిచెంత నన్నయొద్ద వలెనే మఱదండ్రు చనువుగా మసలుచుండుట యెవరియింట లేదు! ఇట్టి వన్నియును మన కన్నులకుఁ గ్రొత్తలా?

చండిక తోఁకద్రొక్కిన త్రాచువలె దలయెత్తిగర్జించుచు "ఁ కుసుంద అమును బజారులోని వేశ్యలము!— అందుచేతనే యట్లు చేసితిని! మీ యమ్మయు, అక్కలును బతివ్రతలు! మే మసతులము!" అని గర్జించెను.

క్షితీశుఁడు విభ్రాంతుఁడై విషన్నుఁడై దోసిలి చేతులు జోడించుకొని వినీతస్వరముతో "అమ్మా! నాయపరాధమును క్షమింపుము! నేను తప్పుమాట యేమియు ననలేదు. కేవల మొకసారిమాత్ర మెవ్వరో యని తొంగి తొంగి చూచితిని!" అనెను.

చండి — ఎందు కట్లు చూడవలెను? అట్టి యనుమానముగల నీవంటి మూర్ఖు లీలోకమం దెవ్వరైన నుందురా?

క్షితీశుని హృత్పిండ మస్వాభావికముగాఁ గొట్టుకొనఁ దొడంగెను.

కాని యాతఁ డేమియు మాటాడఁ జాలకపోయెను. చండిక యాతని కలవరమును, కుటుంబమును, వారినడవడిని, వారి నీచవ్యాపారమును బయటపడి విషయముల విశేషణములతో వ్యాఖ్యానము చేయుచుఁ జటాలున నటునుండి పోయి, నేర్పుగా శివమోహినిని బిలిచి సాలంకార యుక్తముగా సమస్త వృత్తాంతమును జెప్పి పడకటింటికిఁ బంపివైచెను.

కొలఁదిసేపటిలోనే శివమోహిని జేవురించినముఖముతో శయనమందిరమునఁ బ్రవేశించి చాలసేపటివఱకును రోజుచుఁ గదకు క్షితీశునిం గాంచి "ఏమైనది?" అని ప్రశ్నించెను.

"అగుట కేమున్నది?" అని క్షితీశుఁడు మందహాసము చేసెను. అది కేవలమును శుష్కహాసమాత్రమే — అందు నిరానందము వికటవికాసమునుం గాంచి యుండెను!

శివమోహిని కనుబొమలు ముడివైచి "నీ వేమి చూడఁబోయితివి?" అనెను.

క్షితీ — నా శ్రాద్ధము!

శివ — అది శీఘ్రముగ నైనచో నీకష్టమే లేకుండును!

క్షితీ — అందుకొఱకే నేను నిత్యమును భగవానుని బ్రార్థించుచున్నాను. కాని యాతఁ డీ నిర్భాగ్యుని ప్రార్థనమును జెవిని బెట్టుటలేదు.

శివ — మాటలు చల్లగనే యుండును గాని, గుండెలను మండించి బూడిదచేసి వైచును! నీవంటిమగని గాంచునంతటి నిర్భాగ్యురాలీ లోకమునం దింకొకతె యెవ్వతెయు నుండదు!

క్షితీ — ఔను. నీవన్నమాట నిజమే. కాని నేనిప్పుడు చేసిన తప్పేమున్నది? నాపై నింతకోప మెందుకు?

శివ — ఓ! కూడుపెట్టుట కొక్కరును లేరు గాని, కొంపఁగోయుట కందఱు బెద్దలే - కేవలము నాయక్కమగఁడు. ఆతనిచెంత గూర్చుండి మాటాడుచుంటిని. అందుకొఱకుఁ దొంగి తొంగి చూచుటా? అంతే

కాక యీవిషయమున మాయమ్మయొద్ద నిష్టమువచ్చినట్లు సంభాషించుటా? అన్నదాసుని కంతపొగరెందుకు? అంతకోపమా?

క్షితీ — నాకేమికోపము. అన్నదాసుఁడను మాత్రమే కాదు. క్రీతదాసుఁడనే. ఈయింటిబానిసనై యున్నాను. భగవంతుఁ డెప్పటి కేయవస్థ కల్పించునో యట్లుండక తప్పునా? ఇది యంతయును స్వయంకృతాపరాధమునకుఁ బ్రాయశ్చిత్తము గాక మఱేమి?

శివ — ఎవరియవస్థకుఁ దగినట్లు వారుండుట యుచితము. ఎవరికర్మ ఫలము వారనుభవింపక యితరు లనుభవింతురా?

క్షితీ — ఆమాట నిజమే. నాసంగతేమి! చాలరాత్రి యైనది. ఇంకను నిద్రింపవా?

శివ — నేను నిద్రపోను.

క్షితీ — అట్లయినచో శావమొద్దకుఁ బోయి మఱిరెండు పాటలు పాడుము!

శివమోహిని క్రుద్ధించినదానివలె నెగసిపడి గర్జించుచు "అట్లయినచో నేను పాటలు పాడుకొనుచు నిచ్చవచ్చినట్లు తిరుగుచున్నానా!" అని గర్జించెను.

క్షితీశుఁడు భార్యచేయి పట్టుకొని "కేకలు పెట్టకుము! నన్ను క్షమింపుము. నేను నిన్నేమియు ననలేదు. ఇప్పుడు మీయమ్మ వచ్చి నోటికివచ్చిన ట్లెల్ల దిట్టిపోయినది. మరల నీవా!" అనెను.

శివ — అట్లయినచో నాయొద్ద నెందు కుండవలయును? నేను గయ్యాళిని - మాయమ్మ గయ్యాళిది. మాయన్న కటుభాషి — మేమందఱమును చెడ్డవారము - ఇట్టివారిపంచను బడి నీవుండు టెందుకు?

క్షితీశుఁ డిక మాటాడలేదు. క్రమముగా శివమోహిని స్వరము సప్తస్థానములను దాటిపోవుచుండెను. అది విని మరల సత్తగారు వచ్చునేమో యనియాతఁడు భయపడెను. ఊరకుండుటయే యుత్తమ

మని యూరకే యాలోచించుకొనియెను. శివమోహిని యేమేమో గొణుగు కొనుచుఁ గొంతసేపటికిఁ బడక జేసుకొనెను.

౬౭

ఆమఱునాఁడు క్షితీశుఁ డెండ యెక్కునప్పటికిఁ బొలములు దిరిగి వచ్చి తొందరగా స్నానముచేసి భోజనమునకై వంట యింటికిఁ బోయెను. చండిక యాతనికి చలిదియన్నము వడ్డించి "అల్లుఁడింకను నింట నున్నాఁడు. పెందలకడనే వంట కాదని యెంచి రాత్రియే నీకొఱకు వంట చేసితిని" అని చెప్పెను.

క్షితీ — మంచిపని చేసితిరి. నిన్నను వేళకు భోజనములేక పనిలోనికిఁ బోలేకపోయితిని.

"అన్నము లేక పోఁజాలనైతిని" అను నల్లునిమాట యత్తగారి చెవికి ములికివలె నాఁటెను. ఆమె క్రోధస్వరముతో "బాబూ! నీ మాటలన్నియును జండాలపుమాటలే. ఇందుచేతనే మాయమ్మాయియు సోదరులును నీతోఁ బడలేకపోయిరి. నీకెప్పు డన్నము లేకపోయినదయ్యా! తుదకుఁ గలిగినది మాకీయపవాదా? మాయబ్బాయికిఁ దిండికి గతిలేదా!" అనెను.

క్షితీ — కాదమ్మా! నేనందుకు జెప్పలేదు. అన్నగారు వచ్చుట వలనఁ గొంచెము వంటయాలస్య మైనది. వేళ మించుటచే నేను బనికిఁ బోలేదు! ఇంతేనా నే నన్నది!

చండి — ఇదిగో! చూడుము! వక్రభావము లేకుండ నీమాట యొక్కటియు నుండదు. నాకందఱల్లుండ్రును నొక్కటియే. చేతి కైదు వ్రేళ్లును సమానమే గాదా? నీకీ కడుపుబ్బెందుకు? రాయచరణుఁడు వచ్చెనుగాన నేను నీకన్నము పెట్టలేదు! ఇంతేనా నీయభిప్రాయము! అయ్యో నాయనా! ఈమాట యెవ్వరైన విన్న నేమనుకొందురు!

రాక్షసునకు బట్టలను నిచ్చి పోషించుచున్నందుకు నాకీకళంకము! పాలు పోసి పామును బెంచినట్లయినది!

ఇదేమనిన నేమి వచ్చునో యని క్షితీశుఁడు మాఱుమాటాడక నిశ్శబ్దముగఁ బెట్టినదానిని దిని యుత్తరాపోశనము పట్టి చేయి గడిగికొని తనగదిలోనికిఁ బోయెను. శివమోహిని లోపలనే యుండెనుగాని నిన్నరాత్రినుండియు నామె యాతనితో మాటాడుట లేదు. క్షితీశుఁ డామెను దాంబూల మడిగెను. ఆమాట చెవిని బెట్టుకొనకుండ నామె వంటయింట వెలుపలికిఁ బోయెను. వేళ మించిపోవుచుండుటచే క్షితీశుఁడు తాంబూలముపై నాశవదలుకొని కార్యస్థానమునకు వెడలిపోయెను.

సాహుకారు రాతనిం గాంచి యనేకవిధముల జీవాట్లు పెట్టుచు "నీ వంటి వానివలన మాపనులు జరుగునట్లు లేదు. నిన్న నెంతయోపని నీవు రాకుండుటచే నాగిపోయినది. అందువలన నాకెంతనష్టము కలిగెనో నీకుఁ దెలియదు! కర్తవ్యజ్ఞానమును, బాధ్యతయు నెఱుంగని నీవు నాయొద్దఁ బనిచేయుటకుఁ దగవు. నీలెక్క తేల్చుకొని యిచ్చి పుచ్చుకొనుటలు నేఁడే తీర్చుకొనుము! రేపటినుండి నీవు నాపనికి రానక్కఱలేదు!" అని స్పష్టముగాఁ జెప్పివైచెను.

ఆమాట లన్నియుఁ దన్నుఁ గానట్లుగనే క్షితీశుఁడు తలవంచుకొని లెక్క వ్రాసికొనుచుండెను. యజమాని విసుఁగుతో నెన్నియో రీతులఁ గేకలువైచివైచి తుదకూరకుండెను. కాని తుదకు "మరల నెన్నఁడైన నిట్టిపని జరిగినచో నానాఁడే నిన్ను మెడఁబట్టి యావలికి గెంటించివైచెదను!" అని యదలించి యటనుండి పోయెను.

"కాసునకు గతిలేనివాఁ డెవ్వరేమన్న సహించి యూరకుండవలసినదే" అని క్షితీశుఁ డనుకొనెను. కాని యాసమయమునం దాతని యాత్మీయు లెవరైన నట నున్నచో "బాబూ! ఈపాడుపొట్టకొఱకు క్షణక్షణమును బ్రతిదినమును నిట్టియవమానములను బడుట యెందుకు?

అత్యగౌరవముతో జంపుకొనుటకంటె జన్మమునకు మేలుగాదా?" అని బుద్ధిచెప్పియే యుందురు. కాని క్షితీశుని యీదురవస్థకు హేతుభూతమైనది కేవలధనాభావము గాదు! అతని బుద్ధిదోషమే దీని కంతకును మూలకారణమైనది!

క్షితీశుఁడు పని ముగించుకొని యింటికి వచ్చునప్పటికి సావడిలో నిరుగుపొరుగు వారందఱును జేరి యుండిరి. హరిచరణుని తమ్ముఁడగు రాధాచరణుఁ డాదినమున నింటికి వచ్చి రామాయణ పురాణ పఠనము గావించుచుండెను. ఆడువాండ్రును, మగవాండ్రును వేర్వేరుగ గూర్చుండి వినుచుండిరి. రాధాచరణుఁడు చదివి వారి కర్థము బోధించుచుండెను. అతఁ డొకపద్యమును నాలుగైదుసారులు చదివి యర్థము చెప్పఁజాలక "నాకు దీనిభావము బోధపడలేదు" అనెను.

చండీ — బాబురా! ఇంతచదువు చదివిన నీకే తెలియదా?

రాధా - అవునమ్మా! ఈపద్యము చాల కఠినముగా నున్నది.

చండి - మీపెద్దబావ నడుగుము. చెప్పునేమో!

రాధాచరణుఁ డాపద్యమును మరలఁ జదివెను. రామచరణుఁడు కూడ దానియర్థమును జెప్పలేకపోయెను. రాధాచరణుఁడు నవ్వుచు "దీని నిక్కడి వారెవ్వరును వ్యాఖ్యానము చేయఁజాలరు. చిన్న బావగారు చెప్పిన జెప్పవచ్చును" అనెను.

చండిక యామాటవిని యాశ్చర్యపడిపోయెను. చాల జదివిన రాధాచరణునకును మహాభాగ్యవంతుఁడై గొప్పయుద్యోగము చేయుచున్న రామచరణునకును దెలియనిది యాలుమగాయుల వేతనము దెచ్చుకొనుచు నన్నదాసుఁడై యున్న క్షితీశునకుఁ దెలియునన్న విషయ మామె విశ్వసింపలేదు. కాని క్షితీశుఁ డాపద్యమును జదివి స్పష్టముగా దాని యర్థము నందఱికిని బోధపఱచెను.

అప్పుడు చండిక తనలో "పెద్దయల్లుఁడు పెద్దయుద్యోగము చేయుచు

మాటాడుటయేనా యడిగేసితివప్పా! నీచపుపందకొడుకా!" అనెను.

రాయచరణునకు క్రిస్తీయునిపై నిదివఱకే కోపముగ నుండెను. అతఁడు సమయమును చూచుకొని "కంటికిఱెప్పలవలె కనును, పెంపుడుకుక్కకు నింటి కితరులు వచ్చినచో వారిపైఁ గస్సుబుస్సుమనుట స్వభావము! ఇంత గొడవ యెందుకు! నేను నేఁటి యుదయముననే పోయెదను!" అనెను.

చండి — అయ్యో! నేనేమి చేయుదును! దురదృష్టవశమున నాకీ నీచసంబంధము వచ్చినది. బంగారుబొమ్మవంటిబిడ్డను నీనిచేతిలోఁ బెట్టి నప్పటినుండియు నేను పడుచున్న బాధ దేవునికే యెఱుక!

హరిచరణుఁ డప్పుడు కోపముతో క్రిస్తీయునిఁగాంచి "ఇదిగో! నీవు మఱియొక మార్గము చూచుకొనుము! నేఁటినుండి నీవు మాయింట నుండుట కవకాశము లేదు!" అని స్పష్టముగాఁ జెప్పివైచెను.

ఇంతవఱ కెవ్వ రెన్నిమాట లనుచున్నను క్రిస్తీయుఁడు బదులుచెప్పక మౌనము వహించి యుండెను. ఇప్పుడు హరిచరణునిమాటకు "అట్లే చేసెదను!" అనియెను. "సరే!" అని హరిచరణుఁడు క్రిస్తీయునిప్రవర్తనముం గూర్చి యనేకవిధముల దోషారోపణముం జేసి నిందించుచు వెడలిపోయెను. ఇట్లందఱును బోయినతరువాత క్రిస్తీయుఁడు పరాభూతుఁ డగు యోధునివలె నేకాకియై భగ్నహృదయముతో దనగదిలోనికిఁ బోయి కూర్చుండెను.

అప్పు డాతనిహృదయమునఁ బరాభవదావానలజ్వాలలు ప్రజ్వలించుచుండెను. "నేనెవ్వరికొఱ కింతపని చేసితిని! నేను, నాభార్యను బ్రాణముకంటెఁ బ్రియముగఁ బ్రేమించితినిగదా! అట్టియమూల్యప్రేమ కిదియా ప్రతిఫలము!" అని భావించుకొనుచు నంతరంగమునందలి యంతస్స్వరమంతయుఁ గలఁగిపోవునట్లుగా నొక్కదీర్ఘశ్వాసమును విడిచెను. ఆ నిట్టూర్పుతో నాతఁడు శయ్యపై నొరఁగి పరుండెను.

క్రమముగాఁ జాలరాత్రి యయ్యెను. హరిచరణరాయచరణుల భోజనము లైనంతనే క్షితీశునకుఁ బిలుపువచ్చెను. కాని యస్వస్థతగా నున్నదని చెప్పి యాతఁడు భోజనమునకుఁ బోలేదు. ఆమాట విని చండిక హేళనగా "అయ్యగారికిఁ గోపము వచ్చినది కాఁబోలును. బ్రతిమాలి తీర్చువా రిట నెవ్వరును లేరు!" అనెను.

ఇంతలో శివమోహిని యన్నము దిని తాంబూలము వేసికొనుచు గదిలోనికి వచ్చెను. కాని యామె క్షితీశునితో మాటాడలేదు. మౌనముతోనే పడకపైఁ బరుండెను. క్షితీశుఁడును మాటాడలేదు. ఇట్లు కొంతసేపు గడచెను. ఇంటిలోనివా రందఱును నిదురించుచుండిరి. అప్పుడు క్షితీశుఁడు భార్యం గాంచి "ఒకసారి లేచి నామాట వినుము!" అనెను.

శివమోహిని మిగులవిరక్తితో "రాత్రి రెండుజాముల వేళ మీకింకను నేమిమాటలు? నేఁజచ్చువఱకు నాకు మీపీడవదలదు కాఁబోలు!" ననెను.

క్షితీశుఁ డొక్కనిట్టూర్పు విడిచి "ఇదియే కడపటిసారి! నేటి నుండి నీవు సుఖముగా నుండవచ్చును! నేను నిన్నుఁ బ్రాణసమానముగఁ బ్రేమించుచున్నాను. నీకొఱకు నా తల్లిని, సోదరులను, బంధువులను గూడఁ బరిత్యజించి వచ్చితిని. నీకొఱకే స్వస్థానభ్రష్టుఁడనై పరద్వారములయొద్ద బానిసతనముచేయుట కొడంబడితిని. అట్టి నాప్రేమకు నీవు తగిన ప్రతిదానమునే గావించితివి!" అనెను.

శివమోహిని మొగము ముడుచుకొని కన్నులెఱ్ఱఁజేసికొని వికటస్వరముతో "మీరు నానిమిత్తమే సర్వమును త్యజింపవలసివచ్చినది! నేను మీకుఁ బరమశత్రువును! ఇట్టిచో మీరు నాయొద్ద నుండు టెందుకు? మీకెక్కడ సుఖమో యక్కడకే పోయి యుండవచ్చును!" అనెను.

క్షితీ — ఇంటికా? కాదు! నేనెంతమాత్రము నింటికిఁ బోను! నాకీ ప్రపంచతత్త్వము బాగుగ బోధపడినది. ప్రపంచ మంతయు దేనికి వశమైయుండునో తెలిసిపోయినది! ఇఁక నేను ధన మెచ్చట నుండునో

యున్నప్పటికిఁ బోలేనను.

శివ — మిా యదృష్టము నదియే నప్పటికిఁ బొందు నాకేమి? ఊరక నన్ను లేపి పిలిచి పీడించు టెందుకు?

క్షితీ — నీకు కష్టముగా నున్నచో నిఁకనిన్నుఁ బిలువను. పరుం డుము! ఇఁకొక్కమాట — ఇదిగో! నీకొరకు కీలినయున నొక సెంటు బుడ్డిని గొని తెచ్చితిని తీసికొనుము! ఈజీవితములో నిఁక నీకేవస్తువు నైనఁ దెచ్చుట సంభవింప దనుకొందును.

అనుచు క్షితీశుఁడు బాష్పపూర్ణ నయనములతో అత్తరుబుడ్డిని శివ మోహినిచేతి కందించెను. "నాకంతగా నవసరముండలేదు." అని యా సీసాను విసరివైచెను. అప్పుడు శివమోహిని మంచముమిాఁద నుండెను. చాలసేపటినుండి క్షితీశుఁడు క్రిందఁ గూర్చుండి యుండెను. అందుచే సెంటుసీసా టక్కున నాతని కపాలమునకుఁ దగిలి క్రింద బడి పోయెను! ఆదెబ్బకు మొగముపై నొకచో గీచుకొనిపోయి రక్తము కారుచుండెను. రక్తధార యాతని చెక్కిలినుండి దిగజారుచుండెను. శివ మోహిని యావంకఁ జూడనైనఁ జూడక పరుండి నిద్రించెను. రక్త వేగము నాపుట కించుక ప్రయత్నమైనఁ జేయలేదు!

క్షితీశుఁడు కుండలోని జలముతో రక్తమును దుడుచుకొని తన బట్టలు కట్టుకొని చినుగులగొడుగు చేతఁ బట్టుకొని శివమోహిని నుద్దే శించి "ఒకసారి లేచి తలుపు వైచుకొనుము! నేనదృష్టమును వెదకు కొనుచుఁ బోవుచున్నాను. మనకిఁక నెన్నఁటికిని జూపు లుండవు - ఇదియే కడసారి యనుకొందును!" అనెను.

శివమోహిని తలయెత్తి చూచెను. ఆ వెలుఁగులో క్షితీశుని దుఃఖాశ్రునయనములు మిలమిలలాడుచుండెను. ఆతనిశరీర మంతటను విషాదచ్ఛాయ యావరించి యుండెను. ఆతని కపాలమునుండి యింకను రక్తస్రావ మగుచుండెను. క్షితీశుఁ డిఁక నచ్చట నిలువలేదు. ఆ నిశ్శబ్ద

నిశీథ సమయమునఁ బథికసమ్మర్ద మించుకంతయును లేని గ్రామ్యపథము ననుసరించి రోహితుఁడు వెడలిపోయెను.

"ఎక్కడకుఁ బోవుదు? ఇప్పుడే తిరిగి వచ్చెదను!" అని శివమోహిని యనుకొనెను. గదిలో సన్ననిదీపము క్షీణకాంతితో వెలుఁగుచు నుండెను. జాలకమార్గమున మెల్లమెల్లగఁ బిల్లవాయువులు వీతెంచుచు నొంటిగనున్న శివమోహినిని వడకింపుటయే కాక పగిలిన సెంటుసీసా నుండి పారిజాత పరిమళమును గదియంతయును గుబాళింపఁ జేయుచుండెను. "ఇప్పుడు వచ్చు నిప్పుడువచ్చు నని శివమోహిని చాలసేపు గడపెను. "ఇంకెప్పుడు వచ్చెదరు; ఇఁక రానే రారా? మాయమ్మ స్పష్టముగా బొమ్మనెను. మాయమ్మ నోటికిరాని తిట్లు తిట్టినది. ఇఁక మంద భాగ్యురాల నగునేనో — కొంచెమైన లక్ష్యము చేయనైతిని. సీసాను విసరి నెత్తురువచ్చునట్లు గొట్టితిని. ఈకారణములవలన నాయన యిఁక రారేమో! పోయెదనన్న బొమ్మంటినిగాని వలదన లేకపోయితి నేమి? నేను వలదన్నచో నట్లు పోఁగలరా!" అని శంకించుకొనుచుండగనే శివమోహిని కన్నుల నీరు నిండిపోయెను. ఆమె పైట చెఱఁగుతోఁ గన్నీరు దుడిచికొనుచు ద్వారమునొద్దకుఁ బోయెను — ఒకసారి వాకిలివైపునకు దృష్టి సారించెను. ఏమున్నది? అంతటను నిశ్శబ్దము. సర్వత్రజనశూన్యము. ఎల్లెడల నంధకారము! ఆమె మరలఁ దలుపు మూసికొని మంచముపైఁ బడిపోయెను.

## ౫౧

శివమోహిని తెల్లవారకుండఁగనే లేచెను. అప్పు డామెకు గృహమంతయు శూన్యముగా నగపడుచుండెను. హరిచరణుఁడు తల్లినుద్దేశించి "క్షితీశుఁడు పొలమునకుఁ బోయినాఁడా?" అని ప్రశ్నించెను. చండిక విసుఁగుతో "ఏమో బాబూ! నా కతనిచర్య లేమియు బాగుగ నగపడుట

లేను. నిన్న నాతఁడు కోపగించినాఁడు. తెల్లవారుజామున లేచి పొలము పోవలె నని చెప్పితిని'' అనియెను.

హరి — ఏమైనాఁడో శివమోహిని నడిగి తెలిసికొనుము.

చండిక తనయయొద్దకుఁ బోయి యడిగెను. శివమోహిని మ్లాన వదనముతో "రాత్రియే యెక్కడకో పోయినారు'' అనెను.

చండి — ఎక్కడికిఁ బోవును ? ఇంటికే పోయె ననుకొందును ! పోనిమ్ము ! శని వదలిపోయినది.

మఱియొకప్పు డైనచో శివమోహిని కామాట యంతకష్టముగా నుండక పోవును ! ఇప్పు డామెకు తల్లిమాట బల్లెమువలె గుండెలపై గ్రుచ్చుకొనెను. ఆమె విరక్తస్వరముతో "పోక యేమి చేయుదురు ? ఎల్ల కాలమును నీయింటనే పడి యుండవలయునా ?'' అనెను.

తల్లి యామాట వినిపించుకొనకుండఁ బోయి కుమారునితో "రాత్రి యే పోయినాఁడఁట !'' అని చెప్పెను. హరిచరణుఁడు క్రోధముతో "ఎంతకృతఘ్నుఁడు. మంచి పనిదినములలోఁ బాఱిపోయినాఁడా ?'' అని నిందింపఁదొడఁగెను. శివమోహినియుఁ దమ్ముఁ డగురాధాచరణుఁడు నచ్చటనేయుండిరి.

రాధాచరణుఁ డన్నమాట విని మిగుల విచారముతో "అన్నా ! నిన్న నీవాతని నన్నమాట కాతఁ డెట్లీయింట నుండఁగలఁడు ? మీ రందఱు నాతని నెంతో నీచునిగ భావించుచున్నారు. కాని నిజముగా నాతఁ డట్టివాఁడు గాఁడు ! మీరందఱు నాతని మూఢునిగ భావించు చున్నారు. కాని యాతఁ డట్టివాఁడును గాఁడు - కాని యోర్పునుపది యందఱకు నెల్లకాలము నొకరీతిగ నుండదు !'' అనెను. కన్నీటితో శివమోహిని తమ్మునివంకఁ జూచుచు నాతనిమాటలు వినుచుండెను. ఆమె పొంగిపొరలి వచ్చుచున్న దుఃఖ శ్వాసములను లోలోననే యడంచు కొని "నేను శతాపరాధములను గావించితిని. కాని యాయన యెన్నఁడును నన్నుగూర్చి యొకకటువచనమైన నాడియుండలేదు.

ఓర్పునునది యందఱికి నెల్లకాలము నొకరీతి నుండదు" అని నొచ్చు కొనుచు రాధాచరణుని దనగదిలోనికిఁ బిలిచి "తమ్ముఁడా! నేనొక మాట చెప్పెదను. వినుదువా?" అనెను.

రాధా — అదేమో చెప్పుము.

శివ — నేను నీకు సొమ్మిచ్చెదను. ఎవ్వనినైనఁ గూలివానిని బంపి మీ బావ యింటియొద్ద నున్నారేమో తెలిసికొనిరమ్మని చెప్పుము!

రాధా — అట్లే పంపెదను. డబ్బియనక్కఱలేదు. నాయొద్దనున్నది.

శివమోహినికన్నుల నీరునిండిపోయెను. ఆమె దుఃఖగద్గదస్వరముతో "ఈ సంగతి మనయింట నెవ్వరికిని దెలియఁగూడదు. కూలి వానిని మనయింటికి రానీయవద్దు. వాని నటకుఁ బంపి క్షేమసమాచారము వానివలన నీవు తెలిసికొని నాకుఁజెప్పుము. తెలిసినదా!" అనెను.

రాధాచరణుఁడు అక్కచెప్పినట్లే చేసెను. క్షితీశుఁ డింటికిఁ జేరలేదని వార్తవచ్చెను. ఆవార్త నాతఁడు శివమోహినికిఁ దెలిపెను. అది విని శివమోహినిగుండె గుటుక్కుమనియెను. క్షితీశుఁడు తన్ను విడిచి పోయినఁ దనప్రాణము లిట్లు తల్లడిల్లిపోవునని శివమోహిని యింతకు ముందు గ్రహించుకొని యుండలేదు. "నేనువిసరిన సీసాదెబ్బకు మొగముపై గాయమై రక్తము ప్రవహించుచుండఁగా - అయ్యో! నిర్భాగ్యురాల నగు నేను రాక్షసివలెఁ జూచుచుంటిని గాని చెంగుతోఁ దుడువ జాలకపోయితి నేమి! ఆయన చెమ్మగిలిన నేత్రములతో వడఁకు చున్న స్వరముతో పోయెద నని చెప్పినప్పుడు మాటాడ కూరకుంటిని గాని పాదములపైఁ బడి, వలదని బ్రతిమాలఁజాలకపోయితి నేమి!" అని పశ్చాత్తాపపడఁ దొడంగెను.

## ౫౨

శాంతిదేవి జయంతియొడిలో దలనుంచి యేడ్చుచుండెను. ఆ యేడ్పు నిశ్శబ్దమైనది — కన్నీరుకూడ నిశ్శబ్దముగా నామె చెక్కులనుండి

బాష్పాకులయయ్యెను. అదిచూచి జయంతి "అదేమక్కా! ఏడ్చు చున్నావా? నేను త్వరగనే వచ్చెదను. నాకొఱ కింతదుఃఖ పడెద వెందుకు?" అనెను.

శాంతి కన్నులు తుడిచికొని "అక్కా— ఈజగమున నన్ను ప్రేమించు వారెవ్వరు లేరు. నేను నిన్నే యాధారముగ జూచుకొని నీచెంత నుంటిని. ఇప్పుడు నీవు నన్నువిడిచి పోవుచుంటివి. అత్తగారు వృద్ధురాలైనది. ఆమె యింకను పిచ్చిదైపోకుండ నింటనే యుండుట మా యదృష్టమే యని యందఱు ననుచున్నారు. ఇంక జిన్నయక్క జీవచ్ఛవమై యున్నది. ఒంటిదాననగు నేను నీచెఱగు పట్టుకొని యెట్లో తిరుగుచున్నాను. నీవును బోయినచో నీయింట నేనొంటిగా నెట్లుండగలను?" అనియెను.

జయం — నేను పోక తప్పదు తల్లీ! ఆమె కించుక యారోగ్యము కలిగినవెంటనే తిరిగి వచ్చెదను.

శాంతి — అక్కా! పోక తప్పకేమి! ఎక్కడనో మామేనత్త యత్తగారు! నీకెంత దగ్గఱసంబంధము! ఆమెకు జబ్బుగా నున్నచో నుపచారములు చేయుటకు నీవే పోవలసిన పని యేమి? ఇంకెవ్వరు నుండరా?

జయం — పోకుండుట యధర్మము! అందుచేతనే కట్టిపెట్టుము తగదు. ఈవిషయము నీకెన్నాళ్ళనుండియో బోధించుచున్నాను. తనవారు, పెరవారు ననుభేదము నెంచకుండ రమణీమణి యగునది రోగార్తులకు శుశ్రూష చేయవలెను. శోకార్తుల నూఱడింపవలయును. ఎవ్వరు ప్రార్థింతురో యెవ్వరు శరణాగతు లగుదురో వారందఱికి నుపకారము గావించుటయే స్త్రీకిఁ బరమ ధర్మము.

శాంతి — అట్లయినచోఁ బొమ్ము! త్వరగా వచ్చెదవా?

జయం — రాకేమి? ఈలోపల బుల్లి మఱఁది యుత్తరము వచ్చినచో నాకుఁ గబురు పంపుము.

శాంతి — నాకట్టి యాశ లేదు. మఱుఁది పాంచకౌడీ కలకత్తాకుఁబోయిన యీమూఁడుమాసములలోను నైదుజాబులను వ్రాసెను. కాని యాయన యొకయుత్తరమైన వ్రాసినారా! మఱుఁది వ్రాసినజాబులలోని భావమును గ్రహింప లేదా?

జయం — గ్రహించితిని — ఆవన్నెలవిసనకఱ్ఱ చీకటి దయ్యమువలె వెంబడించియే తిరుగుచు బీడించుచున్నది.

శాంతి — ఇందాదయ్యపు దోషమేమున్నది!

జయంతి నవ్వుచు "నీవు దాసివలె నాతని వశపఱచుకొనఁ జాలితివా!" అనెను.

శాంతి — ఆమాటలు నిజమే — నాకంతశక్తియే యున్నచో నీవు నన్ను విడిచి పోఁగలవా!

జయంతి శాంతిని ముద్దుపెట్టుకొని వంటయింటిలోనికిఁ బోయెను. శాంతియు నామెవెనువెంట యనుసరించెను. ఆరాత్రి తెల్లవాఱు జామున జయంతి బండిపై బయలు దేఱిపోయెను. ఏయింట బాధలును, దుఃఖములును, యాతనలు నుండునో, యాయిండ్లకెల్లఁ బోయి శక్తి కొలఁది సాయపడుచుండుటయే జయంతి జీవితమునకు ముఖ్యవ్రతమై యుండెను. ఫలాపేక్ష లేకుండ నామె తనవిధాయక ధర్మములను నిర్వర్తించి నిశ్చలము, నపారమునగు నానందానుభవము నందుకొనుచుండును.

జయంతి వెడలిపోయినతరువాత నాయింట శాంతియు, గౌరాంగియు, రామసేవకుఁడును, నాతనితల్లియు, రమాదేవియు, దాసియు మాత్రమే యుండిరి. రమాదేవి ముసలితనముచేతను, విచారముచేతను గ్రుంగి యుండెను. ఆమె యెప్పుడును వంటయింటికి వచ్చుటలేదు. పుత్రిశోకాతుర యగుగౌరాంగియు నట్లేవిరక్తయై యేపనికిని జేయి చేసికొనుట లేదు. దుర్గాంబ యింటికి వచ్చినచుట్టము. అందువలన నామెచే వంట గాని, యితరకార్యములు గాని చేయింపఁగూడదుగద! ఇఁక నింటి

పను లన్నియును దాసిసాయముతో శాంతియే తీర్చుకొనవలసి యుండెను. శాంతి కా పను లేనియూ కష్టముగ దోచుటలేదు. ఆమె ప్రాతఃకాలముననే లేచి రాత్రి రెండు జాములవఱకు నింటిపనులను జేసికొనుచునే యుండెను. జయంతి యామెను దిద్దితీర్చినది! ఆఁడుది పనిచేయుటకే జన్మించె ననియు, సేవ చేయుటయే యామెకు మహావ్రత మనియు నామె శాంతికి బోధించినది. శాంతి యావ్రతమును బ్రాణపణముగ నిర్వహించుచున్నది.

ఉత్తుంగశైలశిఖరము నధిరోహించి యున్న వ్యక్తి ప్రబలవాయు తాడనములవలనను, ప్రచండమార్తాండ కిరణతాపమువలనను, దారుణ వర్షధారాప్రహారములవలనను సంక్షుభితుఁ డగుచుండియు దిగంత వ్యాప్తమును, విశ్వమోహనకరము నగుప్రకృతి దేవి నగ్న సౌందర్యమును దర్శించుచు నెట్లు తన్మయుఁడై యుండునో, యట్లే శాంతిదేవియు స్వామి తిరస్కారమును, స్వామివిరహమును, కుటుంబ దారిద్ర్యమును, దుస్సహజీవితకష్టములను ననుభవించుచుండియును బతిదేవతామందిర మార్జనము గావించుచుఁ బతిధ్యానతన్మయయై యుండెను. ఇట్టిశిక్షణము నామెకు జయంతి యుపదేశించియుండెను. ఆమెయే శాంతి కెట్లు సుఖములభించునో యట్లుగావించెను. స్త్రీ కింతకంటెను సుఖమేమున్నది? సతీమణికి జగదానందమే యాత్మానందము. రమణీమణికిఁ బవిత్రత్వ మును, గార్యనిర్వహణమునుమాత్రమే వాంఛనీయములైనవి. ఏ యువతి హృదయాంతరాళమునం దనంతప్రేమనాకులోచ్ఛ్వాసము ప్రతిక్షణ మునను దరంగిత మగుచుండునో, అవిచ్ఛిన్న ప్రేమబంధముచే నేరమణీ మణి తన యాత్మేశ్వరుని దనచిన్నహృదయమున నిలుపుకొనఁగలిగి యుండునో యట్టిపతిప్రాణయగు పతివ్రతకుఁ బతివియోగదుఃఖ మెట్టి వేదనను గలిగింపఁగలదు?

జయంతి యుపదేశములవలన శాంతిదేవి హృదయము నిశ్చల

మయ్యెను. అందుచేతనే ఎవ్వతె యింతకుఁ బూర్వ మాత్మేశ్వరుని క్షణ విరహామునుగూడ సహింపఁజాల కుండెనో, యెవ్వతె సంతతమతని యించుకంతైనఁ బతిస్పర్శకొఱకు కల్లాడుచుండెనో, ఆనందప్రఫుల్లములగు మధురభాషణముల నాలకించుట కెవ్వతె శ్రవణములు నిరంతర వాంఛాపూర్ణములై యుండెనో, హృదయ మాకులభావలేశముచేఁ గలఁగిపోవుచుండెనో యవి యన్నియును మఱచి యిప్పు డాశాంతిదేవి తనస్వామి యితరుల కధీనుఁడై పోయినను, తనకొకసారియైన దర్శన మీయకున్నను, సకలమర్మాంతికవేదనలును దన్ను వేధించుచున్నను లక్ష్యము చేయక ప్రాణములతో నిలువఁబడి యుండఁగల్గినది! ఏవికసిత యౌవనమునందలి ముకుళితానురాగము తనవాంఛితధనమును శిరీషకుసుమకోమలబాహువల్లికలచే నాలింగనమునందు బంధించి నిలుపఁ గోరుకొనుచుండెనో, ఏప్రియసంభాషణ మాలకించుట లభింపక యభిమానముచే నే చెక్కుటద్దములనుండి యశ్రుముక్తామణులు జాలువారుచుండెనో, యెవ్వని యనాదరశంకచే నేక్షణహృదయము దడదడఁ గొట్టుకొనిపోవుచుండెనో యావాంఛితధనము — ఆ జీవితసర్వస్వ మిప్పు డన్యాధీన మైపోయినది — ఇవియన్నియు స్మృతికిఁ దోఁచినప్పుడెల్ల నామెగుండెలు పగిలి పోవుచుండెను — కాని యామె యిప్పుడు తనమనసునందు దృఢనిశ్చయము గావించుకొన్నది. "నే నాయనకుటుంబమునకును, ఆయనమందిరద్వారములకును విధాయకకృత్యములను గావించుచుందును. ఇదియే నాకుఁ బరమసౌభాగ్యము! ఇదియే నా నారీజన్మమునకు సార్థకత్వము! ఆయన గుణవంతులు! నేనజ్ఞానురాలను! గుణహీనురాలను! నామూలమున నాయనకు జిత్తవినోదము లభించుట కవకాశము లేదు! లభింపదు! ఆయనసుఖానందముల నేనేల విఘ్నము గూర్పవలయును! ఆయన సుఖముగ నుండనిమ్ము! నేను మందభాగ్యురాలను. ఎట్లో యీజీవితశేషమును గడపుకొందును" అని —

కాని యట్లూఱడిల్లి యుండుటకుఁగూడ నామె కవకాశము లేక పోయెను. అపాపవిద్ధమును, అనింద్యసుందరము నగునామె సుకుమార మోహనమూర్తిపై దురాత్ముఁడగు రామసేవకుని పాపవీక్షణములు ప్రసరింప నారంభించెను!

## ౫౩

రామసేవకుఁ డీ కొలఁది మాసములలోనే గ్రామమునందు గౌరవ లాభము నందఁ గలిగెను. కాని యాతఁడు పెద్దమనుష్యులుండు చోటి కెన్నఁడును బోవుటలేదు. ఆతఁ డెప్పుడు నుదయము తొమ్మిది గంటలకు నిద్రనుండి లేచును. ఒకప్పు డంతకంటెనుఁ బ్రొద్దెక్కుచుండును. చెప్ప మఱచితిమి. ఏనాఁడైన నెంత ప్రొద్దెక్కినను నాతని లేపకుండ మెలఁకువ రాదు. ఆతని హుక్కాను సిద్ధపఱచి లేపినఁగాని యాతఁడు లేవఁడు. లేచినను గొంతసేపు పడకయం దుండియే హుక్కాను సేవించి కొంతసేపటికి పడక వదలి ప్రాతఃకృత్యములను దీర్చుకొనఁ బోవును.

ఆతఁడు మొగము కడుగుకొని యందఱును స్నానమునకుఁ బోవు వీధిలోఁ గూర్చుండి కొంతసేపు కాలక్షేపము చేయును. అప్పుడు స్నానసమయ మగుటచే నా మార్గమున ననేక సుందరయువతులు స్నానఘట్టమునకు గమనాగమనములు చేయుచుందురు. దుష్టభావముతో రామసేవకుఁడు వారివంకఁ జూచుచు నుఱ్ఱూట లూరుచుండును. తరువాత నింటికి వచ్చి వంటయింటిలోఁ గాళ్లు చాపుకొని కూర్చుండి తల్లితోడను, మేనత్త తోడను మాటాడుచుండును. ఆ సమయము నందు శాంతిదేవి వంట చేసుకొనుచుండును. రామసేవకుఁ డప్పుడు విశృత నయనములతోఁ బాపదృష్టితో నామెవంకఁ జూచుచు, తల్లి, మేనత్తలయొద్దఁ దన పాండిత్యమును, సామర్థ్యమును, రసికత్వమును బ్రదర్శించుచుండును. అవి యన్నియును వినుచు నాతని తల్లి యానంద

ముచేఁ బొంగిపోవుచు "జన్మజన్మాంతరములయందు నేను గావించిన మహాతపము వలననే యీ కుమారరత్నమును గర్భమున ధరించితిని" అని సంతుష్టి పడుచుండును. మేనత్తమాత్ర మాతని నడవడి నెంత మాత్రమును మెచ్చుకొనుట లేదు.

ఆ తరువాత నాతని స్నానప్రకరణము. స్నానమునకుఁ బోయి యీదుట మొదలగు కృత్యములతోఁ గొంత కాలక్షేపము చేయును. తరువాత వచ్చి వస్త్రపరివర్తనము చేసికొని యద్దముచెంతఁ దల దువ్వుకొనుట, తిలకధారణము మున్నగువానితోఁ గొంతసేపు గడపి భోజనము చేయును. తరువాత మరల నిద్ర - ఆ నిద్రతో నపరాహ్ణమంతయును గడచిపోవును. పిమ్మట సాయంకాలమునకు ముందు దుస్తులను మార్చుకొని, కేశసంస్కారము చేసికొని, యుపాహారము గావించి తేనీరు ద్రావి వెలుపలికి వచ్చును. రామసేవకుని పగటి కార్యక్రమ మిది! తరువాత రాత్రిలీల!

రామసేవకుఁ డెన్నఁడును బెద్దమనుష్యుల యింట నడుగు పెట్టినవాఁడు గాఁడు. రాత్రులు కృషికు లందఱును గలసి యిష్టాగోష్ఠితో నుండు సమయమునఁ రామసేవకుఁడు సభాపతిత్వమును నెఱవేర్చుచుండును. ప్రతిదినమును రాత్రిపని యాతని కిదియే. అప్పు డాతఁడు వారికి రాజనీతి, సామాజికనీతి, మతము, విజ్ఞానము, దర్శనములు మున్నగు సకలవిషయములం గూర్చియు నుపన్యసించి చెప్పుచుండును. ఆతఁడు చెప్పినమాట లందఱును వినవలసినదేగాని వ్యతిరేకముగ నందొక్కఁడును మాటాడఁ జాలకుండును. అందఱు నానందముతో విని యాతని మూలమున నించుక జ్ఞానలాభము గలిగినట్లు తృప్తి పడుచుండిరి.

రామసేవకుఁడు నిర్లక్ష్యముగా హైకోర్టుజడ్జి నైనను మూర్ఖుఁ డని చెప్పివైచును. కలకత్తాలోని స్త్రీలందఱును, బస్నీటితో స్నానము

చేయుచుండరనియు, నాంగ్లేయులు మద్యములో స్నానము చేయుట చేతనె తెల్లవారైరనియు, సెకందరుషాదుషా హైకోర్టు బారిష్టరనియు, ఆతని తలను లాడ్ దొరగారు పదివేలకుఁ గొని రనియు, నాతఁడు మరణించి నప్పు డాతనితలలో నెంతబుద్ధి యున్నదో కనుపెట్టఁబడె ననియు, రవీంద్రునకు మొదట నక్షరజ్ఞానమే లేదనియు, ఆ విచారముచే నాతఁడు రాత్రి రెండుజాముల వేళ గంగలో దుముకఁబోవుచుండఁగా సరస్వతి యాతనికి సాక్షాత్కరించి వరమిచ్చెననియు, నప్పటినుండి యాతఁడు కవి యయ్యెననియు, నాతనియొద్ద జాలమందికవులుండి రనియు, వారందఱికిని దానే పెద్ద యనియు ని ట్లేవేవియో విషయములంగూర్చి తాను చూచి వచ్చినవానివలె వారికిఁ జెప్పుచుండును. వారందఱును గన్నుమూయకుండ నాతనివంకఁ జూచుచు నాతఁడు చెప్పిన దంతయును విని యానందించి పొలములకుఁ బోయినప్పు డావిశేషములను వారి మిత్రులతోఁ జెప్పుచుందురు.

ఈవిధముగా నాపల్లెకాపుల కందఱకు నాతనియెడల గురుభావము గలిగెను. ఆతనిమెడలోని మూఁడుపేటల తులసి తావళము, తలపై నొత్తుగ బెరిగిన నీలకుంతలములు, నుదుట గోపీచందనతిలకమును జూచి కాపులందఱు నాతని బరమభక్తునిగా భావించి యుండిరి. ఇంతే కాక యాతఁడు కంజర వాయింపఁగలఁడు. గౌరాంగునివలెఁ బాటలు పాడుచు నృత్యము చేయఁగలఁడు — విశేషించి గంజాయిని సేవించుటలో దిట్టయై యుండెను. మఱియు నాతఁడు మారణము, ఉచ్చాటనము, వశీకరణము, జలస్తంభనము, అగ్నిస్తంభనము, ఇంద్రజాలము మున్నగు మంత్రములను నేర్చియుండె నని వారినమ్మకము. తాయెతులు కట్టుట, మందు లిచ్చుట మొదలగు పనులచే రామసేవకుని యెడల వారికిఁ బరమభక్తి యుదయించెను.

ఆతఁడు భక్తినిగూర్చి బోధించునప్పుడు శ్రోత లందఱును భక్తి

పూర్ణిమాద్యుదయములతో వినుచుందురు. ఆతఁడు యోగ శాస్త్రమును గూర్చియు, భారతమునుగూర్చియుఁ జెప్పుచుండును. కాని తఱచుగా శ్రీకృష్ణుని వ్రజలీలలఁగూర్చియె విశేషించి యుపన్యసించు చుండును. ఒకనాఁడు ప్రక్కయూరినుండి ఘనశ్యాముఁ డనువాఁడు బంధుత్వముం బట్టి యొకకాపు నింటికి వచ్చి రామసేవకుని యుపన్యాసము వినవలె నని యాసాయంకాలసభకు వచ్చియుండెను. ఘనశ్యాముఁడు కృష్ణభక్తుఁడు. చైతన్యభాగవతము బృందావనవిహారము మున్నగు కొన్ని భాషాగ్రంథ ముల నధ్యయనము గావించినవాఁడు. అప్పుడు కృషికు లందఱును ఘన శ్యాముని రామసేవకునకుఁ బరిచితునిం గావించి కృష్ణకథ నీరాత్రి యుపన్యసింపవలయు నని ప్రార్థించిరి. రామసేవకుఁ డప్పుడు గంజాయి త్రాగుటచే నెఱ్ఱనయిన కన్నులతో జిఱునవ్వు నవ్వుచు గర్వితస్వర ముతో నీక్రింది విధముగా నుపన్యసింప నారంభించెను —

"ఒకనాఁడు శ్రీమతి రాధాదేవి బజారుచేసికొనుటకై మథురానగ రికిఁ బోయి తిరిగివచ్చుచుండెను. ఆసమయమున దేవదేవుఁడగు శ్రీగోపాలకృష్ణుఁడు గోవులను మేపుకొనుచు యమునా నదీతీరమున విహరించుచుండెను. ఆకస్మికముగా నాయుభయుల పరస్పర సందర్శనము- అంతలో గోపాలదేవునకు ప్రేమభావావేశమయ్యెను! అప్పు డాతఁడు గద్గద ఖిన్న కంఠస్వరముతో —

"జగమునం దెక్కడను లేని ♦ చక్కదనము
నమరినది నీకుఁ బ్రత్యేక ♦ యవయమునందుఁ
గనులు మిఱుమిట్లుగొలుపు నీ ♦ క్రమ తేజ
మెట్లు నీకబ్బెనో చెప్పు ♦ వేమి రాధ!" అని గానముచేయ నారంభించెను."

రామసేవకుఁ డీ యుపన్యాసము చెప్పుచు నూరకుండక తానును బెద్దగొంతుతో గానము చేయఁదొడంగెను. అదివిని కాపు లందఱును

"వహావా! ఆహా!" అను భావసూచకవచనములతోఁ దమయానంద మును బ్రకటించిరి. కాని ఘనశ్యాముఁడుమాత్రము మెచ్చుకొనలేదు. పరీక్షింపవలె నని యాతనికి బుద్ధి పుట్టి రామసేవకుని సమీపించి "అయ్యా! మీవంటిమహాపురుషుని నేనెచ్చటను జూడలేదు. నేను మూఢుఁడను. గురువందనమునకైన నర్థము తెలియనివాఁడను, దయ యుంచి నాకు దానియర్థమును బోధింపవలయును" అని యడిగెను.

రామ — ఆమంత్ర మేదియో చదువుము.

ఘనశ్యాముఁడు —

"అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః."

అని చదవెను. రామసేవకుఁ డించుకంతయు జంకక యించుక యాలోచన నభినయించి దృఢస్వరముతో "బాబూ! ఇట్టి గూఢమంత్ర మునకు సామాన్యు లెవ్వరు వ్యాఖ్యానము చేయఁగలరు? నేను శ్రీ గోస్వామిగురువరుని కృపవలన దీనికర్థము నొకించుక తెలిసికొనఁ గలిగి తిని. "అజ్ఞానతిమిరాంధస్యజ్ఞానాంజనశలాకయా" అనఁగా — అజ్ఞానులకు మూఁడుమణుగుల పదిశేరులబరువుగాఁ దోఁచుపదార్థము జ్ఞానులకు జీలుగు బెండుకంటెను దేలికగా నుండు నని కాదా? ఇఁకఁ దక్కినభాగమున కర్థము సులభముగనే బోధ యగుచున్నది!" అనియెను.

ఘనశ్యాముఁ డా యర్థమును విని తెల్లఁబోయెను. తక్కినవారంద అును రామసేవకునిగూర్చి జయధ్వనులు గావించిరి — చెప్పవలసిన దేమనఁగా, రామసేవకుని రాత్రికాలక్షేప మీ విధముగా నుండునని. ఇట్టిసకలగుణాభిరాముఁ డగురామసేవకున కాయూరికృషికకార్మికు లలోఁ జాలమంది శిష్యులైరి. వారు ప్రప్రథమమున గురువుగారి గంజాయి చిలుమును మహాప్రసాదముగా స్వీకరించి ధన్యులైరి. కాని త్వరలోనే వారికిని గంజాయిత్రాగుట యలవా టయ్యెను. ఇంతఁ దినుటకుఁ దిండి

లేదు. జమీందారువారికిఁ బన్ను లిచ్చుకొనుటకు బదులు పుట్టుటలేదు. ఇట్లున్నను వారి రక్తార్జిత మగుధన మంతయుఁ గ్రమముగా గంజాయి గొట్టముమీఁద భస్మీభూత మగుచుండెను. శిష్యు లిచ్చుటచేఁగూడ రామసేవకునిధూమపానము మఱియు నధిక మయ్యెను. అతఁడు గంజాయిమత్తుచే నాకాశవిహారము చేయుచు నింటికిఁ బోయి తఱచుగా చాలరాత్రివఱకును గందరగోళము చేయుచుండెను.

## ౫౪

రామసేవకుఁ డెప్పుడును రాత్రి పదునొకండు గంటలకుఁగాని యింటికి వచ్చుటలేదు. ఒక్కొక్కప్పు డింకను జాలరాత్రి యగుచుండెను. కాని యెంతరాత్రియైనను నాతని తేరభోజనము చల్లారిపోఁగూడదు. శాంతిదేవి యీవిషయమునఁ జాల కష్టపడుచుండెను. ఇంటిలో మగవా రెవ్వరును లేరు. పెద్దకోడలు జయంతి యూరికిఁబోవుటచే వంటపని యంతయు నామెపైఁబడియెను. ఆమె యత్తగారు చాల నీరసపడి పోయెను. సాయంకాల మామె కించుక జ్వరముకూడ వచ్చుచుండెను. అందుచే నామె రాత్రివేళ వంటయింటివైపు తొంగిచూచుటయైన లేదు. గౌరాంగి సంజవేళకే నిద్రలో మునిఁగిపోవును. ఇఁక శాంతియే వంట చేసికొని రామసేవకుఁడు వచ్చువఱకు నొంటరిగా గనుపెట్టుకొని యుండును. ఎంతో బ్రతిమాలఁగా మనసు కుదిరినప్పుడు దాసి వంట యింటిగుమ్మమునొద్దఁ బరుండి యుండును. ఇష్టము లేనప్పు డది సాయంకాలమే తనయింటికిఁ బోవుచుండును. ఎంతరాత్రి యైనను శాంతిదేవి రామసేవకునికొఱకు నిరీక్షించి యుండవలసినదే—

మొట్టమొదట నీవిషయమున నంతగా నిబ్బంది కలుగలేదు. క్రమముగా రామసేవకుని రసికసంభాషణము వృద్ధి యగుచుండెను. అందుచే శాంతిదేవికి మనఃకష్టము గలుగుచుండెను. గంజాయిమత్తు హెచ్చిన

రామసేవకుఁడు కుజ్జువాఁడు గాదఁటమ్మా! వాఁడేమియో [illegible] లించినంతమాత్రమున నేమగును. అందుచే మహాభా[illegible] గల్గునష్టమైపోవునా? మఱేమియు భయము లేదు!" అనుచుండెను.

శాంతిదేవి మాఱుమాట చెప్పఁజాలక కన్నీరు విడుచుచు, విదేశమందున్న నాథుని దలఁచుకొని తనలోఁ దానే "ప్రాణేశ్వరా! [illegible] స్వామీ! నన్నీవిధముగా నెన్నిదినము లుంచుచునెదరు! మీ [illegible] వెప్పుడు ముగియునా యని నేనెంతయో యాశతో నిరీక్షించితిని. మీ కుద్యోగ మగుననియు, నచ్చట నేను మీతోఁ గలసియుండి [illegible] మీ పాదసేవ చేయుచుండఁ గలననియుఁ గుతూహల పడితిని. అట్టి నన్ను మీ రేల పాదములతోఁ ద్రోసివైచితిరి? నేనంతగాఁ జదువు కొనలేదు - గీతనృత్యములు నా చేతఁ గావు — నిజమే. కాని నా స్వధర్మ మగు మీ పాదసేవ విషయమున నే నెన్నఁడును లోపము చేయలేదే! నా సేవయు, శుశ్రూషయు మీ కంతగా నానందమును గూర్చుట లేదా? అట్లే యైనచో నా కేల చదువు నేర్పఁగూడదు? సంగీతము నేర్పింపఁగూడదు? మీ తృప్తికొఱకు నన్నేమి చేయుమన్నను జేయ కుందునా? ఎందుకు నన్నుఁ గాళ్ళతోఁ దన్నివైచితిరి? త్యజించి వైచితిరి? పోనిమ్ము! ఇట్టి స్థితిలో నా ప్రాణములు మీ పాదార్పితములు గాక మీ యవజ్ఞా ప్రతారణములను సహించి యింకను నేను మృత జీవినై యిట్లున్నా నేమి? — ఓ యమధర్మరాజా! ఇప్పుడిఁక నీవే నా కేకమాత్రసహాయుఁడవై యున్నావు! నా స్వామి నన్నుఁ ద్యజించి వైచినాఁడు. నీవును నన్ను మరచిపోయితి వేమి? సాధ్యమైనంత వేగ ముగా నీ యాశ్రయమును నాకు దయచేయుము!" అని యనేక విధములఁ బలవించుచుండును. కాని యామె దుఃఖచరిత్రము నామె కాంతుఁడు గాని కృతాంతుఁడు గాని యెంతమాత్రమును జెవిని బెట్టుటలేదు.

ఒకనాఁటి సాయంసమయమున శాంతిదేవి యొంటిగా నుండఁగా

రామసేవకుఁడు చూచి సమీపించి మృదువచనములతో "నేనంత యధార్మికుఁడను గాను, పరమయోగిని, భక్తుఁడను, నీవు నాకు సహాయ పడుము. నాతో రాసలీలఁ గావింపుము. మన మిరువురమును జీవించి యుండఁగనే శ్రీకృష్ణ సాక్షాత్కారముం గాంచఁగలము. అంతమునందు బుష్ప రథారూఢుల మై గోలోకధామమును చేరఁగలము" అనియెను.

శాంతిదేవి యీ మాట లన్నియును వినలేదు. వినఁజాలక పోయెను. గోలుగోలున నేడ్చుచు నూర్ధ్వశ్వాసముతో నటనుండి పాఱిపోయెను. ఆ నాఁటి సంగతికూడ నామె యత్తగారికిని, గౌరాంగికిని దెలియఁ జేసెను గాని, యందువలన నెట్టి ప్రయోజనమును లేకపోయెను. క్రమ క్రమముగా రామసేవకుని సాహసకృత్యము లధికము లగుచుండెను.

XX

ఒకనాఁటి రాత్రి శాంతిదేవి యన్నము వడ్డించి తిరిగి పోవుచుండఁగా రామసేవకు డామె పైఁటచెఱఁగును బట్టి లాగుచు నాడిన మాటలను విని శాంతిదేవి సగము చచ్చినదై పోయి యటనుండి యొక్క యుదుటున లోపలఁ బ్రవేశించి యారక్తనయనయై యేడువ నారంభించెను. అంతలో నచ్చటికి దుర్గాంబ వచ్చి శాంతిం గాంచి "ఏమమ్మా! అట్లేడ్చు చున్నావు? మరల నిప్పు డేమిగోల పుట్టినది?" అని ప్రశ్నించెను.

శాంతిదేవి యేమియో చెప్పఁబోవుచుండఁగనే రామసేవకుఁడు క్రుద్ధస్వరముతో "ఇఁక మన మీయింట నుండఁగూడదు. నేనేమి యీమెకు మామగా రగుదునా? ప్రభువు నగుదునా? అన్నపుఁగంచ మెట్లు పెట్టినదో చూచితివా? దూరముగ నిలువఁబడి నాముందటికి విసరివైచినది! ఇట్లు చేయుటకంటెఁ దాను నాకువడ్డించుటయే మానఁ గూడదా? నేనీమాట యన్నందుకే యింతదుఃఖమును!" అనియెను.

ఆమాట విని దుర్గాంబ మండిపడుచు "ఇదేమమ్మా! మేము

రెండు మెదుకులకొఱకు మీ యిల్లు చేరితి ననుకొన్నావా ? ఈ కుఱ్ఱ వాని మేనత్త - తండ్రితోడఁబుట్టిన మేనత్త - ఆమెకన్న బిడ్డ పోయి దుఃఖించు చుండఁగా నించుక యూఱడింపవలె నని వచ్చితిని. ఈపిల్లవానిపై నీ కింతవిషదృష్టి యెందుకు ? నీతిండి తినుచున్నాఁడా, నీబట్ట కట్టు చున్నాఁడా ! వీనిపై నీకింతయధికార మెందుకు ?" అని గద్దించెను.

శాంతిదేవి యేమియు బదులు చెప్పలేదు. ఆమెప్రాణము చలించి పోవుచున్నది. కాలిక్రిందిమన్ను జారిపోవుచున్నట్లుండెను. అప్పు డామె కన్నీటిధారలు గండస్థలముల జాలువారుచుండ గౌరాంగిగదిలో నికిఁ బోయెను. ఈ సంగతి నత్తగారితోఁ జెప్పుటవలన లాభము లేదని యామె భావించెను. గౌరాంగియప్పుడు గాఢనిద్రయం దుండెను. శాంతి యతికరుణగద్గద స్వరముతో "అక్కా ! ఒకసారి లెమ్ము ! నీతో నొకమాట చెప్పవలసి యున్నది !" అని లేపెను. కాని గౌరాంగికి మెలఁకువ రాలేదు. అప్పుడు శాంతిదేవి యామె పాదములను బట్టుచు "అక్కా ! ఒకమాట వినుము !" అని లేపెను. గౌరాంగి యించుక యొత్తిగిలి కొంచెము కన్నులు తెఱచి యావులించుచు "ఏమి ! ఎందుకుఁ బిలిచితివి ?" అనియెను.

శాంతిదేవి యేడ్చుచునే జరగినసంగతి యంతయును దెలియఁజేసెను. రామసేవకుఁ డప్పుడు "నీవు న్యాయముగా నంగీకరింపకున్నచో బలవంత పెట్టక మానను. అప్పుడు నానోటికండను బెరికికొనుట కెంతవారికిని సాధ్యము గాదు. నేను గావలసినంతభూమి గలవాఁడను. ఒక దేశము నుండి మఱియొక దేశమునకు నిన్నుఁ దీసికొనిపోయెదను. నన్నెవ్వరును బట్టుకొనఁజాలరు. అట్టికష్టము నెత్తిమీఁదికిఁ దెచ్చుకొనకుండ నీవే యంగీకరించినచో నిక్కడనే యిరువురమునుగలసి ధర్మకర్మములఁ గావించుకొనుచు నుండవచ్చును" అని చెప్పి యుండెను. ఆమాటలన్ని యును గౌరాంగికిఁ జెప్పి, యామె పాదములపైఁబడి శాంతిదేవి యేడ్చుచు

“ప్రభ్వీ! నన్ను రక్షింపుము. నేను నీయింటికోడలను - నిన్నాశ్రయించినదానను - నీసోదరిని - నీవే రక్షింపకున్నచో నా కింకెవరున్నారు ?” అని ప్రార్థించెను.

కీచకభయముచే భీతియగుసైరంధ్రి యిట్లే మున్ను విరాటపత్నిపాదములను బట్టుకొని యభయమును వేఁడుకొనియెను. గౌరాంగి యెట్టిదైనను పాతివ్రత్యగౌరవముగల రమణీమణి - ఒకసతియవమానముం గూర్చి వినుటచే నిజముగా నామెహృదయము వికలమైపోయెను. అప్పు డామె నిశ్శబ్దముగా నేమేమియో యాలోచించుకొనుచుండఁగా నిల్లంతయుఁ బ్రతిధ్వనించునట్లు “ఓసిజగడగొండీ!” అని కేకలు వైచుచు దుర్గాంబ యచటికి వచ్చి శాంతిదేవివంక వక్రభీషణదృష్టిం గాంచుచు “ఓసిజగడగొండీ! పిల్లవానిని వెడలఁగొట్టువఱకు విడువవా! ఆహాహా! కన్నులు తెఱవనిచిన్నిపాప! వానిమీఁద పగ పట్టితి వేమే! వాఁడు వానమేనత్తయింటికి వచ్చినాఁడు. పొట్టకూటికి రాలేదు. బ్రదుకఁజాలక రాలేదు! ఔరా! ఇంతయవమానమా! వదినే! మాకింక సెలవిమ్ము తల్లీ! మేమును గృహస్థులమే. మేము మాయింటికే పోయెదము. సెలవిమ్ము!” అనియనేకవిధముల వాగ్వాహిని బ్రవహింపఁజేయుచు నుపసంహారముగా రామసేవకుఁడు తనతోఁ జెప్పినమాటలను వికృతముగ మార్చి చేర్చి యలంకారయుక్తముగఁ జేసి గౌరాంగికి విన్నవించెను. ఆమాటలు విని గౌరాంగి దోషము శాంతిదేవిదే యనినిశ్చయించి యామె నించుక మందలించి పంపివైచెను.

ఇక శాంతిదేవి యెక్కడకుఁ బోఁగలదు? అత్తగారిగదిలోనికేఁ బోయెను. ఆనాఁడామెకు జ్వరము హెచ్చుగా వచ్చెను. శాంతి యామె నొకటి రెండుసారులు పిలిచెను. పలుకలేదు. ఒడలిపైఁ జేయివైచి చూచెను. జ్వరతీవ్రతచే నొడలిచర్మము పగిలిపోవునంతటి వేడిగా నుండెను. అటనుండి శాంతి తనగదిలోనికిఁ బోవుచుండఁగా రామ

సేవకుఁ డడ్డము వచ్చి వికటహాసముచేయుచు "నీ వెక్కడకుఁ బోయినను నన్నుఁ దప్పించుకొనఁజాలవు. నన్ను మన్నించి నా యభీష్టమును దీర్పుము. ఇరువురమును సుఖముగా నుందుము. కాకున్నచో మీయవ్వ, మీ తాత దిగి వచ్చినను నా చేతినుండి నిన్ను రక్షింపఁ జాలరు" అని యదలించెను. వల చేతఁబట్టుకొని వచ్చుచున్న వ్యాధుని దప్పించుకొని భీతయు చంచలితయు నిశ్వసితయు నగు హరిణి యెట్లు పరుగెత్తిపోవునో యట్లే శాంతిదేవి యొక్కపరుగునఁ దనగది లోనికి దుమికి తలుపు గొళ్లెము వైచికొనియెను.

అట్లు విపన్మూర్తియై శాంతి శయ్యాపైఁ బడి యేడ్చుచు "ఓ ప్రభూ! హృదయనాథా! సతీమానసంరక్షకా! నీవు నాకెక్కడ నున్నావు? నీ యింటిలోనే నిర్భాగ్యురా లగు నీదాసియొక దుర్వృత్తునిచే నవమానింపఁబడుచున్నది! పీడింపఁబడుచున్నది. పాపాత్ముఁడగు నా దుష్టబుద్ధి సతీజన్మమునకు సారమును, పాథేయమును, ధర్మమును, పవిత్రమును, మహత్తరమును నగు శీలగౌరవమును ధ్వంసము గావించెద నని భయపెట్టుచున్నాఁడు. ఇట్టిసమయమున నీవేల రాకున్నావు? ఎందుకు రక్షింపఁ దలంపకున్నావు? నేనితర దైవతముల నెవ్వరి నెఱుంగను. నిన్నుఁదక్క మఱి యే దేవతనైనఁ బిలిచి ప్రార్థించుట నాకు సిగ్గుగా నుండును. నీవే నాస్వామివి! భక్తుని యార్తనాదము విని నీవు స్థిరముగా నుండఁజాలవు గదా! అట్టినీ విప్పు డేల రాకున్నావు. నేను నిన్నెట్లు పూజింపవలెనో యెఱుంగను. నిన్నే భాషతోఁ బ్రార్థింపవలయునో కూడ నెఱుంగను — అందుచేతనా యెంతగాఁ బిలిచినను రాకుంటివి?" అని పలవించుచు నామె శయ్యపై నిటునటు పొరలుచుఁ దల్లడిల్లిపోవుచుండెను.

అప్పు డామె యాలోచనాపరితప్తచిత్తమునందు "ఆ పాపాత్ముఁడు చెప్పినట్లు, భయపెట్టినట్లు నిజముగాఁ గార్యరూపమున బరిణమింపఁ జేసినచో, నప్పుడు నన్ను రక్షించువా రెవ్వరు? ఏ యర్ధరాత్రివేళనో

కొందఱు శిష్యులను వెంటనిడుకొని వచ్చి నన్ను బంధించి నానోట గుడ్డలు గ్రుక్కి తీసికొని పోవుచున్నచో నప్పుడు నాకు రక్షకు లెవ రుందురు? అప్పుడు నాగతి యేమి కావలసినది?" అను భయము కలిగి నంతనే యామె సర్వాంగకములును గంపించి పోయెను. ఒడలంతటను జెమ్మటలు గ్రమ్మెను. ఆమె యిఁక బరుండఁజాలక లేచి కూర్చుండెను. కూర్చున్నను నామెకు శాంతి గలుగలేదు. మరలఁ బరుండెను; లేచెను; తుదకామె యటనుండి తప్పించుకొని పాఱిపోవలెనని నిశ్చయించు కొనెను. కాని కఠిన శిలాకంటకమయం బగు సంసారపథమున సుఖ గమనము గావించుట కవకాశము లేదని, పాపము లోకజ్ఞాన మెఱుంగని యామె కెట్లు తెలియును? ఆమె యనుకొన్న దేమనగా:— ఆ రాక్షసుఁడున్న యిల్లు వదలఁగలిగినచో స్వతంత్రజగద్వృక్షమున నెట్లో నిలువఁబడి యుండఁగల ననియు, సతీత్వమను నమూల్యనిధానము నెట్లో సంరక్షించుకొనుటకు సమర్థురాలను గాఁగలననియు మాత్రమే— ఆమె కుపాయమును బోధించువా రెవ్వరును లేకపోవుటచేత, ఎవ్వరును ధైర్యముచెప్పు దిక్కు లేకపోవుటచేత, నామె యట్టి సంకల్పమునే స్థిరపఱచుకొనెను.

అత్తగారు జ్వరముతోఁ బడియుండె ననియు, నామెకు సేవ యెవ్వరు చేయుదు రనియు నామెహృదయమునం దొకసారి సందేహము కలిగెను. అందువలన నామెకన్నీరు మున్నీరయ్యెను. "అత్తగారిజబ్బుకొఱకు నే నిందే యున్నచో నీవిపత్తునుండి నన్నుఁగాపాడువా రెవ్వరు?" అని యంతలోనే యీయామెమనసున భయము గలిగెను. ఇన్నియూహ లూహిం చినది కాని పాప మామె "పాఱిపోవుట యెక్కడకు?" అనువిషయము నొక్కసారియైన భావించుకొనలేదు. దుఃఖముచే నెఱ్ఱనగుకన్నులతో నామె యప్పుడు రమణీయములగు వస్తువులతోఁ జక్కఁగ నలంకరింపఁ బడియున్న తనగదివంకఁ జూచి నిట్టూర్పులువిడుచుచు సందలిమనోజ్ఞ వస్తువులను నుద్దేశించి "మీయందఱను నేను నవరించిన ట్లే యుండుఁడు.

మీాయీానిర్భాగ్యురాలికి చిరకాలమువఱకును సెలవొసంగుఁడు. ఆయన వచ్చినచో "ఆమెయే యీావిధముగా మమ్ము నీకొఱకు సవరించి యిల్లంతయు నిట్లలంకరించినది!" అని మనవి చేయుఁడు. అనుచుండఁగా నామెకన్నుల నీరు నిండిపోయెను. ఆమె యశ్లేద్చుచునే యాసిశీథాంధకారమున నిల్లు వదలి బయటఁబడి పోయెను. వీథిఁబడునప్పటి కామెగుండె గుభిల్లుమనియెను. నలువంకలను దిలకించెను. నిరాశ, నిర్బంధము నెల్ల యెడల భయంకరముగా నలముకొనియున్న ట్లామెకుఁ బొడకట్టెను. భయభ్రాంతయై దిక్కు తోపక యట్లు పోవుచు నొక్కయాకు చప్పుడైనను గడగడ వడఁకిపోవుచుండెను. తుట్టతుద కేబలముచే నామె సర్వేంద్రియములును స్తబ్ధములై పోయెనో, యామెచైతన్యము విస్మృతమైపోయెనో, యాత్మజ్ఞానమే నశించిపోయెనో యెవ్వరెఱుంగుదురు? దీర్ణవిదీర్ణంబును, వేదనాప్రపూర్ణంబు నగుహృదయముతో నామె యా నిర్జన నిశీథాంధకారపథమున ననుద్దేశ్యంబును, నపరిచితంబును నగు ప్రదేశముంబట్టి యప్పు డెక్కడకో బయలుదేఱి పోయెను.

౫౬

శాంతిదేవి బాహ్యజ్ఞానశూన్యయై యున్మాదినివలె నాయంధకార మార్గమున రాత్రియంతయుఁ బ్రయాణము గావించెను. ఏమార్గమున — నెక్కడకుఁ బోవలయునో యామె నిశ్చయించుకొనలేదు. ఆమె కాజ్ఞానమే లేదు! ఇల్లు వదలి పోవలయును గావునఁ బోవుచుండెను. అట్లు పోవుచుండఁగా నామె కొకయే రడ్డము వచ్చెను. ఆనది యగాధపూర జలములతోఁ దీవ్రవేగమునఁ బ్రవహించుచున్నది! ఇఁక ముందు నడచుటకుఁ ద్రోవలేదు — అప్పటి కామెకు బాహ్యజ్ఞానము కలిగెను. ఈ నదిని దాఁటినఁగాని తాను నడచుట కిఁక మార్గములేదని యామె తెలిసికొనెను. ఆమెకుఁ దెలివి వచ్చినంతనే భయమువచ్చి యామె హృద

యమునందు సంపూర్ణాధికారమును జూప నారంభించెను. అప్డామె భయవిహ్వలయై యొకచెట్టుక్రిందఁ గూలఁబడిపోయెను. అప్పుడామెకుఁ దనయవస్థయు, దానొనరించినపనియుఁ దెలియవచ్చి సహస్రవృశ్చికముల భావము లామెహృదయమును విపర్యస్తముగఁ జేసినట్లు బాధింపఁ జొచ్చెను. ఎక్కడకుఁ బోవుదును, ఏమి చేయుదును? ఇప్పుడు నేను చేసిన పని యేమి? — ఇవియే యామెసమస్యలు! పాప మామెకోమలచరణములు తృణకంటకములచే క్షతవిక్షతము లై పోయెను. ఆయాసముచే నామె యవసన్నయై పడిపోయెను అచ్చటఁ గూలఁబడి యామె చాలసే పేడ్చెను. ఆదుఃఖముతో నుకల నామెకు స్మృతి తప్పిపోయెను. అకస్మికముగా నదీతీరమునం దొకపక్షికూసి యామెశోకసాగరవార్తను ఘోషించెను. ఆకూతతో నామెకు స్మృతి కలుగుటచే ప్రాణములు చలించుచుండ దిక్కులు చూడఁదొడంగెను. పూర్వాకాశమునఁ బ్రభాతకాంతులు స్ఫుటము లగుచుండెను. ఏదియో తెలియనివిపత్తును శంకించుకొనుచు నామె వడఁకిపోవుచుండెను. తెల్లవారినచో నీనిర్భాగ్యురాలిగతి యేమగునా యని యామె తల్లడిల్లిపోవుచుండెను.

ఆ సమయమునం దొక పల్లెవాఁ డానదిలోఁ జేఁపలను బట్టి చేఁపలబుట్టను నెత్తిపైఁ బెట్టుకొని, జాలమును జంక నుంచుకొని గట్టెక్కిపోవుచు నొక మహాభక్తుఁడు రచియించిన చిరనూతనంబును, చిరమధురంబు నగు నొక గీతము నీ క్రింది విధముగా గానము చేయుచుండెను.

నిలువ నీడ యిఁకేడ నమ్మా — ననుఁ బ్రోచు
బలియు రింకెవరు గారమ్మా.

1. తలమీఁద నల మూరు ♦ తల్లి నెక్కించుకొని
కులుకుచుండెను తండ్రి ♦ కొడుకులను జూచునఁటె — ॥నిలువ॥

2. పిల్లవారలమీఁది ♦ ప్రేమ పూసంతైనఁ
దల్లినే దిగనాడు ♦ తండ్రి కెట్లుండునే — ॥నిలువ॥

సీ. శివుఁ డట్టులయ్యెఁ గాం ♦ చిన తల్లివీవైన
సవతితల్లిసిఁ బోలి ♦ చన వీయకున్నచో — ॥సిలువ॥

ఆ పురాతన మధురగీతము నప్పుడా ప్రభాతవాతపోతము తన పక్షములం దిడుకొని మోచి తెచ్చి హతభాగిని యగు నా శాంతిదేవి శ్రవణ రంధ్రముల జారవిడిచెను. అందువలన నామెకు గుండెనిబ్బరము కలిగెను. ఇఁక నాకు భయమేమని నిశ్చయించుకొనెను. "మరణము నాచేతిలోనే యున్నది! ఈ చల్లని, నున్నని, స్వచ్ఛమైన నదీజల మధ్యమున నా సకల విపత్తులును నమసి పోకుండునా? ఈ నదీపాదతలమునందు శాంతి లేకుండునా? ఓ ప్రాణేశ్వరా! ఈ యపారపారావార మధ్యము నందు నీవే నా కేకమాత్ర శరణ్యుఁడవై యున్నావు" అని గొంతెత్తి యేడువ నారంభించెను. ఆ నిర్జనస్థానమునందు మానవ కంఠస్వరము వినవచ్చుటచే నామె హృదయము కొట్టుకొని పోవుచుండెను. మానవ సందర్శనవిషము మరల బాధించు నేమో యని భావించి యామె చటాలున లేచి గా॥ గీతము వినఁబడిన దిక్కున కవ్వలి మొగముగా నదీతీరమునుండి పరుగెత్త నారంభించెను.

అట్లు కొంతదూరము పోవుసరి కామె కొక శ్మశానము కానవచ్చెను. అంతట నలవోకగ వీతెంచు ప్రభాతవాతములు — ఎదుట గలగల ప్రవహించు నదీప్రవాహము — ఊర్ధ్వాకాశమునఁ దేజోవిహీనంబగు తారకాపుంజము — నిలిచినచోటు ఆశ్మశానము! ఆమె ప్రాణము స్తంభించి పోయెను — శ్మశానమందు నిలిచియున్న యామెకు శవభుక్కులగు శునకజంబుక విరావములు వినవచ్చుచుండెను. చర్మమాంస విహీనంబు లగు శవకళేబరములు నలుదెసలఁ జెదరిపడి యుండెను. మృతకళేబర భక్షణమునకై కుక్కలు నక్కలును బోరాడుకొను చుండెను. ఆ మృత కళేబరము లన్నియు "పూర్వము మాకును రూపయౌవనము లున్నవి; బంధుమిత్రు లున్నారు; ధనధాన్యము లున్నవి; కామక్రోధాదు

లున్నవి; సర్వేంద్రియములు నున్నవి; సకల మనోవృత్తులు నున్నవి. ఆ యన్నిటి పరిణామము నిప్పు డెట్లున్నదో చూచితిరా? వినుఁడు! వినుఁడు!" అని శ్మశానవుల సంపుటితముగ బోధించు చున్నవా యన్నట్లుండెను. పగిలిన కుండలు, చినిగిన దుప్పటములు, కాలిన వెదురు గడలు, సగము కాలిన యెముకలు, వెల్లగాటి బూడిద - ఈయన్నిటి నడుమను బ్రాహ్మణులు, చండాలురు, చక్రవర్తులు, నిరుపేదలు మొదలగు వారి యర్ధదగ్ధములగు దేహములు తారతమ్యము లేక కొలఁది గొప్పతనముల భిన్నభావము లేక యొక్కటే పోలికను జెందర వందరలై పడియుండెను. శాంతిదేవి యీ దృశ్యముం గాంచి భయపడ లేదు. ఎందుచేతనో గాని యామె కా చోటు విడువవలయునని బుద్ధి పుట్టుట లేదు. "ఇచ్చట నెట్టి యుత్కర్షాపకర్షములును లేవు; ఎట్టి యనాదరములును లేవు. కాము సేవకులనిందించు మహాత్ముల పాపదృష్టులును లేవు" అని యామె మనసునకుఁ దట్టియుండును.

కాని యామె యచ్చోట చాలసేపు నిలువఁజాలక పోయెను. క్రుళ్ళిన శవముల దుర్గంధము నామె భరింపఁ జాలదయ్యెను. అందుచే నామె యచ్చోటు వదలి మరలఁ బ్రయాణము చేయుచుండెను. క్రమముగాఁ బ్రభాత మయ్యెను. సూర్యోదయముం గాంచి భయముచే నుషాదేవి వెడలిపోయెను. ఆ పగటివెలుఁగు చూచినంతనే శాంతిదేవికి భయము గలిగెను. ఇప్పు డామె యెట్లాత్మరక్షణము చేసికొనఁ గలదు? ఈ భావమే యామె హృదయమును వ్యాకుల పెట్టుచుండెను. ప్రతి వృక్షశాఖయందును, కాకులు, కోకిలలు, భరతపక్షులు మొదలగు విహంగము లన్నియును గలసి యేకకంఠముగఁ గూయుచుండెను. జపా కుసుమ సన్నిభములగు తరుణారుణప్రభ లున్నత వృక్షాగ్రముల యందు శోభాయమానము లగుచుండెను. ఆ నదీనీలసలిలములందా యరుణ బింబము విచిత్రద్యుతులతోఁ బ్రతిబింబించు చుండెను. భయముచేతను,

పరితాపము చేతను, స్నిగ్ధచేతను, ప్రయాణాయాసము చేతను వసివాడి యున్న శాంతిదేవి యుస్సురను "అమ్మా!" యని నిట్టూర్పులు విడుచుచు, నా నదీతీర సైకతస్థానమునం గూలంబడిపోయెను.

అంతలో వెనుకనుండి యెవ్వరో "నీవెవరమ్మా! రూపకాంతిచే నీ ఘట్టమునంతను ప్రభావంతముగఁ జేయుచున్నావు!" అని ప్రశ్నించిన ట్లయ్యెను. "అయ్యో! ఇక్కడ గూడ మరల నాపాడు సౌందర్యమేనా!" అని శాంతి యదరిపడి వెనుకకుఁ దిరిగిచూచెను. ఆమెకు వెనుకవైపున నిరువురు ప్రౌఢాంగనలు జలకలశములు కక్షములం దాల్చి నిలువఁబడి యుండిరి. వారిం గాంచినంతనే శాంతి చటాలున లేచి పాఱిపోవుట కుద్యమించెను. కాని, కదలఁజాలకపోయెను. అవసన్నములై యున్న యామెచరణములకు గమనశక్తి లేకుండఁబోయెను. అందుచే నామె యేడవఁదొడంగెను. అప్పు డందొకయువతి "భయ మెందుకమ్మా! మేముమాత్ర మాఁదువారము గామా? ఎక్కడకుఁ బోయెదవో చెప్పుము!" అనియెను. శాంతి రుద్ధకంఠముతో మాటలు తడఁబడు చుండ "అమ్మా! నేను దిక్కుమాలినదానను. ఎక్కడకుఁ బోవల యునో నాకే తెలియదు. యమమందిరమునకు మార్గమును వెదకుకొను చుంటిని. కాని నాకింకను నది దొరకుట లేదు" అనియెను.

అప్పు డాయిరువురుకాంతలును "అత్తగారునాదరమువనో, ఆడుబిడ్డ పోరునవో, మగనిపీడవలననో యీయామె యిట్లిల్లువదలి పుట్టినింటికిఁ బోవు నుద్దేశముతో వచ్చి యుండును. త్రోవ తప్పి యీవిధముగా నిట్లు వచ్చినది" అని యనుకొనిరి. అప్పుడు వారి కరుణాహృదయమునం దామె కెట్లయిన నాశ్రయ మీయవలెనని తోఁచెను. తోడనే యం దొకయువతి "నీ కేమియు భయములేదమ్మా! మాయింటికి రమ్మా! మేము భాగ్యవంతులము కాకపోయినను కులగౌరవము కలవారమే!" అని చెప్పెను.

శాంతి తనలో “ఈపగటివెలుఁగులో నేనెక్కడకుఁ బోవుదును ? మార్గమం దెన్నియో కష్టములు తటస్థింపవచ్చును. ఇప్పటికి వీరియింటికిఁ బోయి తల దాఁచుకొందును. తరువాతిమాట యాలోచించుకొనవచ్చును. నాపుట్టినయూ రేదిక్కున నున్నదో తెలియుట లేదు. అక్కడకుఁ బోయినచో నేబంధువులయింటనైన జాకిరీచేయుచుఁగాలక్షేపము చేయవచ్చును.” అని నిశ్చయించుకొని యంగీకారసూచకముగా లేచి నిలువఁబడెను. ఆకాంతలిరువురు నామెను వెంటఁబెట్టుకొని పోవుచుండిరి.

అప్పటి కింకను రవికిరణము లరుణకాంతులతోనే యుండెను. ఇంకను ప్రభాతవాయువులు చల్లఁగనే యుండెను. ఇంకను కలవిహంగములు ప్రభాత గీతములు పాడుచునే యుండెను. ఇంకను ప్రఫుల్లకుసుమములు పరిమళించుచునే యుండెను. అప్పు డాయూరిపెద్ద శంభురాయఁడు ప్రభాతవిహారమునకు బయలుదేఱి వచ్చుచు నాయువతుల నెదుర్కొనెను. శంభురాయనివయసు నలుబదియేండ్లకు మక్కువగనే యుండును. జాతిచే నాతఁడు జఘన్యబ్రాహ్మణుఁడే - కాని యైదాఱుపురుషాంతరములనుండి వంగదేశమునం దుండి కనోజిబ్రాహ్మణత్వప్రశస్తిని గాంచి యుండెను. ఆ గంగారామపురమునందలి కృషికు లందఱు నాతని నాశ్రయించి యుండిరి. ధనధాన్యముల కాతని కెట్టికొదవయును లేదు. ఆ కృషికయువతులవెంట వచ్చుచు సాక్షాత్కరించిన యుషాదేవివలె నున్న శాంతిదేవి నాతఁడు చూచి విస్మితుఁడై పోయెను. ఏమి యీ రూపము ! ఏమి యీసౌందర్యము ! కుసుమసుకుమారి యగునీలావణ్యవతి యెటనుండి వచ్చినది ? చెదరిన యామెముంగురులు శిశిరశీకరసిక్తములై యుండెను. శోకలోహితములగు దీర్ఘనయనములు వికసించి యుండెను. మందసమీరమునఁ గుసుమవల్లివలె నామె కంపించిపోవుచుండెను. భీతకురంగినివలె నామె చంచలగమనములతో దర్శనీయమైయుండెను. శంభురాయఁ డామె చక్కదనముం గాంచి యుదధిపతి

యుండి కృషికయువతి నుద్దేశించి "ఓ కాపుకోడలా! ఈమె యెవ్వరు?" అని ప్రశ్నించెను.

ఆ యువతి యించుక విభ్రాంతస్వరముతో "నేనెఱుంగను. నది యొడ్డున నొంటిగఁ గూలఁబడి యేడ్చుచుండఁగా జాలిపడి యీమెను మాయింటికిఁ దీసికొనిపోవుచున్నాను." అని చెప్పెను.

శంభురాయఁడు మరలమరల నాశానయనములతో శాంతిదేవివంకఁ జూచుచు వెడలిపోయెను. ఆ యువతు లామెను వెంటఁ బెట్టుకొని పోయిరి. శంభురాయఁ డామెను మఱచిపోలేదు. ఇంటికిఁ బోయినను నాతని హృదయమునం దామె సౌందర్యదృశ్యము చెదరిపోలేదు. అతని నడవడి యెంత దుష్టమైనది కాకపోయినను బవిత్రమైనది మాత్రము కాదు. సౌందర్య మదమునం దెంత 'నిషా' మత్తున్నదియో యాతని కెంతవఱకుఁ దెలియదు. అతఁ డప్పుడు బంధకి యను నొకదాసిం బిలిచి సకల వృత్తాంతమును దెలిపి యామె నాకాపుకోడలియింటికిఁ బంపించెను.

బంధకి మాహిష్యకులమునఁ బుట్టి భర్తవలన ముగ్గురు తనయులను, నిద్దఱుతనయలను గాంచియు నాపల్లెయందలి క్రొత్తసాతానికి మరగి యాతనితోఁ గలసి గౌరాంగరసానుభవముచే మత్తిల్లియుండెను. క్రమముగా నా యుపాసనవలన సుబలుఁడను పేరు గల పుత్రరత్న మామెకు లభించెను. వాఁడు చిన్నతనమునందే గౌరాంగ పురమునకు వెడలి పోయెను. ఇప్పు డా సాతాని బావాజీ కూడ నామెను త్యజించి యెక్కడకో పోయెను. ఆమె కిప్పటికి మూఁడువయసులును గడచిపోయినవి. గత్యంతరము లేక యిప్పుడామె యింటింటను దాసిపనులు చేయుచు, నవకాశము దొరకినప్పుడు చెడునడతఁగల కామినులను విటులకుఁ దార్చుచుఁ బైనయుఁ బఱకయు సంపాదించి దినము గడపుకొనుచుండెను.

అప్పుడామె కాపుకోడలియింటికిఁ బోయి యామెతో నేవేవియో మాటలాడుచు విచ్ఛిన్న సుమవల్లరింబోలి శుష్కమలిన దేహముతో

నున్న శాంతిదేవి యొద్దకుం జని యామె యందల రాయమహాశయునికి గలిగిన యనన్యాజహాత్ప్రేమమునుం గూర్చియు, నాతని మహాభాగ్యమునుం గూర్చియు, వర్ణించుచు నిది యంతయు నీ యదృష్టమని గ్రహింపుమని యాశ గొలిపెను. ఆ మాటలు విని శాంతిదేవి దుఃఖముతో బంధకిని, రాయ మహాశయుని దూషింప నారంభించెను. బంధకి యింక జేయునది లేక శంభురాయుని కీవృత్తాంతము నెఱింగించెను. అంతయు వినినను నాతని మోహాలుబ్ధహృదయము ప్రబోధ ప్రతిహతము కాజాలకుండెను.

౫౬

ఓ యౌవనమా! నిన్నుఁ బొగడవలయునా? లేక తెగడవలయునా? నా కేమియుఁ దోఁచుటలేదు. కాని నీవు విశ్వప్రియవు! నిజముగా నీవు స్వర్గవాసినివి. కాకున్నచో స్వర్గమునందు నీకింత గౌరవ మేల? తిలోత్తమ, రంభ, మేనక, ఊర్వశి యను నచ్చరలంగూర్చి యిన్నివ్యాఖ్యానము లెందుకు వచ్చినవి? నందనకాననమున కంతటి రామణీయక మేల కలిగినది? నీవు స్వర్గవాసినివి కావుననే ముల్లోకములయందును నీవు యౌవనవతివై యున్నావు. నీకటాక్షముచే మహామునులును ధ్యానమును త్యజించి తమతపఃఫల మంతయును నీపాదములచెంత ధార వోయుచు నుందురు. కవికల్పన లన్నియు నిన్నుఁ బరివేష్టించియే యుండును! ఈ విశ్వమునందలి యౌవన మంతయును జేతులు చాచి నీసమావేశమునే యాచించుచున్నది. నీ సకలభావములను బాగుగ నాలోచించి చూచినప్పుడు నిన్ను మంచిమాటలతోఁ గీర్తింపవలయు ననియే తోఁచుచుండును. నీస్వప్రాకృతిని గనుఁగొని యానందింపవలయు ననియే యభిలాష కలుగుచుండును. కాని నీవు పాడుభూలోకమునకుఁ జేరి మర్త్య యౌవనమును పవిలపఱచి కైకొనినంతమాత్రమునఁ దృప్తివహి యి యూరకుండవు! వ్యాకులత్వమును, లాంపట్యమును, నున్మత్తతను బ

చూచు చుండును. అం[illegible] నెవ్వఁ డిట్టివఁడు [illegible] కొన్నరికై [illegible] గోప[illegible]! [illegible] [illegible] జారి భూలోకమున [illegible] [illegible] [illegible]! [illegible] నీవును —

శంభురాయఁడు [illegible] [illegible] [illegible] రూప [illegible] [illegible] [illegible]! అతని [illegible] [illegible] తల్లడిల్లిపోవుచుండెను [illegible] [illegible] [illegible] [illegible] నంపించెను. [illegible] [illegible] [illegible] [illegible]! గోపాలదేవు [illegible] [illegible] [illegible] వచ్చెను. శంభురాయఁ డాతని నెన్ని యోవిధములఁ [illegible] యుక్తుఁడై నింకను జాలమంది యుండుటచే నాతని నిర్జనస్థానమునకుఁ దీసికొని పోయెను. అక్కడ వారిరువురికిని శాంతి [illegible] సంభాషణ జరిగెను. [illegible] అయ్యెను. తుదకు గోపాలదేవు "అవుమాట నిజమే — మీరు గ్రామాధికారులు. నేను మట్టిగొట్టుకొనువాఁడను. మీయిష్టమునకు విరుద్ధముగాఁ బనిచేయుట నాకు న్యాయమగునా?" అని చెప్పి యటనుండి వెడలిపోయెను. కాని యాతని మొగము కేవలము నప్రసన్నమైపోయెను.

సాయంకాల మైనతరువాత గోపాలదేవునకును నాతనిగృహిణికిని వాగ్వాదము జరుగుచుండెను. అచ్చట నితరులెవ్వరును లేరు. మాటలు కూడ నెమ్మదిగనే జరుగుచుండెను. అప్పుడు గోపాలదేవునిగృహిణి కుంచితభ్రూవల్లియై వికృతస్వరముతో "అట్లెన్నటికిని జరుగనీయను!" అనియెను.

గోపా — ఇందు దోషమేమున్నది? ఆమె మన కెవ్వరు?

గృహి — ఎవ్వరును గాదు - కాని మనల నాశ్రయించి వచ్చినది.

గోపా — ఇంతటి ధర్మనాశమును మెడకుఁ జుట్టఁబెట్టుకొన్నచో లోక వ్యాపారములు జరుగఁ జాలవు.

గృహి — ఛీ ఛీ! మీ రేమనుచున్నారు? మీ హృదయమునం దించుకంతయైన దయ యనునది లేదా? ప్రేమ యనునది లేదా? అయ్యయ్యో! పాప మామె దీనవదనమును గన్నులారఁ గాంచియు మీ రేమొగము పెట్టుకొని నిర్దయులై యామె నా వ్యాఘ్రముఖమున కొప్పగించెదరా? పతివ్రతల మానభంగమునకు సహాయ పడుటయా? అయ్యో తల్లీ! ఇంకేది గతి! ఇట్టి దుష్కార్యము గావించినచో మన వంశము నిలుచునా?

గోపాలుని యప్రసన్న వదనము మరింతమ్లాన మయ్యెను. అతఁడు దీనస్వరముతోఁ "ఏమి చేయుదును? అతఁడు గ్రామాధికారి —" అనియెను.

గృహి — (మునుపటి కంటెను విరక్తస్వరముతో) గ్రామాధికారియే యగుఁ గాక! ధర్మముకంటె నెవ్వరును గొప్పవారు కాఁజాలరు!

గోపా — ఆ మాట నిజమే - కాని మన కాతఁ డిచ్చిన యప్పునకు మన సర్వస్వమును విక్రయించి మనలను బికారులుగాఁ జేయఁగలఁడు.

గృహి — అతఁడు గ్రామాధికారి - వయసు గడచినవాఁడు గదా! ఇంకను నాతని కీ దుర్బుద్ధి యేల? నేనిప్పుడే యాతని భార్యయొద్దకుఁ బోయి యామెచేని సతీత్వగౌరవముం గూర్చి బోధించెదను.

గోపా — (అదరిపడి) నిదురబోవు పెద్దపులిని మేల్కొల్పి సర్వనాశనముగావింపకుము! అట్లయినచో మన సర్వస్వమును బోకమానదు.

గృహి — (దర్పితబాహుయుగళమును సారించుచు) అయ్యో! అట్లయినచో మనము ధర్మమును విక్రయించి యా మూలమున జీవింప వలయునా? అట్టి నీచకృత్యమున కొడఁబడుటకంటె భిక్షమెత్తుకొని బ్రదుకుటయైనను మేలే! కాదేని మన మీ యూరే విడిచి పోవుదము!

గోపా — అంతవఱకు రాఁగునా? ఇంకొక భయముకూడ నున్నది!

గృహి — ఏమా భయము?

గోపా — రాత్రి నలుగురు మనుష్యులను పంపియైనను బంపి యామెను బలవంతముగ రప్పించుకొందునని నాకొఱకు పెద్దమనుష్యులు చెప్పియున్నారట —

భర్తమాట ముగియకుండఁగనే గృహిణి దర్పితస్వరముతో "ఓహో! నా యింటిమీఁదికి మనుష్యులా! దేశమంత యరాజకముగా నున్నదా! రానిమ్ము! నా యింటినుండి సతీమణి యగు రమణి నెవ్వరు బలవంతముగఁ గొనిపోఁగలరో చూచెదను!" అనియెను. అప్పుడామె సర్వాంగముల నుండియు విద్యుత్ప్రభలు వెలువడుచున్నట్లు క్రోధావేశాలోకము గోపాలదేవు వీక్షింపఁ గలిగెను. ఇఁక నాతఁ డేమనుటకును సాహసింపఁ జాలక యటనుండి వెడలిపోయెను. కాని యా మహాజననివలన భయము మాతని హృదయమును మిగుల వ్యాకుల పఱచుచుండెను. గృహిణి యప్పుడు కోపముతో రగులుచు వంటయింటిలోనికిఁ బోయెను.

శాంతిదేవి యప్పు డా గృహమునందే యవ్వలి ప్రక్కను గూర్చుండి దుఃఖించుచుండెను. ఆ భార్యాభర్తలు మెల్లగ మాటాడుకొనుచున్న మాటలన్నియు నామె చెవులఁ బడుచుండెను. నిరాధార యగు నామె బంధకి మాటలవలననే బెదరిపోవుచుండెను. ఆ భయముచే నామె కెట్లు చప్పుడైనను మేఘగర్జనమువలె వినవచ్చుచుండెను. అందు చేతనే యామె వారిమాట లన్నియును స్పష్టముగా వినఁ గలిగెను. వారు పోయిన తరువాత నామె యచ్చటనే చాలసేపు గూర్చుండి యెన్నియో విధముల నాలోచించెను. తుద కామె దృఢనిశ్చయము చేసికొనెను. "ఇచ్చట నిఁక నేడ్చుచుఁ గూర్చుండుట వలనఁ బ్రయోజనము లేదు. ఇప్పటికే తెలివితక్కువ పని చేసితిని. అత్తగారితో నేమియుఁ జెప్పక, పుట్టినింటి బంధువులకైనను దెలియఁజేయక, యూరిలోని నలుగురు పెద్దమనుష్యుల సాహాయ్యమునైన యాచింపక సాహసించి యిల్లు వెడలుట యను మహాపాపకృత్యము గావించితిని. కావున దీనికి దగిన ప్రాయశ్చిత్తము గావించియే తీరవలయును. ఈ నా

పాడుప్రాణముల నాహుతి చేయుటయే యింతకు ప్రాయశ్చిత్తము" అని స్థిరపఱచుకొనెను.

"ఇక నిక్కడ నేనున్నచో సర్వనాశన మగును. ఆ బలవంతుడగు పాపాత్ముని బారి నుండి నన్ను రక్షించుట యీయొక్కయూయనుదానికి సాధ్యమగునా? అటుగాక - అందువలన వారి కతిహాస్యాస్పదంబగు దుస్థితి కలుగక మానునా? నామూలమునన వీరు సర్వనాశనము కావలసి నదా? ఇక నీప్రాణముల నాహుతి చేయుటకంటె నీదుష్కృత్యమునకు సమాప్తి లేదు. అతిసులభముగ నాపని నెఱవేర్చుకొనుటకు నది సమీపమునందే యున్నది. ఒకనిమిషమైన నాలస్యము చేయుట కూడదు" అని యనుకొని యామె యెవ్వరితో నేమియు జెప్పకుండ నటనుండి వెడలిపోయెను.

వెన్నెలరాత్రి - వెన్నెలవెలుఁగున దారి చూచుకొనుచు శాంతి దేవి నదీతీరమున జేరుకొనెను. అప్పు డామె గట్టుమీఁద నిలువఁబడి బాహువులు పైకెత్తి ముకుళితావనతహస్తయై "ప్రభూ! హృదయేశ్వరా! పోవుచున్నాను. ఒక్కసారి దర్శింపవలయు నని యాశ యున్నది. ఈ యవసానదశయం దాకోరిక యెట్లు సిద్ధించును?" అని యనుకొనెను. ఇక నేమియుమాటాడ లేదు. ఎత్తుగానున్న యాగట్టు నుండి బలవంతముగ నదీజలములలోని కొక్కుమ్మడిగ దుమికెను.

ఆసమీపమునందే ప్రయాణము చేయుచున్న యొకనావనుండి దీప కాంతులు ప్రసరించుచుండెను. పడవలో నున్న పెద్దమనుష్యుఁ డావెలుఁగునం దా పతనముం గాంచి పడవవాండ్రతో "ఓరీ! త్వరగఁబోయి చూచిరండు! నదీజలమునం దెవ్వరో పడిపోయినట్లున్నది!" అని చెప్పెను.

౫౮

శాంతిదేవి యిల్లు విడిచి పోయినది - కళంకము దేశమంతటను బ్రాఁకి పోయినది. కులకామిని కులమును త్యజించి దుష్కులమందు పదార్ప

[illegible] గావించెనని యామెనే రాత్రి [illegible] నోటికి వచ్చినట్లు నిందింప నారంభించిరి. కాని మొత్తమునకు [illegible] భయముచే జ్ఞానశూన్యులైన [illegible] నిజమును వివేక కృత్యముం గావించుటలో [illegible] వెదకుకొనియుండు లేదు. నిజము తెలిసికొనుట కెవ్వరును బ్రయత్నింపను లేదు.

లోకు లనుకొనునది యొకటి; వినునది మఱియొకటి; జరిగినది యింకొకటి — "శాంతిదేవి [illegible] వచ్చి రాత్రి యందును దాఁగి యున్నట్లు [illegible] చూచుచుండెను. రామ సేవకుఁడు వచ్చువఱకు నాలస్యము చేసినచో [illegible] నవకాశ ముండదు. ఆతఁడు చాలరాత్రికిఁ గాని యింటికి రాఁడు. అందువలనే శాంతి యాతనితో లేచిపోయెను!" అని రామసేవకుని తల్లి గ్రామ మంతటను ప్రచారము గావించెను. కొన్నాళ్ళవఱకు నావార్త గ్రామమం దంతటను మాఱుమ్రోఁగుచుండెను. అందు వాండ్ర స్నానఘట్టములందును, పాలకా ధూమఘూనరితమగు కృషికుల చండీమండపమునందును, గురు మహాశయుని పాఠశాలయందును, పెద్దమనుష్యులసభయందును, కేవల మీ మాటలే — యీ యాలోచనలే యాందోళితము లగుచుండెను.

గ్రామమునందలి విష్ణుసర్కారు తానెన్ని విధముల నాలోచించినను నిందలివాస్తవమును గ్రహింపఁజాలకుండెను. శాంతిదేవివంటి యుత్తమ సాధ్వి యీగ్రామమునందు మఱియొకరు లేరని యాతనికిఁ దెలియును. గౌరవ కుటుంబములో జనించినయామె కులమును ద్యజించి, స్వామిని విసర్జించిపోయె ననుకొనుట యాతనికి విశ్వాసయోగ్యముగఁ దోఁచుట లేదు. ఆతఁడు సంధ్యాకాలకృత్యములను ముగించుకొని కఱ్ఱను లాంతరును చేతఁబట్టుకొని మెల్లమెల్లగా యతీశచంద్రునియింటికి వచ్చెను. రమాదేవికి జ్వరము తగ్గినది గాని, యింకను మంచము వదలలేదు. ఇంకను నెన్నిపాట్లు రానున్నవో యామెకుఁ దెలియుటలేదు. ఆమె యట్లే

మంచముపైఁ బడి దివారాత్రము లేమఫుతోనే గడపుచుండెను.

విష్ణుచంద్రుఁడు తిన్నగా నామె యొద్దకేపోయి "వదినె! యారోగ్య మెట్లున్నది?" అని ప్రశ్నించెను. రమాదేవి తలవంచుకొని యేమియు నారంభించెను. విష్ణుచంద్రుఁ డొకపీటపైఁ గూర్చుండి "ఏమమ్మా! ఈగొడవనుగూర్చి నీ యుద్దేశ మేమి?" అని ప్రశ్నించెను. రమాదేవి దుఃఖావేగము నించుక యడంచుకొని ఏమో నాకించుకంతయును దెలియదు బాబూ!" అనియెను.

విష్ణు — (ఇంచుకవిరక్తస్వరముతో) నీకేమియుఁ దెలియదని నేనిది వఱకే యనుకొన్నాను. నీ వేమియును జూచుకొనుట లేదు. కుటుంబమును దెవరెట్లుంచవలయునో యీవిషయమున నీ వేమాత్రమును శ్రద్ధ తీసికొనుట లేదు. అందుచేతనే యీసంసార మింత యస్తవ్యస్త మైపోయినది. యజమానురా లింటివిషయమునఁ గట్టుబాటులు సరిగాఁ జేసికొనుటకుఁ బ్రయత్నింప కూరకున్నచో నిట్లే కుటుంబమునందు కుండలు పడి పోవును. ఈ దుర్ఘటనమునకు రామసేవకుఁడు కారణమై యుండు నని నా కనుమానముగ నున్నది.

రమా — (దీర్ఘశ్వాసమును విడిచి) నేను బ్రదికి యుండియుఁ జచ్చిన దాననే — ఎవ్వారేమైన నేనేమి చేయఁగలను?

విష్ణు — ఒకసారి రామసేవకు నదలించి యడుగవలె నని యనుకొను చున్నాను.

రమా — వలదువలదు! నీవట్టిపని చేయవలదు. కొంపలు మునిఁగి పోవును. ఇఁక నీ యింటిలోనే యుండలేము!

విష్ణు — నీవిట్లు భయపడుచుండుటచేతనే యింతవఱకు వచ్చినది. ఏమైనను నేనాతని నిర్బంధించి యడిగినఁ గాని యిందలినిజము తేలదు. సత్యము బయటఁ బడకున్నచో నీవిషయమున శాంతిదోష మెంతవఱకున్నదో తెలియదు. నిజముగా నామె నిర్దోషురాలే యైనయెడల —

ఇతనిని మోసమునఁ జిక్కుకొన్నదే యైనయెడల దానికిఁ దగిన ప్రతీకారము గావింపవలసి యుండును.

ఇట్లు చెప్పుచు విష్ణుచంద్రుఁడు కాసింగూర్చి “నిస్తారిణీ!” అని పిలిచెను. నిస్తారిణి వచ్చినంతనే యాతఁడు “రామసేవకుఁ డెక్కడ నున్నాఁడు?” అని ప్రశ్నించెను.

నిస్తా — ఇప్పుడే తేనీరు ద్రావి వీధిలోనికిఁ బోవుటకు సిద్ధముగా నున్నాఁడు!

విష్ణుచంద్రుఁ డాతని బిలుచుకొని రమ్మన్నంతనే దాసి పోయి రామసేవకుని కాసంగతి విన్నవించెను. అప్పు డాతఁడు తాంబూలచర్వణము చేయుచు గర్వితగమనముతో నచ్చటికి వచ్చెను. విష్ణుచంద్రుఁడు కనుబొమలు కుంచించి వక్రదృష్టితో నాతని యాపాదమస్తకము నొకసారి తిలకించి “కూర్చుండుము! నీతో మాటాడవలసి యున్నది.” అనియెను.

రామ — కూర్చుండుటకు నా కవకాశము లేదు. చెప్పవలసిన దేమియో త్వరగ చెప్పుఁడు!

విష్ణు — అంత తొందర పడెద వేమి? ఇప్పుడు నీవే యీయింటి పెద్దవై యున్నావు. అన్ని సంగతులును నీవే చెప్పవలసి యున్నది. నీవే తెలిసికొనవలసి యున్నది.

రామ — ఈ మాటలతో మరల నా యెడలు మండించు టెందుకు? నే నేవిషయము తెలిసికొనకుండ నున్నాను? ఆమె యిల్లువిడిచి పాఱిపోయినది గాని నా కంటిలో దుమ్ము గొట్టఁగలిగినదా? నా కన్ని సంగతులును దెలిసియే యున్నవి.

విష్ణు — కుత్సితపు మాటలవలన నేమి ప్రయోజనము! మంచిది. ఈ మాట నీ వలన నే నింతవఱకును విననేలేదు. చెప్పుము బాబూ, యేమిజరిగినది?

రామ — వినుటవలన నేమిలాభము? ఆమె నడవడి మంచిది కాదు

విష్ణు — కాకపోవచ్చును — కాని యీ సంఘటన యెట్లు జరగినదో చెప్పుము.

రామ — సంఘటన సంగతి యెవరికిని తెలియదు. నేను వీధిలో నుండి చాల రాత్రివఱకు నింటికి వచ్చుటలేదు. వచ్చువేళలందుఁ దఱచుగా నా కంటఁ బడుచునే —

అనుచుండఁగా సరిగా నా సమయముననే దుర్గాంబ వగర్చుకొనుచు నచ్చటికి వచ్చిపడెను. విష్ణుచంద్రుఁడు కోపముతోఁ దన బంగారుతండ్రి నేమిచేయునో యను భయముచే నామె యంత త్వరితముగా కొమరున కడ్డముగ వచ్చి నిలువఁబడెను. అప్పుడు విష్ణుచంద్రుఁడు రామసేవకు నుద్దేశించి "నీ కంటఁబడిన దేమియో చెప్పుము!" అని ప్రశ్నించెను. అప్పుడు దుర్గాంబ యాత్రముతో "అయ్యా! వాని మాటయేమి? నేనును చాల దినములనుండి చూచుచునే యున్నాను. ఆ సంగతి తలఁచుకొన్నంతనే యిప్పటికిని శరీరము కంపించి పోవుచున్నది!" అనియెను.

విష్ణు — నీ వేమి చూచితివి రామసేవకా!

రామ — ఒక యువకుఁడు! వయసెంతయో లేదు! సరిగా నాయీడే యుండును. నే నొకటిరెండు సారు లాతని నడ్డగించికూడ నున్నాను.

విష్ణు — వాఁడు శాంతిదేవి కొఱకే వచ్చియుండెనని యెట్లు తెలిసికొనఁ గలిగితివి?

దుర్గాం — (మాట కడ్డము వచ్చి) తెలియకేమి? ఇద్దఱును గలసి మాటాడుకొనుచుండఁగా నేను రెండుసారులు చూచితిని.

విష్ణు — ఈ సంగతి యింట నెవ్వరికైనఁ జెప్పితివా?

"చెప్పకేమి? దాసితోఁ జెప్పితిని" అని రామసేవకుఁడు చెప్పెను. విష్ణుచంద్రుఁడు దాసిని బిలిపించి యడుగఁగా నా కెవ్వరు నీ సంగతి నెన్నఁడును చెప్పియుండలేదని యామె చెప్పెను. అప్పుడు దుర్గాంబ పెద్దగొంతు చేసికొని "ఓసి కృతఘ్నురాలా! అసత్య మాడుచున్నావా?

వీని మేనత్త కూతురినైన నీ కొట్టువానిమీఁద శత్రుత్వమా? సమయము వచ్చినప్పుడు నిజము చెప్పకపోతివా? ఇది యిప్పుడు మా కొంత యవమానము మనుకొన్నావు?" అని యడలించెను. దాసి యిట్టి బెదరింపులకు లొంగు వ్యక్తి కాదు. ఆమె ముక్కు మూరెడు చేసికొని, గొంతుగొప్పగ చేసికొని "ఏమమ్మా! మీ కింతయేడుపు పెట్టుచున్నందుకు నే సనత్కారము చెప్పవలెనా! — చాలు చాలు! చాల సుఖపడుచున్నాను! లేకున్నచో నా బ్రదుకెట్లు!" అనియెను.

దుర్గాం — నీ కేటి! నీవు దాసి వలె లేవు! రాణివలె నున్నావు. మేమే నీకు నయనకంటకములుగా నున్నాము. ఇంక మేము పోవుదుము లెమ్ము! పప్పులు, ఫలహారములును నీవే యారగించు చుండుము!

విష్ణు — (విరక్తితో) ఈ జగడాలెందుకు? నే నడిగినదానికి జవాబు చెప్పుము! — మంచిది రామసేవకా! ఇట్టి దుస్సంఘటనము గూర్చి దాసిదానితోఁ జెప్పుట యేమి? ఇంటిలోని వారికెవ్వరికైనఁ జెప్పక పోయితివా?

రామ — లేదు - చెప్పలేదు.

దుర్గాం — చెప్పుట యెట్లు? మేము పరాయివారము! చెప్పినచో నెవ్వరి కేమికోపము వచ్చునో!

విష్ణు — రామసేవకా! ఎప్పుడైన మీ మేనత్తతో నీ సంగతి చెప్పితివా? ఆమె నిన్నుఁ బరాయిగాఁ జూడదుగదా?

రామ — చెప్ప కేమి?

విష్ణు — నేనామె నడుగవచ్చునా?

రామ — మీతో నామె మాటాడుట యెట్లు?

విష్ణు — ఆమె నా కోడలు! నాతో మాటాడ కేమి?

దుర్గాం — వీఁడు చెప్పినను, నిత్యమును బుత్రశోకము చేతనే కుములుచున్న మా వదిన వీనిమాట చెవిని బెట్టినదో లేదో యెవరు

చెప్పఁగలవు?

విష్ణు — చెప్పనక్కఱలేదు! అంతయు నాకే తెలియును! రామసేవకా! ఒకమాట వినుము!

రామ — అది యేమో చెప్పుఁడు!

విష్ణు — చెప్పుట కేమున్నది? నీవే యీ దురవస్థ కంతకును మూలకారణమై యున్నావు.

రామ — నేనా?

విష్ణు — ఔను! నీవే యామెయెడల నత్యాచారము గావించుట కుద్యమించితివి! అందుచేతనే పాప మాబాలిక మోసము గుఱుతింప నాలోచించుకొనలేక విపత్సముద్రమునఁ బడిపోయినది!

రామ — సరే! అట్లే యనుకొనుము!

విష్ణు — అట్లే యనుకొని యూరకుండనా? ఎప్పుడును నీపథముగనే దినములు గడచునని యనుకొనకుము. వేయికన్నులతో సర్వేశ్వరుఁడు విశ్వమంతయును దిలకించుచున్నాఁడు! పాపము చేసినవారికి త్వరలోనే తగినశాస్తి కాక మానదు!

"అయినప్పు డనుభవింపవచ్చును" అని రామసేవకుఁడు వెడలి పోవుచుండఁగా విష్ణుచంద్రుఁడు "రామసేవకా! నామాట వినుము! ఇప్పుడైనను సత్యము చెప్పినచో భయపడి పాఱిపోయిన యామె నెట్లయిన నన్వేషించి తెచ్చుటకుఁ బ్రయత్నించెదను!" అనియెను. పోవుచున్న రామసేవకుఁడు చటాలున వెనుకకుఁ దిరిగి నిలువఁబడి "ఇది యెక్కడి దేశాచారమో నాకుఁ దెలియుటలేదు. లేచిపోయిన కోడలిని మరల నింటికిఁ దెచ్చిపెట్టుకొనుటయా?" అని యెత్తిపొడిచి తన దారిని బోయెను. దుర్గాంబయు నాతని మాటనే ప్రతిధ్వనితము గావించెను. విష్ణుచంద్రుఁడు మ్లానవదనుఁడై వెడలిపోయెను. రమాదేవి చిరకాలముక్రిందట మరణించిన భర్తను, పెద్దకుమారుని, విదేశమున నున్న దానేశుని దలఁచుకొని దుఃఖింప నారంభించెను.

మేఘమండలమును భేదించుకొని యపరాహ్ణసూర్య కిరణములు పొలములనడుమనున్న పుష్పవృక్ష శిఖరములపైఁ బ్రకాశించుచుండెను. యోజనములకొలఁది వ్యాపించియున్న యీ విశాలభూభాగ మంతయు భుగభుగ లాడుచుండెను. ఆ ప్రదేశమంతయు నిర్జనమై సస్యవిహీనమై యుండెను. కృషికులు పండిన వరిచేలను గోసివైచి చాలదినములైనది. కేదారము లన్నియు ఖండితమూలములతో నాచ్ఛన్నములై యుండెను. రెండునెలలక్రిందట జలపూర్ణములై యున్న యీ పొలము లన్నియు నాతపతాపమునఁ గ్రాగి యిప్పుడు శిలా కఠినములై యుండెను.

అంనొకచోట నొకపుష్కరిణి నిర్మలనీలజలములతో నిండి కుముద కల్హారవిలసితమై యుండెను. జలచరపక్షి గణము లం దీఁదుచు విహ రించుచుండెను. ఆ పుష్కరిణీతీరమునుండి యొక యాంగ్లేయుఁడు సైకిలుపై నెక్కిపోవుచు నాకస్మికముగా నొకదిబ్బ తగులుటచే ద్విచక్ర శకటముతోఁ గూడ నాతఁడు క్రిందఁ బడిపోయెను. ఆసమీపమునందే యొక చెట్టుక్రింద నొకమార్గస్థుఁడు కూర్చుండి గమనాయాసము తీర్చు కొనుచుండెను. దొరగా రట్లు పడిపోవుటం గాంచి యాతఁడు చటా లున లేచి దొరగారిని సమీపించెను. పాప మాంగ్లేయునకు గట్టి దెబ్బయే తగిలెను. ఒకదిబ్బపైఁ బడుటచే నాతని తలపై గాయ మయ్యెను. ఆ గాయమునుండి రక్తము స్రవించుచుండెను. ఆ దెబ్బతో దొరస్మృతి తప్పి పోయెను. సైకిలు విరిగి పోయెను.

పథికుఁ డప్పుడు తనయుత్తరీయమును జించి దొరగారి గాయమునకు గట్టుకట్టి పుష్కరిణినుండి తామరాకులతో నీరు తీసికొని వచ్చి యాతని మొగముమీఁదను, కన్నులమీఁదను, గాయముమీఁదను జల్లఁ దొడంగెను. చాలసేప ట్లాతఁడు శుశ్రూష గావింపగా దొరగారికి స్మృతి కలిగెను. అట్లు సేవ గావించిన పథికుఁడు మన క్షితీశచంద్రుఁడు!

తెలివి వచ్చినంతనే దొర లేచి నలుగడలను జూచి యప్పటి తన యవస్థను బాగుగఁ దెలిసికొనఁగలిగెను. తనతలపైఁ దగిలిన గాయమును కట్టును దడవుకొనుచుఁ దుదకు క్షితీశుని గాంచి "ఎవరుమీరు?" అని ప్రశ్నించెను.

క్షితీ — అయ్యా! నేనొక దరిద్రపథికుఁడను. ఈ చెట్టుక్రింద నా యాసము తీర్చుకొనుచుఁ గూర్చుండి మీరిట్లు పడి పోవుటం గాంచి చటాలున లేచి వచ్చితిని. మీరెవ్వరు? ఎక్కడకుఁ బోవుచున్నారు? మీబండి పాడైపోయినది. ఇఁక మీప్రయాణమెట్లు?

దొర — ప్రస్తుతము దుర్భిక్షముగా నుండుటచే నేనీ యోఢ్ర దేశమునందలి పల్లెలను గాంచి కష్టసుఖములను దెలిసికొన వలయునని స్వయముగా వచ్చితిని. కలకత్తాయందు నేనొక ప్రతికాసంపాదకుఁడను. ఇప్పుడు పూరీకిఁ బోవలయునని బయలుదేఱితిని. మీరెక్కడకుఁ బోయెదరు?

క్షితీ — నేను పోవుటకు నాకొక స్థలనిర్దేశము లేదు. నేను చాల పేదవాఁడను. ఏదైన నౌఖరీ దొరకు నేమో యను నాశతో నిందందుఁ బరిభ్రమించుచుంటిని.

దొర — మీరు వంగదేశస్థులవలె నగపడుచున్నారు. పనికొఱ కీదేశమున కేల వచ్చితిరి? ఈదేశ మంతయు దుర్భిక్షముగా నున్నది. కలకత్తాకుఁ బోలేదా? అక్కడ మీకేమియును బని దొరకలేదా?

క్షితీ — దొరకలేదు దొరగారూ! కలకత్తాయం దెన్నాళ్ళో ప్రయత్నించితిని. లాభము లేకపోయినది. కావలసినపెద్దల సాహాయ్యము లేనివానికి నౌఖరీ యెట్లు దొరకును?

దొర — ఇట్లాత్మీయులకు సాయపడకపోవుటయందు మీబంగాళా బాబు లందఱును చాలఘను లని స్పష్టపడుచున్నది. మీవంటి దరిద్రులకు నెల కేఁబదిరూపాయలపని గల్పించినచోఁ గుటుంబముతో సుఖ

ముగాఁ గాలక్షేపము చేయఁగలరు. అందఱు గొప్పబాబు లున్న కల కత్తాయందు నీవెన్నియో కష్టములపాలై ప్రయత్నించి తుదకు నిరాశచే వెడలి వచ్చుచుంటివి! అయ్యో! స్వజాతి నుద్ధరింపఁజాలని స్వార్థపరాయణుల కెప్పటికైన జాతీయతాగౌరవము లభించునా? ఎన్నటికిని లభింపదు. అట్టి జాతి యుగయుగాంతములకైన నున్నతి నందఁ జాలదు.

క్షితీ — దొరగారూ! సాయంకాల మగుచున్నది. మీబండి విరిగి పోయినది. పూరీ యిక్కడ కేడెనిమిదిక్రోశముల దూరముండు నని తోఁచుచున్నది. ఇఁక మీ రెట్లు పోయెదరు?

దొర — అదే బాబూ, ఆలోచించుచున్నాను. మీ రెక్కడకుఁ బోయెదరు?

క్షితీ — నేనుగూడ నీదేశమున కపరిచితుఁడనే—కాని దూరమునందు కొబ్బరిచెట్ల శిఖరములు గానవచ్చుచుండుటచే నట నొక గ్రామ ముండునని భావించుచున్నాను. అక్కడ జేరుకొని నేనీరాత్రి గడపఁ దలఁచితిని.

దొర — పదండి. నేనును మీతోడనే వచ్చెదను. నాభాష యీ దేశమువారికిఁ దెలియదు. ఇంగ్లీషువిద్య యిక్కడ జాల తక్కువగనే యున్నది. నీవు నాతో నున్నచో నాకుఁ గొంచెము సులభముగా నుండును. ఇందుకు నీకెట్టి యభ్యంతరము నుండ దను కొందును!

క్షితీ — అభ్యంతర మేమి? పదండి. గ్రామ మిక్కడి కింకను క్రోసు దూర ముండు నని తోఁచుచున్నది. మీబండి దీసికొనిపోవుట యెట్లు?

దొర — ఊరిలోనికి బోయి కూలివాని నంపి తెప్పించు కొనవచ్చు.

క్షితీ — అట్లయినచో బయలు దేఱుఁడు.

ఇట్లనుకొని వారిరువురును బయలుదేఱిరి. గాయమునుండి చాల రక్తము స్రవించుటచేతను, ఒడలంతయుఁ జితుక గొట్టినట్లగుటచేతను దొరగా రలసియుండిరి. మెల్లగా నిరువురును కొబ్బరిచెట్లు గుర్తు చేసి

కొని నడవ నారంభించిరి. వెలుఁగుండఁగనే వా రూరు చేరుకొనిరి. అది కేవలము చిన్నపల్లె. కృషికులును, గార్మికులును మాత్రమే యందు నివసించి యుండిరి. దొరగారిని జూచి వారు భయముచేఁ బారిపోవ నారంభించిరి. క్షితీశున కోఢ్రభాష రాకపోయినను నెట్లో కష్టపడి "మీరు భయపడ నక్కఱలేదు. మేము చాలకష్టములోఁ బడి మీ కతిథులమై వచ్చి యున్నాము" అని వారికిఁ దెలియునట్లు చెప్పఁగలిగెను.

ఆ యిరువురు నప్పు డొక పాడింటి ముంగిట నివాస మేర్పఱచి కొనిరి. క్షితీశుఁడు దొరగారి నటనుండి యొక కూలివానిని గుదుర్చు కొని పొలమునకుఁ బోయి యాతనిచే సైకిలును దెప్పించెను. తరువాత గొన్నిపాలును, అరటిపండ్లును దొరగారికిఁ దెచ్చిపెట్టి తా నేదియో తిని యారాత్రి గడపివైచెను. తెల్లవారినంతనే యొక సవారిని గుదిర్చి దొరగారిని బూరీ పంపుట కేర్పాటు చేసెను. ఆతనితోఁ గూలివాఁడు సైకిలును దీసికొని పోవుచుండెను. పోవునప్పుడు దొరగారు క్షితీశునిం గాంచి "బాబూ! నీవు చేసిన మహోపకారమునకు సంతుష్టుఁడ నైతిని. నీవుకూడ నాతో రాఁగూడదా?" అనియెను.

క్షితీ — నేను కేవలము నౌఖరీకొఱకే యీ దేశమునకు రాలేదు. నూకు శ్రీజగన్నాథస్వామి యిలువేల్పు! ఆ దేవుని, దేశమును దర్శించి, యిక్కడ నేదియైనఁ బని దొరకినచో మంచిదే; లేకున్నచో మరల గలకత్తాకే పోవఁ దలఁచుకొంటిని.

దొర — మీరు కలకత్తావచ్చినచో ఎస్ప్లనేడ్ రోడ్డున ... నెంబరు నింట నన్నుఁ గలసికొనుఁడు! మీ పేరు, గ్రామము, మండలము నేదియో నాకుఁ దెలుపుఁడు!

క్షితీశుఁడు తనవిలాస మంతయు నాతని కెఱిఁగించెను. దొరగారు తన నోటుబుక్కులో నంతయు వ్రాసికొని వెడలిపోయెను.

బౌబజారునందలి యొక మూఁడంతస్తుల మేడ మూఁగిటిమహాలులో నొక యౌషధాలయము నెలకొల్పఁ బడియెను. అచ్చట నెప్పుడు నైదారు గురు పని చేయుచుండిరి. దాని ముఖద్వారమునందు బల్లపై "మిస్సెస్ జేదాసీ చికిత్సాలయము - డాక్టరు డి. సి. రాయ్. యల్. యమ్. యస్. సర్వదా రోగులను బరీక్షించి మందుల నిచ్చుచుండును. రోగపరీక్షకు ఫీజు లేదు" అని లిఖింపఁ బడియెను. ఆ యింటిలో రెండు మహాలులు గలవు. అందు పెద్ద మహాలులో భాగ్యవంతుఁ డగు నొక మార్వాడీ నివసించి యుండెను. చిన్నమహాలులో యూథికాదాసి, దానేశచంద్రుఁడును (డి. సి. రాయ్) వాసము చేయుచుండిరి. పాంచకడీ కూడ వారితో నచ్చటనే యుండెను.

ఆకలిగొన్న గ్రద్ద మాంసఖండ లోలుపయై వక్రదృష్టితోఁ బలకించుచున్నట్లే యూథిక పాంచకడీవంక దృష్టిప్రసారము గావించుచుండెను. వేగవతినది తీవ్రప్రవాహము వంతెన స్తంభములకు సంఘర్షణముం గూర్చుచు నుద్దామగతిచే నుచ్ఛ్వసితం బగునట్లే యూథిక హృదయము నందలి యదమ్యమోహోజ్జృంభణము పాంచకడీ కుడియెడమలఁ గల సర్వావయవములను విక్షుబ్ధములుగను, విధ్వస్తములుగను, విపులావరుద్ధములుగను జేయుటకై యమిత ప్రబలవేగమును సాధించుకొనుచుండెను. ఆమె తన హృదయావేగము నడచుకొనుట కెంతమాత్రమును సమర్థురాలు గాకుండెను.

సంధ్యాసమయమునకు దరువాత నా యింటి మూడవ యంతస్తునందలి డాబాపై రెండు పడకకుర్చీలయందు యూథికయు పాంచకడీయును గూర్చుండి యుండిరి. పైని విశాలమగు ననంతాకాశము - అందు జ్యోతిర్మయుఁ డగు చంద్రుఁడును, మృదులాల్ప తేజోమయములగు తారకలును గలసిన ప్రేమపులకప్రపూర్ణ సమ్మేళనమాధుర్యము!

ఆ ప్రేమాంచలమున విశ్వమంతయు నాలోకప్రపూర్ణమై యుండెను. ఇక మధ్యభాగమున మృదు మంద గంధవహ విహారము ! భూతలమున వీధులలో "మల్లెపూలు! మల్లెపూలు!" అను పుష్పలావికల కోమల కంఠస్వరములు! మఱియును యువతీయువకుల ప్రేమపులకాంచిత గమనాగమనములు !

యామిక యా దినమునం దపూర్వముగ నలంకరించికొని యుండెను. ఆ నాఁ డామె నిశ్చయముగాఁ దనలో "ఇక సహింపఁ జాలను! గడియగడియకు, నిమిష నిమిషమునకు నిక మండి బూడిద నగు చుండుట కోపఁజాలను. ఇదియే తుదిదినము - ఆతని నా హృదయ సింహాసనమునైన నధివసింపఁ జేసెదను. కాకున్నచోఁ గాలిక్రిందఁ బడవైచి యుత్సవాంత నిర్మాల్య కుసుమమాలికల వలె నిస్సారునిగ నైనఁ జేసెదను" అని ప్రతిజ్ఞ చేసికొనెను. అందుచేతనే యామె సాయంకాలమునకుఁ బూర్వమునుండియు సిద్ధపడి యుండెను. అపూర్వ ముగ నలంకరించుకొని, యపూర్వ సౌరభములచే సకల సుకుమా రాంగకములను బరిమళింపఁ జేసికొని, వినీలకుంతలములను సుగంధతైల యుక్తములుగఁ జేసి యపూర్వ విచిత్ర వేణీరచన గావించుకొని విశ్వ మోహినివలెఁ బడకకుర్చీపైఁ గూర్చుండి యుండెను. ఆకసమునుండి వెన్నెల క్రిందికి దిగివచ్చి యామె సకలాంగకములను మిలమిల మెఱ యించుచుండెను. ఆమె యెట్టయెదుటనే పాంచకడీ! పాంచకడీ ధైర్య స్థైర్య గాంభీర్యరాశివలె నుండెను. ఆతని గాంభీర్యము మిగులఁ బవిత్ర మైనది; మిగుల మధురమైనది; మిగుల నవికలమైనది! యామిక యలంకార రచనయందలి చక్కఁదనమును, నామె మృదులాంగకముల యందలి రామణీయకత్వమును, వినీలకుంతలముల యందలి స్నిగ్ధసౌంద ర్యమును, కటాక్షముల యందలి కౌటిల్యమును, కపోలముల యందలి భూరుణ్యమును, అధరోష్ఠములందలి హాసవిద్యుత్తేజమును, శరీరచ్ఛాయ

యందలి లాలిత్యమును, భ్రూభంగములందలి మోహనవిలాసములను గాంచి సుస్థిరహృదయులై యుండఁజాలిన పురుషు లీలోకమునం దెందఱో యుండరు. అట్టి యవికలచిత్తులలోఁ బాంచకడీ యొకఁడు.

పాంచకడీ యోగియా? ఇట్టి మోహినీమూర్తిం గాంచి మహా యోగీశ్వరుల మనంబు లైనను జలించి పోకుందునా? పాంచకడీ మాతృదేవతోపాసకుఁడు! శక్తిసాధకుఁడు! అందుచేతనే యాతఁ డిదమిత్థమని నిశ్చయింపఁజాలని యనంత సౌందర్యముం గాంచి యిది యంతయుఁ దన యుపాస్యదైవతమగు మాతృమూర్తి దివ్యసౌందర్య వికాసమే యని తలంచి గంభీర పులకితహృదయమునఁ దమ భావించుకొను చుండెను. మఱియు భక్తిభావకంపిత కంఠముతోఁ దనలోఁ దానే "అమ్మా!" యని పిలుచుకొను చుండెను. "అమ్మా" యను శబ్దము చాల మధురమైనది. అమృత మధురమగు "అమ్మా" అను నామ మునం దదమ్యమగు శాత్రవముకూడ శిథిలమై పోవును. ప్రాణము పులకించి నృత్యము చేయును. నేత్రములనుండి యానందాశ్రుధారలు పొంగి పొరలును! అమ్మా యని పిలువనేర్చినవాఁడగుట చేతనే — శబ్ద స్పర్శ రూప రసగంధ మయియు, ననంతసౌందర్యశాలినియు నగు "అమ్మ"ను బాగుగ గ్రహించిన వాఁడగుట చేతనే పాంచకడీ యాత్మవిజయుఁడై యుండెను. ఎంతవఱ కింద్రియము లన్నియు శబ్ద స్పర్శరూపరస గంధలాలసములై యుండునో, యెంతవఱకు భోగ కాంక్షావశంవదములై యసంతృప్తి నందియుండునో యంతవఱకును మానవ హృదయములందు నూతనాభిలాషలు పుట్టుచునే యుండును. మనసునందుఁ గ్రొత్త కోరికలు పుట్టి యవి పుష్పింపక ఫలింపక వినష్టము లై పోవుచుండును. ప్రకృతి యీ విధముగనే యాశాపూర్ణులుగఁ జేసి జీవులను బంధించు చుండును. కాని యీ యనంత ప్రకృతిని విశ్వ మాతృమూర్తిగా భావింపఁ గలిగినచో — ప్రాణము పులకించు నట్లొక్క

పాని "అమ్మా" యని పిలువఁ గలిగినచోఁ దక్షణమందే సకల ప్రకృతి బంధములును విడిపోవును. ఆ తల్లి యాత్మవిస్మృతిం గాంచిన యీ జీవాత్మను, చేకొని విశ్వభోగముల నన్నిటి ననుభవింపఁ జేయును. విశ్వవికారముల నన్నిటిని లీలగాఁ జూపించుచుండును. ఒక్కసారి "అమ్మా, అమ్మా!" యని పిలిచినంతనే కరుణామయి యగు నా విశ్వమాత యే త్రోవను వచ్చెనో యా త్రోవనే పోవుచు నా జీవుఁడు మఱచి పోఁగొట్టుకొన్న యడుగుజాడలైన జేని మఱి త్పథము మఱల నాతనికిఁ గ్రమముగాఁ బ్రదర్శిత మగుటకు సాయపడు చుండును. దీనినే శక్తిసాధన యందురు. ఈ జ్ఞానమును సాధించువారే శక్తిసాధకులు! పాంచకడీ యిట్టి సాధనయందు సిద్ధపురుషుఁడు!

యూథిక — పాంచకడీ! నామాట వినుము! నాహృదయము వంకఁ దిలకింపుము. ఇందలి ప్రత్యేకపరమాణువునుగూడ భవనోన్మోహనమూర్తి మయమై యున్నది; నేను నిక్కముగా నిన్నే యభిలషించుచున్నాను.

పాంచ — (గంభీరస్వరముతో) ఏటి కీ యధర్మప్రవృత్తి? నేను నీబిడ్డను గానా?

యూథి — ఈ నీ పూర్వపుమాట లన్నియును విడిచిపెట్టుము! చాల దినములనుండి ప్రార్థించుచున్నాను. నేను స్వతంత్రురాలను. నాకెట్టి బంధములును లేవు. ఎవ్వరితోడను నాకెట్టి సంపర్కమును లేదు. నేను స్వేచ్ఛావిహారిణిని! అట్టి స్వేచ్ఛతోనే నేను నిన్నుఁ బరిగ్రహించెదను. నీవు నావాఁడ వగుము!

పాంచ — అది యెట్లు? నీవు నాతల్లివి!

యూథి — మరల నదే మాటయా? మీయన్నగారు చూచి యేమనుకొనునో యని సంశయింపవలదు. రహస్యముగనే నాయభీష్టముం దీర్పుము!

పాంచ — అమ్మా! నాయొద్ద నీక నిట్టి దుర్భాషణము లుపయోగింపవలదు!

యూధి — వినుము పాంచకడీ! నీ పాదములపై బడి యుంకేనా కరుణాభిక్షమును వేడుకొనుచుంటిని. నాజీవితమునం దెన్ని... నిష్ఫలరోదనములను గావించి యుండలే దని నీవు నిశ్చయముగా... కొనుము! ఒకించుక కనుసన్నమాత్రముననే శతశత సహస్రసహస్ర ... ములు వచ్చి యీయగ్నిజ్వాలయం దాహుతి యైపోయినవి. ... దెలిసికొనుము! — అయినను నిన్ను మాత్రము నేను ... కన్నాను! ఎక్కువగా నిన్నుగోరుట లేదు. ఒక్కనాఁడు — ఒక్క నాఁడే మాత్రము "నేను నిన్ను ప్రేమించితిని" అని యూఱడిల్లుము. ... మాత్రముచే నేను కృతార్థురాల నైతి నని సంతృప్తి నందెదను — కృతార్థనై యానందించెదను.

పాంచ — నేనెవ్వఁడను యూధికా! ఏల నాకొఱకు నీవింతగా ... లాట పడియెదవు? చీచీ మఱచిపొమ్మా! నా యీ రొమ్ములు ఖండించి చూడుము! ఇందున్నది కుక్కలునక్కలును దినఁదగిన పదార్థమే గాదా? ఒకగడియ కోసి పాఱవైచినచో దుర్గంధము కంటె నింకేమి యుండును? ఒక్కనిముసమైన నీవాదుర్వాసనకడ నిలిచి యుండఁగలవా?

యూధి — పాషాణహృదయా! ఇంకను శఠత్వమేనా? ఇంకను ప్రవంచనమేనా? ప్రతారణమేనా?

పాంచ — నేను నిన్ను మాతృమూర్తిగనే భావించి యున్నాను. మనలఁ బిలుచుచున్నాను. "అమ్మా!"అని — అమ్మా! నన్ను క్షమింపుము! నన్ను రక్షింపుము!

యూధిక కన్నులనుండి నిప్పులు రాలుచుండెను. ఆమె గభీర తీవ్రోత్తేజనాపూర్ణస్వరముతో "ఇంతేనా? నీవు నానిర్బంధమును — నా విన్నపమును — నా వ్యాకుల ప్రార్థనమును — నా యేకాంతదీనా లాపమును — మన్నింపవా?" అని గద్దించెను.

పాంచకడీ స్థిరహృదయముతో దృఢస్వరముతో "మన్నింపఁ

జాలను'' అనియెను.

యూథిక యున్మత్తరూపముం దాల్చి, చటాలున లేచి నిలువంబడెను. ఆమె బాహ్యప్రచారము గావించుచుం దీవ్రస్వరముతో "అట్లయినచో సిద్ధపడి యుండుము! నన్నీవిధముగా మోహానలజ్వాలలలోం ద్రోసివైచి నీవు మాత్రము సుఖముగా నుండఁగలవా? అట్లెన్నంటికి జరుగ దని బాగుగ దెలిసికొనుము! ఇదిగో! చూడుము! నీవును విషమవిష జ్వాలామధ్యమున భస్మమైపోయెదవు!'' అనుచుం దన కంచుకమునుండి యొకవస్తువును బైకిం దీసి పాంచకడీకిం జూపుచు "తెలిసినదా?'' అనెను.

పాంచ — తెలిసికొంటిని.

యూథి — దీనిసంగతి యంతయును వింటివా?

పాంచ — వింటిని.

యూథి — నిన్నే దోషిగాఁజేసి న్యాయస్థానమునం దొప్పగించెదను.

పాంచ — నేనేమి యపరాధము చేసితిని?

యూథి — ఏమిచేసితివా? యూథికసర్వప్రాణకుసుమములను పదతలమునం బడవైచి చూర్ణవిచూర్ణము లగునట్లుచేసితివి! కానిమ్ము! ఇంక నీవెట్లు సుఖముగానుండఁగలవో! నాసంగతి చూపించెదను. నీవెట్లాత్మ రక్షణము గావించుకొనఁగలవో చూచెదను. ఇప్పుడైనను నావాఁడ వగుదువో కావో చెప్పుము! ఇప్పటికిని గొంచెము సమయ మున్నది. ఇది తప్పినచో నీకింక నవకాశము గాని, నిష్కృతి గాని యెంతమాత్రమును లభింపదు. అప్పుడు నేనుగూడ నేమియు నుపకారము చేయంజాలను. తెలిసినదా! ఇప్పుడే చెప్పుము! ప్రియతమా! నావాఁడ వయ్యెదవా?—

పాంచకడీ యవికంపితకంఠస్వరముతో "కాఁజాలను!'' అనియెను.

యూథిక పండ్లు పటపట గొరుకుచు "ఇంకను గాఁజాలవా?'' అని యదలించెను.

పాంచ — తల్లియొద్దఁ గుమారునివ్యాపార మన్ని సమయముల యందు నన్ని యవస్థలయందు నొక్కలాగుననే యుండును!

యూథిక యట నొక నిముషమైన నిలువలేదు. రాక్షసీమూర్తితో నున్మత్తగమనముతో వెడలిపోయెను. పాంచకడీ కే వస్తువును జూపించెనో పోవునప్పు డామె దానిని గూడఁ దీసికొనియే పోయెను. పాంచకడీ యచ్చ్లే కూర్చుండి చాలసేపటివఱకు నాలోచించెను. పిమ్మట మధురకంఠస్వరముతో నొక గీతమునందలి కొలఁది భాగమును మరల మరలఁ బాడుకొనుచు మెల్లగా మేడనుండి క్రిందికి దిగిపోయెను.

అతఁడు పాడినది యిది :—

"కాలభయహారిణీ! భద్ర ♦ కాళి! జనని!
కూలుపకుమమ్మ! ననుఁ గాల ♦ నీలజలధి;
కన్ను తెఱవని బిడ్డపై ♦ నెన్నఁడైనఁ
గన్నతల్లికే కోపంబు ♦ గలుగునఁటవె!"

## ౬౧

రమణీహృదయము నందలి మహిమయు, విశ్వమండలము నందలి గరిమయు సృష్టినైపుణ్యములు! నారీరత్నమనునది విలాసవంతులకు విలాసము; సాధకులకు సాధన; యోగులకు యోగము; తపస్వులకుఁ దపస్సు — నారీమణి రూపమున శేఫాలికా కుసుమము; మాధుర్య మున నపరాజిత కుసుమము; మార్దవమున శిరీషకుసుమము; సతీత్వ గరిమమున యోజనగంధ మగు పారిజాత కుసుమము - సీమంతిని స్నేహమున మందాకిని; పవిత్రతను గోముఖి; దయాదాక్షిణ్యములను భాగీరథి; ప్రణయమున పల్గుణీతరంగిణి — కాంతయే సమానమునందు జానకి; పాతివ్రత్యమున సావిత్రి; తేజంబున ద్రౌపది — స్త్రీరత్నమనిన

గృహకార్యములయందు గృహిణి; సంతానపాలనమున జనని; అతిథిసేవయందు అన్నపూర్ణ; దీనరక్షణమున మూర్తీభవించిన కరుణ — సతీమణి యపారమహిమను మాటలతోఁ బ్రకటించుట కవకాశము లేదు. ఎంత వివరించినను సంపూర్ణము కాఁజాలదు.

ఇట్టి దేవీమూర్తి దానవి యెందుకగును? మానవి యెందుకు నాగిని యగును? — సతీత్వము కాంతామణికి స్వర్గీయ ధర్మమే కాక సాంసారిక కర్తవ్యముకూడ నైయున్నది. ఏరమణి యట్లు కాదో యామెకు సతీత్వము లేదు. అప్పుడే దేవి దానవి యగును. మానవి నాగిని యగును. ఆ గులాబిపువ్వునందలి పరిమళమంతయును పోయి కంటకములు మాత్రమే మిగులును. అందలి స్వర్గపారిజాతగంధము పోయి మర్త్యమునకగంధముగా మారును. యూథిక యిప్పు డున్మత్తేంద్రియసుఖముల యజ్ఞానమోహోత్తేజనముచే నట్టి యమూల్య ధనమును లాలసాస్వమను పంకిలప్రవాహమున విసర్జించి వైచినది. అందుచేతనే యా దేవి రాక్షసి యైనది; అందుచేతనే యా మానవి నాగిని యైనది. పాంచకడీ సంయమము నెదుట నామె లాలసత్వము నిష్ఫలప్రార్థనముగా జ్వలించి పోయెను. అందుచేతనే యా కాలభుజంగిని మోహావిషానల జ్వాలలామె కన్నులను భగభగ మండించుచుండెను! ఆమె ప్రతినిశ్వాసమునందును దావానల తీవ్రతాపము వెల్వడుచుండెను. ఆమె ప్రతిమాట యందును, ప్రతిచూపునందును హాలాహల ముద్గీర్ణ మగుచుండెను. ఆమె చటాలున మేడ దిగి పోయి సోఫాపైఁ గూర్చుండి సేవకుని బిలిచి డాక్టరుబాబును దీసికొని రమ్మని యాజ్ఞాపించెను.

సేవకుఁడు వెడలిపోయెను. గృహమధ్యమున గ్యాసుదీపము వెలుఁగుచుండెను. యూథిక లేచి యాప్రక్కనున్న నిలువుటద్దమునందు దన చక్కదనము నొకసారి చూచుకొనెను. మరలవచ్చి సోఫాపైఁ గూర్చుండి యతిమృదులస్వరముతో మెల్లమెల్లగా "శిరిషనాథా! నీవిట్టి

యప్సరస్సౌందర్య పూర్ణంబగు సర్వాంగ పరిణతమూర్తివి ప్రేమభరంబగు ప్రాణముతో నెట్టిప్రతిఫలాపేక్షయు లేకుండ నీకుఁ గానుక గావింతు నని చేసిన వ్యాకులప్రార్థనమును నిర్లక్ష్యముగాఁ గాలితో దన్ని వైచితివా ! దర్పాంధా! నీగర్వ మేమో చూచెదవుగాక! ఇట్టి దివ్యసౌందర్యము, ఇట్టినవయౌవనము, ఇట్టియున్నతవిద్య, ఇన్నిటిని మించిన విలోలలాలసత్వము—వీని నన్నిటిని నీపాదములచెంత నర్పించి, నాలుగు మాసములు తపించి, యాచించి, దుఃఖించి, యెన్నియో పాటులుపడి చూచితిని ! కాని నీకెంతగర్వము ! ఎంత యహంకారము ! నీవెట్లయిన నంగీకరించితివా ? అందుచేతనే యంత్యప్రతీకారముగా నింతటి భీకర తంత్రము గావింపఁ దలపెట్టితిని. పాషాణహృదయా ! దానికి దగిన ఫల మనుభవించెదవు లెమ్ము ! పాంచకడీ యీలోకమందున్నంతవఱకీయూధిక ప్రాణములకు శాంతి లేదు. ఎట్లు నీవులేకుండఁ బోయెదవో, యెట్లు నీజీవితలీల తుదిముట్టిపోవునో యట్టిప్రయత్నము గావించుటయే యిప్పుడు నా కేకమాత్రలక్ష్యము ! ఏకమాత్రోద్దేశము!” అని నిశ్చయించుకొనెను.

ఇంతలో దానేశుఁ డటకు వచ్చి గర్వితదానవీరూపముం దాల్చి యున్న యూధిక సముత్కటసౌందర్యముం గాంచెను. దానేశుఁ డావిష స్వరూపమునందే యమృతమూర్తిం గాంచి పులకితుండై పోయెను. ఆతఁడు మెల్లగా “ఎంత బాగుగ నలంకరించుకొన్నావు!” అనియెను.

యూధి — ఒకమాట — వినియెదవా ?

దానే — వెలుపల నెందఱి మాటలో విని వచ్చితిని. ఇప్పుడు నీమాట నీవు చెప్పనిదే యెట్లువినఁగలను ?

యూధి — ఈరసికతల కేమిలెమ్ము? వ్యాపారము చాల దుస్సహమైనది.

దానే — అది యేమి!

యూధి యింతకుఁ బూర్వము మేడమీఁదినుండి తెచ్చిన వస్తువును దానేసునకుఁ జూపించెను. చూచినంతనే యాతఁ డదరిపడి "ఇది మన యింటికెట్లు వచ్చినది?" అని ప్రశ్నించెను.

యూధి — ఇది యంతయును మీతమ్ముని ప్రభావమే—

దానే — ఎంత దారుణము! వాఁడేమి చేసినాఁడు?

యూధి — ఈసంగతి యంతయు నాకుఁ దెలిసినది. ఇంటివారికిని దెలిసినది!

దానే — ఇప్పు డేమగును?

యూధి — వారిప్పుడు పోలీసువారికి జెప్పుదురు — పాంచకడీని నిర్బంధించుట యగును.

దానే — ఇఁకనుపాయ మేమి? ఈ విపత్తంతయు నీమూలముననే వచ్చినది! నాకు వాని సంగతి తెలియును. అందుచేతనే మజఫర్‌పురము నుండి వానిని వెడల గొట్టివైచితిని. నీవే మరల వాని నిక్కడకుఁ దీసికొని వచ్చితివి! ఇప్పుడు మరియాద పోయినది. కులగౌరవము నశించినది. ఏమి చేయవలెనో చేయుము!

యూధి — చేయ కేమి! నేనిప్పుడే యా మార్వాడీభార్యయొద్దకుఁ బోయెదను - నీవు మార్వాడీకి క్షమాప్రార్థన చేయుచు నొకచీటి వ్రాయుము. పాంచకడీని సత్వరము యిటనుండి పంపివైచెద ననికూడ వ్రాయుము. ఇట్లు చేసినచో నీగొడవ యంతయును నేనడఁచివేయఁగలను.

దానేశుఁ డించుక యాలోచించి "నేను ముందుగనే యీ తప్పు నంగీకరించి వ్రాతమూలకముగాఁ దెలియఁజేయుటా?" అనెను.

యూధి — వారి కిదివఱకే యంతయును దెలిసిపోయినది. ఇప్పు డీరెండు వస్తువులును వారి కిచ్చివైచినచో తగవు లేకుండఁ బోవచ్చును. లేకున్నచో వారు పోలీసులకుఁ దెలుపుదురు. నన్ను సాక్షిగాఁ జేయు

దురు. నేను ప్రాణముండగా నసత్యము చెప్పఁజాలను. ఈ యాంగ్లేయు రాజ్యమునందు పాంచకడీ తప్పించుకొని యెక్కడకుఁ బోజాలఁడు.

దానే — అట్లయినచో నభియోగము జరుపకుండ పద్ధతిని జీటి వ్రాయుదును.

అని చెప్పి యూథికను సమ్మతింపఁజేసి "మహాశయా! మీరు నా మొగము చూచి క్షమింపవలయును. వానిని కొలఁది దినములలోనే యిటనుండి పంపివైచెదను. ఇక్కడ నున్నయన్నినాళ్ళును వానిని గను పెట్టి చూచుచుందును. మీవస్తువులను బంపించితిని— ఇట్లు— శ్రీదానేశచంద్రరాయి" అని యుత్తరమును వ్రాసెను. యూథిక యాచీటి నందుకొని వెడలిపోయెను. దానేశుఁడు పాంచకడీ కొకటుఁ గబురు పంపించెను.

జరగిన సంగతి యేమనఁగా: — ఆయింటిలో నవ్వలిమహలునందున్న మార్వాడీభార్య యొకహారమును, నొకయుంగరమును బారవైచు కొనెను. ఆమె భయముచే భర్త కాసంగతి తెలుపలేదు. తరు వాత మార్వాడియే యావిషయమును గ్రహించి యావస్తువు లేమైన వని భార్యను బీడింప దొడంగెను. ఎక్కడనో పడిపోయిన వని యామె భయపడుచుఁ జెప్పెను. ఆమార్వాడి భార్యయందు డించుక యను మానము గలవాఁడు. ఆమెనడివడియందు దాతని కంత నమ్మకము లేదు. కాని యా రమణిమాత్రము లక్ష్మీస్వరూపిణి! భర్త యామెపై నెన్నియో దోషముల నారోపించెను. తుదకా సమాచారము పోలీసులకు దెలియఁజేసెను. అది యిప్పటికి మూఁడుదినముల క్రిందటి మాట — ఒక్కయింటిలోనే వసించుటచే నీగొడవ యంతయు నా సౌధమునందలి వార కందఱికిని దెలిసిపోయెను.

కాని యీదుష్కృత్య మంతయు యూథికయే కావించినది. యూథిక పాంచకడీయెడల దనకుఁగల యభిలాషమును బూర్తిచేసి

కొనఁజాలక తుట్టతుద కీయంత్యప్రయత్నము గావించెను. తెలుచుగా నామె యాసూర్యాడీయింటికి బోవుచుండును. ఆమెయే యవకాశము చూచుకొని యావస్తువులను దొంగిలించెను. దానప్రేమ నిరాకరింపఁ బడి ప్రతికూలన్మత్తిచేఁ బ్రతిహింసానలజ్వాలగా మాఱిపోయెను. అందు చేతనే యూథిక పాంచకడీ సర్వనాశనమునకుఁ బూర్ణప్రయత్నము గావించెను.

సేవకునితోఁగూడ పాంచకడీ వచ్చి యన్నయెదుట నిలువఁబడియెను. దానేశుఁడు సేవకు నావలికిఁ బంపివైచి పాంచకడీ నుద్దేశించి విరక్త భావముతో క్రోధకర్కశ కంఠస్వరముతో "నీవు నా ప్రాణములు దీయుట కిచ్చటి కేల వచ్చితివి?" అని చీదరించెను.

పాంచ — ఏమి? నేనేమి చేసితిని?

దానే — ఇంకను నేమిచేసితి ననుచున్నావా! గాడిదా! నీ మూల మున నా కొంప మునిఁగిపోయినది. నీవు దొంగిలించిన హార మెవరిది?

పాంచ — నేనట్టి దొంగతనమును చేయలేదు.

దానే — ఓరి మూర్ఖుఁడా! నీవుగాక దానిని నేను దొంగిలించితినా?

పాంచ — నేను నీ పాదములు ముట్టి ప్రమాణము చేసి చెప్పు చున్నాను. నేను దొంగిలింప లేదు. మొట్టమొదట నే నా హారమును యూథిక యొద్దనే చూచితిని.

దానే — అట్లయినచో యూథిక దొంగిలించినదా?

పాంచ — ఆ సంగతి నాకుఁ దెలియదు.

దానే — కృతఘ్నుఁడా! యూథిక నిన్నెంతగా నాదరించి పుత్రుని వలె గారవించుచున్నది! నీ కొఱకిప్పుడు వారిని క్షమాభిక్ష గోరు కొనుటకుఁ బోయినదే! అట్టియామె యొద్దనా మొట్టమొదట నా హార మును జూచితినని చెప్పి తప్పించుకొన చున్నావు! విశ్వాస విహీనుఁడా! కుక్కా! నా యెదుటనుండి లేచిపొమ్ము!

అశ్రుతరళ నయనములతోఁ బాంచకడీ మృదులస్వరమున "యూధిక మా యమ్మ! ఆమె నన్నేల గారవింపకుండును? నేటినుండి నేపటి యుదయము బండిమీఁదనే పోయెదను. కాని - అన్నా అభయదానము చేసి నన్నొక మాట చెప్పనిమ్ము! ఒక్కటే మాట - నీవు నా సహోదరుఁడవు. నీ శ్రేయమే నాకును శుభము - కావుననే చెప్పుచున్నాను. నీవీమెతోడి సంపర్కమును వదలుకొనుము! గృహలక్ష్మి యగు మా వదినె తినుటకుఁ దిండిలేక, గత్యంతరము తోఁచక రేయుం బవలు తల్లడిల్లి పోవుచున్నది. ఈ కాలకాకోదర విషజ్వాలలోఁ బడి నీ విక్కడఁ దపించి పోవుచున్నావు! ఇది నీకుఁ గాని, కుటుంబమునకుఁ గాని యేమి శ్రేయము?" అనియెను.

దానేసుఁ డామాట కేమియు బదులు చెప్పలేదు. తర్జనభర్జనములు చేయుచు నటనుండి వెడలిపోయెను. పాంచకడీ స్వదేశమునకుఁ బోవుటకు బట్టలు సరుదుకొనుచుండెను.

## ౬౨

ఆ మార్వాడీ పేరేమైన నేమి! అందఱు నాతని రాజాసాహేబని పిలుచుచుందురు. ఈ బిరుదాతని కెట్లు వచ్చినదో యెవ్వరికిని దెలియక పోయినను నాతని నందఱు నిట్లే పిలుచుచుందురు. మనముకూడ నా నామమునే యుపయోగింతము. రాజాసాహేబు వసనభూషణ ప్రవర్తనము లన్నియు నాధునిక పద్ధతినే యనుసరించుచున్నను నాతఁడు తనజాతీయతను మాత్రము విసర్జింపలేదు. ఆతని తండ్రి స్వదేశమునుండి వట్టిచేతులతోఁ గలకత్తాకు వచ్చి, యిల్లిల్లు దిరిగి బట్టల నమ్ముకొనుచు నావర్తకమువలనఁ గ్రమముగా విశేషధనము నార్జించి పరలోకగతుఁడయ్యెను. ఈ రాజాసాహేబు కలకత్తాయందే జనించి, అందే ఇంగ్లీషు విద్య నభ్యసించెను.

ఇప్పటి కాతనివయసు ముప్పదియేండ్లకు మించి యుండదు. ఈతఁడు పిత్రార్జితద్రవ్యమును వర్తకులకు, కృషికులకును నప్పుగా నిచ్చుచు, వడ్డీవలన నాదాయము వృద్ధి చేసికొనుచుండెను. ఆమూడంత స్తులమేడ యాతనిదే - ఒక భాగమునఁ దానుండి రెండవ భాగమును దానేశున కద్దెకిచ్చెను. ఈనడుమ యూథికపై నాతని యనుగ్రహదృష్టి ప్రసరించెను. కాని యూథిక యిప్పుడు మునుపటి యవస్థలో లేదు. ఆమె స్వాతంత్ర చిత్తముతో నిర్బంధ విముక్త గగనపథమున విహరించుట లేదు. ఇప్పు డామె యొక సుందరపురుషుని ప్రేమించి యాత్మార్పణము గావించుకొను హృదయవేదనతోఁ బరితపించి పోవుచున్నది. సూర్యకిరణములు పాత్రభేదముం బట్టి రూపభేదముం గాంచునట్లే ప్రేమయు వివిధ రూపములం గాంచుచుండును. రాజాసాహేబు మోహదృష్టి తనపైఁ బడినదని యూథికయు గ్రహించి యుండెను. కాని యొక్కనాఁడైనను నామె యాతనివంక నించుక కృపాకటాక్షము నైనను బరగింపలేదు. నేఁడు యూథిక స్వేచ్ఛగా రాజాసాహేబు గృహద్వారమును జేరి యాతని రహస్యముగా బిలుచుకొని పోయెను. ఇప్పుడా యిరువురును రెండుకుర్చీలపై నెదురెదురుగాఁ గూర్చుండి యుండిరి.

రాజా — డాక్టరుసాహెబా! నేఁడు మాగృహము పావనమైనది. నీవు వచ్చినపని యేమి? నీదర్శనము మాకుఁ బరమసౌభాగ్య దాయకమైనది.

యూథి — సౌభాగ్యమో దుర్భాగ్యమో బోధ యగుటలేదు. రాజాసాహెబా! నేను నిన్నెల్లవిధములఁ బ్రేమించి యుంటిని. నేను ప్రాణముతో నుండి నీయనిష్టమును జూడఁజాలను - అందుచేతనే నిన్ను దర్శింప వచ్చితిని.

రాజా — ప్రేమించితివా? ఎట్టిమధురామృతధార నాహృదయమును బవిత్రముగఁ జేసినది! డాక్టరుసాహెబా! నాయనిష్ట మేమో చెప్పవా?

యూథి — అట్టిమాట చెప్పి నీపవిత్రకోమల హృదయమునకు

విచారము కలిగింపఁ జాలకున్నాను.

రాజా — అంతటి విషాదవార్తయా! చెప్పుము! నేను మనసు పదిలపఱచుకొనియే యున్నాను.

యూధి — నేను నిన్నెంతయో ప్రేమించితిని. అందుచేతనే చెప్ప వచ్చితిని. చెప్పకున్నచో నీకుఁ జాల యనిష్టమగును — నీ కళంకము నెవ్వ రెక్కడ వెల్లడించెదరో? ఎవ్వరు ప్రయత్నించి విపత్తును బిలిచి తీసికొని వచ్చెదరో?

రాజా — జరిగినసంగతి యేమో చెప్పవా? నీ మాటలవలన నా హృదయము మిగులఁ జలించిపోవుచున్నది.

యూధి — నీభార్య చాల మంచి నడవడిగలదే కాని యామె యౌవనోద్దామలాలసత్వము డాక్టరుసాహేబుతమ్ముఁడు పాంచకడీమీఁద బడినది!

రాజాసాహేబు ఒక్కయుదుటున లేచి నిలువఁబడెను. ఆతని కపాలనాడీమండలము బిగిసికొని పోయెను. ఆతఁ డుత్తేజిత స్వరముతో "ఏమిది! ఈసంగతి నీకెవరుఁ జెప్పినారు?" అని ప్రశ్నించెను.

యూధి — వినుము రాజాసాహెబా! నేను నిన్ను బ్రాణాధికముగఁ బ్రేమించితి నని యిదివఱకే చెప్పి యుంటిని. ఆప్రేమచేతనే యీ రహస్య వృత్తాంతమును నీకెఱింగింపవచ్చితిని. మనసు చెదరఁ గొట్టుకొనకుము! పురుషోచితధైర్యముతో నెల్లసంగతుల నాలకింపుము!

రాజా — వినవలె నని లేదు. చెప్పుము! సంక్షేపముగ నొకటి రెండుమాటలతోఁ జెప్పుము. నిదర్శనములతోఁగూడఁ జెప్పుము. చెప్పుము — చెప్పుము — ఆలస్యము చేయకుము!

యూధి — నీభార్య తన కంఠహారమును, ముద్రికను బాంచకడీకిఁ బ్రేమోపహారముగా నిచ్చివైచినది.

రాజా — (పూర్వాధి కోత్తేజిత స్వరముతో) అసత్యము! మిథ్యా భాషణము! ఆమె యావస్తువులను బాఱవైచుకొన్నది. నీకీ యసత్య

[illegible]

యూసఫ్ — [illegible] చీట్లు నిజముగాఁ గా [illegible] చుకొనిరో యున్నచో [illegible] నీకుఁ జెప్పియుందును. నీకుఁ దెలియకుండ నా [illegible] నీవడిగితివి. అప్పుడు పాలిపైచు [illegible] నీకెట్లు సమాధానము చెప్పఁగలను ?— ఆ యుంగ [illegible] చూడుము !

రాజాసాహేబు [illegible] నిప్పు లోలుకు చుండెను. ఆతని తలతిరిగి [illegible]. గుండెలు పగిలి పోవుచుండెను. ఆతఁడు పండ్లు పటపట [illegible] "[illegible]! ఇదియే!" అనెను.

యూసఫ్ — అట్లు తత్తరపడియెద వేమి? నీవు మగవాఁడవు; సాధారణ స్త్రీలవలె నిట్టిస్వల్ప విషయములం గూర్చి యస్థిరుఁడవుగావలదు; వినుము ! ఎల్లసంగతుల నాలకింపుము !

రాజా — ఇఁక నాకు వినవలె నని లేదు ; అయినను చెప్పుము !

యూసఫ్ — ఈవిషయముంగూర్చి డాక్టరుబాబు నీకొరకు చీటి వ్రాసి పంపి యున్నాఁడు. ఇదిగో చూడుము! చూచి నీవు క్షమించిన క్షమింపవచ్చును. దయ యున్నచో ననుగ్రహింపవచ్చును.

అని యూసఫ్ యాచీటి నాతని కిచ్చెను. దానిని రాజాసాహేబు చదివి శతఖండములుగఁ జించి పాలిపైచి కర్కశకంఠస్వరముతో "క్షమయా ! సాంచకడి రక్తముతోనే దీనికి క్షమ ! నీవిఁకఁ బొమ్ము !" అనియెను.

యూసఫ్ — నీవింత తొందరపడియెద వేల ? మరలఁ జెప్పుచున్నాను. "రాజా సాహేబా ! ప్రాణాధికా ! నేను నిన్నుఁ బ్రేమించుట చేతనే సర్వము సేకరింపించితిని. సావధానుఁడ వగుము ! ఓరుపు వహింపుము ! నీకు విచారము గలిగింప వలయు నని నాయుద్దేశము గాదు.

రాజా — కుక్కలకొడుకు! ఉచ్ఛిష్టభోజి! అతని నాశము చేయుటలో దోషమేమియును లేదు.

యూధి — అందువలన నీకుమాత్రము విపత్తు గలుగదా?

రాజా — నాకు విపత్తు సంభవించునా? ఎన్నినియిల్లాలు పరాసక్తురాలైపోయెనో, యూతెనికి సంపద్విపత్తులింకేం బని యేమున్నది, డాక్టరు సాహెబా!

యూధి — దుష్ట సంస్కారము! నీదే యీ యతిక్రమ శిక్షణము! ప్రేమ యనునది బలవంతముచేఁ గలుగునది కాదు. డాక్టరుబాబు నన్నెంతయో యాదరించు చుండును. అయినను నాప్రాణము లెప్పుడును నీపాదతలముననే పొరలుచుండుట యేమి?

రాజా నా కేమాటయుఁ దెలియుట లేదు డాక్టరు సాహెబా! నా హృదయ మంతయు నగ్నికుండమువలె మండి పోవుచున్నది. పాంచకడీ రక్తమున గాని యీమంట చల్లారదు!

తనప్రయాస మించుకంతయు వ్యర్థముగఁ బోలేదని యూధిక స్పష్టముగా గ్రహింపఁగలిగెను. విషము పని చేయుట కారంభ మైనది. ఆమె యీ యుపయుక్తసమయమును విడువక "అట్లయినచో నీవిషయమున నేమిచేయఁ దలఁచితివి?" అని ప్రశ్నించెను.

రాజా — చేయుట కేమున్నది? పాంచకడీ గుండెలు చీల్చి రక్తము పానము చేయుటయే!—

యూధి — ఈస్వల్ప విషయమునకై యాత్మవినాశ మేల చేసికొనవలయును? ఇది ఇంగ్లీషుప్రభుత్వము! ఇందు హత్య చేసినవానికురి శిక్ష తప్పదు!

రాజా — కానిమ్ము! నాకదియు నంగీకారమే—

యూధి — వలదు! అందువలన ననిష్టము తప్పదు. అది చాల దుస్సహమైనది. నీవాతని గారాగృహమునకుఁ బంపగూడదా?

రాజా — నాశరీరము నందలి రక్తమింకను బంగాళీల రక్తమువలెఁ జల్లారి పోయి యుండలేదు.

ఆమాట విని యూధిక లేచి నిలువఁబడియెను. ఆమె తన కన్నుల నుండి నిప్పులను జిమ్ముచు “ అట్లయినచోఁ గానిమ్ము! నేఁడే కార్యమును సాధింపవలయును. వినుము రాజాసాహేబా! పాంచకడీ నన్నెంతయో బాధ పెట్టినాఁడు! బలవంతముగా నాసతీత్వమును వినష్టము చేయఁ బ్రయత్నించినాఁడు! నావస్తువుల నెన్నిటినో దొంగిలించినాఁడు. ఆతని మరణము నాకును సుఖమే – ఆతనిరక్తముచేఁ గాని నాకు మనశ్శాంతి కలుగదు. ఆతఁడు నిజముగా రేపటి యుదయమున నిటనుండి తన యూరికిఁ బోవును. నేఁడు యౌషధాలయమునఁ బ్రవేశించి యాతని హత్యచేసి రావలయును. అచ్చటనే యాతఁడు పరుండును. ఆ హాలు తలుపులు తీసియే యుంచెదను” అని చెప్పెను.

రాజాసాహేబున కేమియుఁ దెలియుట లేదు. ఏమాటలు నర్థమగుటలేదు. ఆరాక్షసి దుస్తంత్రమునకుఁ జిక్కి యామె కుటిలాలోచనము లంగీకరించి యామెచేతికీలుబొమ్మ యైపోయెను. తన యుద్దేశము ఫలించె నని ప్రఫుల్లహృదయముతో యూధిక వెడలిపోయెను.

అప్పుడు రాజాసాహేబు తన నమ్మకమైన వంట బ్రాహ్మణుని బిలిచి పాంచకడీని హత్య చేయవలెనని యాజ్ఞాపించెను. వాఁడు పాంచకడీ నెఱుఁగును. రాజాసాహేబాతనికి బహుమానముగా రెండువేల రూపాయల నిచ్చెద నని చెప్పెను. వంటబ్రాహ్మణుఁడు ద్విసహస్ర రజత ముద్రల యందలి లోభమును ద్యజింపఁ జాలక పోయెను. ఆతఁడు మొదట జాలసేపేమేమో యాలోచించుకొనెను గాని, తుదకు హత్య చేయుట కంగీకరించెను.

## ౬౩

ప్రతిదినమును వైద్యాలయమునకు సేవకుఁ డుదయముననే వచ్చి పాంచకడీని లేపి తలుపు తీయించి గ్యాసుదీపము నార్పివైచి యిల్లు తుడిచి

పోవుచుండును. అట్లే నేడును వచ్చి యాతఁడు తలుపు తట్టినంతనే తలుపులు విడిపోయెను. ఆతఁ డాశ్చర్యముతో లోనికిఁబోయి చూచి యొక పెద్దకేక వైచెను. పాంచకడీ శయ్యపై నగపడలేదు. ఆతని పడక యంతయు రక్తప్లావితమై యుండెను. పడకనుండి రక్తధారలు గోడలమీఁదికిఁ గూడఁ జిమ్మియుండెను. గదియంతయు రక్తమయము! అది చూచి సేవకుఁడు "ఖూనీ" జరిగినదని కేకలువైవ నారంభించెను.

ఆ కేకలు దానేశుని చెవులఁబడెను. ఆతఁడు రెండవమహాలులో రెండవయంతస్తునందు శయనించి యుండెను. అటనుండి యాతఁడు త్వరముతో దిగి వచ్చి యంతయును జూచి కేకలు వైచెను. పుర రక్షకభటుఁ డాకేక విని వచ్చి చూచెను. అచ్చట రాజాసాహేబు, యూథిక మొదలగువారు కూడఁ జేరి యుండిరి. పాంచకడీ హృదయ రక్తమును జూచి రాజాసాహేబొక దీర్ఘనిశ్వాసమును విడిచెను. యూథిక కన్నులు మూతలు పడిపోయెను. ఆమె హృదయమునుండి నిశ్శబ్దకరుణవిలాప ధ్వనులు వెలువడుచుండెను. అట్లు తల్లడిల్లిపోవుచున్న హృదయావేగము నడంచుకొని యామె "పాంచకడీ లేఁడు!" అనియెను. ఆమె కన్నులలో నశ్రుబిందువులు లేవు. ఉచ్ఛ్వాస నిశ్వాసములు దీర్ఘములై వెడలుచుండెను. మొగము శుష్కించి పోయెను. అప్పు డామె యున్మాదినివలె నయ్యెను.

పాంచకడీ మరణించినచో - పాంచకడీని హత్య గావించినచో నింకను నామె హృదయజ్వాల యెట్లు వర్ధిల్లిపోవునో యామె ముందుగా గ్రహింపలేదు. ఆమె ప్రకృతిశాసితమగు మోహమునకుఁ గ్రీతదాసి యైయుండెను. ప్రేమించిన యాతఁడు తన్నుఁ ద్యజించినను ప్రేమిక కాతనియం దభిమానము మాత్రము పోఁజాలదని యామె ముందుగాఁ దెలిసికొన లేకపోయెను. ఏమనిన :— ఆమె యింతవఱ కెవ్వరిని ప్రేమించి యుండలేదు! ఇతరుల హృదయములను, ప్రాణములనుగూడ

నపహరించి విలాసవిహారము గావించినది. వాని సన్నప్రాణములను ప్రేమచరణ దళితములుగాఁ జేయుచు, విలాసహాసము గావించుచుఁ గాలక్షేపము చేసినది. కాని యామె పాంచకడీని మాత్రమే నిక్కముగఁ బ్రేమించినది. తెలియకుండఁగనే తనప్రాణముల నాతని పాదపీఠముచెంత సమర్పించినది. తనకుఁ దెలియకుండగనే తన సర్వస్వము నపహరించుకొని పాంచకడీ వెడలిపోయెనని యామె యప్పటి కాగ్రహింపఁ గలిగెను. అయ్యో! ఇదియేమి? ఇంతటి సర్వనాశము సంభవించినది! ప్రాణముల నపహరించి వానితో విలాసఖేలనము గావించుచుండు నామె కిప్పుడు ప్రాణఘాతుక వ్యాపారము తటస్థించినది. ఆమె తన వక్షమునందుఁ దానే బాకుతోఁ బొడుచుకొన్నది! రక్తము! రక్తము! — ఎవరిరక్తము? అబ్బా! ఎంతటి దారుణకృత్యము! ఆమె నిలువఁజాలక పోయెను - కూర్చుండ లేకపోయెను. ఈ విశ్వమంతయు నామెకు నరకానలజ్వాలామయముగఁ నగపడు చుండెను. ఆమె ద్రుతపదగమనముతో నటనుండి వెడలిపోయెను.

దానేశుఁ డేడువ నారంభించెను. రాజాసాహెబునివంటివాఁడు తన ప్రేమాధారమగు కనిష్ఠసోదరుని పాంచకడీని తరుణవయస్కుని హత్య గావించెనని యాతఁడు తెలిసికొన లేకపోయెను. అతఁడట్లే యేడ్చుచునే స్టేషనునుండి రక్షకభటాధికారిని దీసికొని వచ్చుటకై సేవకుని బంపించెను. కొలఁది సేపటిలోనే భటసహితముగా పోలీసు ఇన్‌స్పెక్టర్ వచ్చి హత్యాస్థానమును జాగ్రత్తగాఁ బరిశీలించి యొకచోట రక్తసిక్తమై పడియున్న కత్తిని దీసి పిమ్మట నింటిసేవకుని బిలిచి "ఈ తలుపులు గొళ్ళెము లేకయుండుట నీవెప్పుడు వచ్చి చూచితి?" వనెను.

సేవ — తెల్లవారుచుండఁగా నైదుగంటలవేళ — నేను ప్రతిదినము నావేళకే పోయి బాబును బిలిచి తలుపు తీయించు కొనుచుందును.

ఇన్ — ఈతలుపులు ప్రతిదినమును లోపల గొళ్ళెము వేయఁబడియే యుండునా?

సేవ – అక్లే యుండును. నిన్నరాత్రి నేనింటికి బోవునప్పుడు బా బీలోపలికిఁ బోయి గొళ్ళెము వైచుకొనియెను. పోవు చుండగా నా చప్పుడు నాకు వినఁబడినది.

అప్పుడు ఇన్‌స్పెక్టరు దానేశునింగాంచి "హంతకు లీయింటిలోని వారే యెవ్వరో నైయుందురు. కాదేని యెవ్వరో యీగదిలో బ్రవే శించి యీకరవాలముతో నాతని నఱకి చంపి యీఁగడ తెలియకుండు నట్లు శవకళేబరము నెత్తుకొనిపోయి యుందురు. హంతకుఁ డొక్కఁ డైన నింతపని జరుగదు. హంతకు లొకరికంటె నధిక సంఖ్యగలవారై యుందురు" అనియెను.

"అట్లయినచో నింక హంతకులను బట్టుకొనుట కుపాయములేదా?" అని దానేశుఁడు నిలువునఁ గూలఁబడిపోయెను. ఆమాట యాతని హృదయము నందలి తీవ్రవిషాదోచ్ఛ్వాన మాత్రమే – ఇన్‌స్పెక్టరు తన యుద్దేశాను సారముగ నచ్చటి పరిస్థితుల ననుసంధానము గావించు కొని పదిగంటలవేళ నటనుండి వెడలిపోయెను.

దానేశుఁ డచట నేకాకియై పడియుండి కూర్మితమ్మునికొఱకు శోకసంతప్త హృదయుఁడై తల్లడిల్లి పోవుచుండెను. ఇన్నాళ్ళకుఁ దరువాత నాతనికిఁ దనపల్లెటూరు సంగతి మనసునకు వచ్చెను. దానితో నాతనితల్లి జ్ఞప్తికి వచ్చెను. అందువలన నాతఁడు బాలకునింబోలి రోద నము చేయుచు "అమ్మా! నీయొడిలోనిబిడ్డ పాంచకడీ యింక లేఁడమ్మా! ఈ వార్త తెలిసినంతనే నీ వేమైపోవుదువోగదా తల్లీ! అమ్మా! అమ్మా! నాయపరాధము వలననే, నా యసావధానతవలననే నీ నయనచింతామణి చూర్ణవిచూర్ణమైపోయినది జననీ!" అని పెద్దపెట్టున రోదనము చేయ నారంభించెను.

ఆసమయమునందే పోస్టుజవాను వచ్చి రెండుత్తరముల నాతని యెదుటఁ బడవైచెను. అందొక యుత్తరము తన యింటియొద్ద నుండి

వచ్చినది. ఇంకొకటి యాతని మిత్రుఁడగు కామపురపు జమీం దారుఁడు రామప్రాణసుబ్బ వ్రాసినది. అందు "బాబూ చూచిన వెంటనే బయలుదేఱి రావలయును — మాయింటి నొక యువతి జీవిత సంశయావస్థలోఁ బడియున్నది. మీరు వచ్చినంతనే కర్చంతయు నిట్టి నిచ్చెదను. ఇతరము లగుపను లేవి యున్నను విడిచిపెట్టి తప్పక రావలెను. అందువలన మీకుఁ గలుగునష్టము నంతను నేనిచ్చుకొందును. మీరు చాలసారులు మాయింటి వైద్యము చేసితిరి. ఇంటివా రందఱికి మీయందే విశ్వాస మున్నది. అందఱును మీ రాకనే కోరుచున్నారు" అని యుండెను. తరువాత నింటి యొద్ద నుండి వచ్చిన రెండవ యుత్తరమును జూచెను. చూచి నంతనే యాతఁడు క్రోడమునందు మూర్ఛావస్థలోఁ బడియున్న బిడ్డను జూచి తల్లి యెట్లుగా నెంతటి దుఃఖతాపవిచ్ఛిన్న హృదయుఁడై యుండునో, "ఎక్కడకుఁ బోవుదును? ఏమిచేయుదును?" అని తల్లడిల్లిపోవుచుండునో దానేశుఁ డిప్పు డట్టి యవస్థలోఁ బడిపోయెను.

ఆయుత్తరము విష్ణుచంద్రసర్కారు వ్రాసినది. అందు "దానేశా! మీకుటుంబమునందు నీవే విద్యాధికుఁడవై యున్నావు. నీ యాత్మీయు లందఱు నీమీఁదనే యాశ పెట్టుకొని యున్నారు. కాని నీవుమాత్రము కేవల మధఃపతితుఁడ వై పోయితివి! నీపైఁ బెట్టుకొన్న యాశ లన్నియు వ్యర్థము లై పోయినవి. పోనిమ్ము! వానిమాట కేమి! అన్నిటికంటె నిప్పుడు తటస్థించిన కష్ట మేమనఁగా:—చిన్నకోడ లెక్కడికో పోయి నది. ఆమె పోఁబడింగూర్చి లోకు లనేకరీతుల చెప్పుకొనుచున్నారు. కాని యామె నిష్కల్మష హృదయ యని నా విశ్వాసము — ఏవో తెలియరాని యుచ్చటి యత్యాచారములను సహింపఁజాలక — ఆ విష జ్వాలలను భరింపలేక వెనకముందు లాలోచించుకొనలేక, విపద్విముక్తి కొఱకు — శాంతికొఱకు — ఆశపడి యెక్కడకో పలాయిత యై

యుండును. ఇచ్చట మీాకెల్లియవస్థకూడఁ జాలశోచనీయముగా నున్నది. నీవీ యుత్తరము చూచినంతనే యింటికి రావలయును. వచ్చునప్పుడు పాంచకడీని గూడ వెంటఁ బెట్టుకొని రమ్ము." అని యుండెను.

"శాంతీ! శాంతిదేవీ! నీవు కులటవా? అయ్యో! నిర్భాగ్యుఁడ వగుదానేశా! ఇంతకాలమునకుఁ దరువాత నే మొగము పెట్టుకొని శాంతిదేవి నామము నుచ్చరించుటకు సాహసించుచున్నావు!" దానేశుఁడు స్వయముగనే యీామాటల నుచ్చరించెను. పిమ్మట నాతని హృదయమున 'పాంచకడీని వెంటఁ బెట్టుకొని రావలెను! అయ్యో తమ్ముఁడా పాంచకడీ! నీవెక్కడ నున్నావు!' అను దుఃఖభావావేశ మొక్కసారిగా బ్రబలి యాతని సర్వాంగములను గంపితములుగాఁ జేసివైచెను.

## ౭౪

అశనితాడిత వృక్షమువలె స్తంభితుఁడై పోయిన దానేశుఁ డచ్చటఁ జాల సేపటివఱకును బడి యుండెను. అప్పు డాతని హృదయమునందు బంధుమిత్రులు, దేశవిదేశములు, భూమ్యాకాశములు, స్వర్గనరకములు మున్నగువానిం గూర్చి యెన్నెన్నియో యాలోచనలు తోఁచెను. పిమ్మట నాతఁడు తనలో "ఈ దుస్సహశోక తాపమును భరింపఁ జాలను! ఏమి చేయుదును? ఎక్కడకుఁ బోవుదును? ఎచ్చటికిఁ బోయిన నీ భీషణ జ్వాలలు చల్లారును? రామ ప్రాణబాబు నింటికిఁ బోయెదను! రైలులోఁ బడి బహిఃప్రపంచమును దర్శించుచు నీ దుర్దమశోకమును గొంతవఱకైన మఱచిపోఁ గలనేమో! ఈ యగ్నిజ్వాల యించు కంతైనఁ జల్లారునేమో!" అని యనుకొనెను.

అంత దానేశుఁడు లేచి యింటిలోనికిఁ బోయెను. వంట సిద్ధమైనది. దానేశుఁడు స్నానము చేసి యొకసారి నామమాత్రముగా భోజనమునకుఁ గూర్చుండెను. రామప్రాణబాబు నింటికిఁ బోవలసి యుండుటచే

భుజింపక తప్పదు గావున నన్యమనస్కుఁడై యాహారమునకుఁ గూర్చుండెను. కాని యన్న మాతనినోటికిఁ బోలేదు. ఆతఁడు లేచి వచ్చి సేవకునిం గాంచి "యూధిక స్నానభోజనము లైనవా?" అని ప్రశ్నించెను.

సేవ — లేదు బాబూ! ఆమె యవస్థ చాల విషమముగా నున్నది. ఆమె కేవలము పాంచకడీబాబు కొఱకు హాహాకారము గావించు చున్నది. కేవలము పిచ్చిదానివలె నైపోయినది.

దానే — ఆమె యెచ్చట నున్నది?

సేవ — పడకగదిలోఁ బడియున్నది.

ఊరికిఁ బోవలసిన దుస్తులం దాల్చియున్న దానేశుఁ డప్పుడు యూధికం గాంచుటకై మేడమీఁదికిఁ బోయెను. అప్పటి యూధిక యాకారము భీకరమై యుండెను. తలవెండ్రుకలు చెల్లాచెదరై మొగముపై విరియఁబాఱి వికృతముగ నుండెను. తొడిగిన యుడుపులు స్ఖలితములై కన్నులనుండి యగ్ని స్ఫులింగములు వెలువడుచుండ నామె కేవల మున్మాదినివలె నగపడుచుండెను. ఆమె స్థిరముగాఁ గూర్చుం డుటకుఁ గాని, నిలిచియుండుటకుఁ గాని యోపఁజాలకుండెను. దానే శుఁడు లోపలికి వచ్చినంతనే యామె లేచి యాతనియెదుట నిలువఁ బడెను. అప్పుడామె యున్మత్తవికటశుష్కహాసము గావించుచు "ఏమి డాక్టరుబాబూ! చిన్నతమ్ముని రక్తపానముచేఁ గడుపు నిండలేదా? ఇంకను బొట్ట చేతబట్టుకొని డబ్బు సంపాదించుకొనుటకు బయలు దేఱితివా? హాహ్హాహ్హా - పాంచకడీ - ఇహ్హిహ్హిహ్హి - నేనాతని పవిత్ర నామము నుచ్చరించుటకుఁ గూడ నెంతమాత్రము యోగ్యురాలను గాను!" అనియెను.

దానేశుఁ డామె యవస్థంగాంచి దుఃఖముపై దుఃఖము ననుభవించుచు "యూధికా! నీవు పాంచకడీని బ్రేమించితివా?" అని ప్రశ్నించెను.

యూధిక యున్మాద తీవ్రకఠోరస్వరముతో "ప్రేమించుటయా? ఎవరికిఁ బ్రేమ? పాంచకడీని బ్రేమించితినా? — ఛీ! నీవు పిచ్చివాడవు! నే నల్పురాలను - ఆతఁడు మహాత్ము! నేను పాపాత్మురాలను - ఆతఁడు పుణ్యాత్ముఁడు! నేను క్రూరభుజంగినిని - ఆతఁడు దేవతామూర్తి! నేనా యాతనిఁ బ్రేమించుట? స్వర్గమునందలి యప్సరస్సుందరు లాతని బ్రేమించుట కర్హులై యుందురేమో? ఎంత దుష్కృత్యము గావించి తిని! నావానిగాఁ జేసికొనుటకై యాతనిపాదములపై వ్రాలి యెంత కన్నీరు విడిచితిని! ఎంత నిర్బంధించినను నాతఁడు నావాఁడు గాలేదు. అగుట యెట్లు! ఆతఁడు మహాత్ము! ఆతఁడు పావనమూర్తి. నేను నాచేతు లార నాతని జంపుకొంటిని — కానియీనా కళంకవ్యాపారము నెన్నఁడు నెవ్వరియొద్దను బ్రకటింపవలదు — ఘుణాక్షరన్యాయముగ నైన బహి రంగ పఱుపవలదు!"

డానేశుఁడు నిలువునఁ గూలఁబడిపోవుచు నించుకంతసత్యము గల్పించుకొని నిలిచి "యూధికా! నీవేనా?" అనియెను. అట్లు దానవీ మూర్తిం దాల్చియున్న యూధిక వికృత తీవ్రదృష్టితో డానేశుని మొగమువంక జూచుచు నట్టి యున్మత్త భీషణస్వరముతోనే "కాను! నేనుగాను. అంతయు నసత్యము చెప్పితిని. కాని యంతయు నెఱుఁ గుదును! కొంచె మాఁగుము! ఆలోచించు కొననిమ్ము! పాంచకడీని గూర్చి యొకసారి భావించుకొననిమ్ము! తరువాత నంతయుఁ దెలియఁ జేసెదను" అనియెను.

సరిగా నాసమయమందే రాజాసాహేబు గృహమందు కలకలము బయలు దేఱెను. అప్పుడొకమనుష్యుఁడు వగర్చుకొనుచు వచ్చి "డాక్టరు బాబూ! డాక్టరుబాబూ! మీరు శీఘ్రముగా రావలయును! మాయజమానురాలు గొంతున కురిపెట్టుకొన్నది. ఎంతసేపైనదో! చాలసేపై యుండును. ప్రాణములు పోయినట్లే తోఁచుచున్నది!" అని

చెప్పెను. దానేశుఁ డతి త్వరితముగ రాజాసాహేబు నింటికిఁ బోయి చూడఁగా నచ్చట నాలుగురండి పోలీసు ప్రహరాడి యుండిరి. శవకళే బరము క్రిందఁ బడి యుండెను. రక్షకభటుఁడు దానేశునిం గాంచి "బాబూ! ఈమె యురిపెట్టుకొని చచ్చినట్లేనా? ఎంత వింత! ఒక్క దినమునఁ నొక యింటిలోనే యువకుఁ డొకఁడును, యువతి యొకతెయు మృత్యుముఖమునఁ బతితులై పోయినారు. ఈ రెండు హత్యలకును బరస్పర సంబంధమున్నదని యనుమానముగ నున్నది!" అనియెను.

దానేశుఁ డాతనిమాటలు విని పరీక్షించి "బాహ్య లక్షణములం బట్టిచూడఁగా నురిపెట్టుకొని చచ్చినట్లే తోఁచుచున్నది. శవపరీక్షవలన నన్ని సంగతులును స్పష్టముగాఁ దెలియును" అని చెప్పెను. పోలీసులు శవమును బరీక్షకుఁ బంపించిరి. పాంచకడీ హత్యకును, నీమె యుద్బంధన మునకును బరస్పరసంబంధ ముండు నను నుద్దేశముతోనే రక్షకభటాధి కారు లనుసంధానము గావించుట కారంభించిరి.

రాజాసాహే బాకస్మికముగ మిగుల విపన్నుఁడై పోయెను. ఆతఁడు దానేశుని రామపురమునకుఁ బోనీయలేదు. ఆతఁడు దీనస్వర ముతో "డాక్టరు బాబూ! కొంచెమునే పాఁగుము. ఇది యంతయు నల్లకల్లోలముగా నున్నది. శవపరీక్షయై యా రిపోర్టును జూచిన తరు వాత నీవు పోవచ్చును. ఒకదాని వెనుక నొకటి! రెండుఖూనీలు! నా మనసంతయు గందరగోళముగా నున్నది" అని బ్రతిమాలుకొనెను. పోలీసు ఇన్‌స్పెక్టరచ్చటనే యుండెను. రాజా సాహేబు భయ భ్రాంతుఁడై యున్నట్లును, నాతని సర్వాంగకముల యందు నేదో యొక విపత్సంశయ ఘనచ్ఛాయ యావరించి యున్నట్లును నాతఁడు గ్రహింపఁగలిగెను. ఆతఁడు తనలో "ఈతని భార్యకును పాంచకడీకి నేదియో యధర్మగూఢసంబంధ ముండియుండును. దానికి ఫలముగా పాంచకడీ రాజాసాహేబుచేతనో, యాతని సహాయుని చేతనో నిహతుఁ

డై యుండును. ఆస్త్రీకూడ నిట్టే యురితీయఁగాఁ జచ్చి యుండును. కానిమ్ము! శవపరీక్ష జరిగినతరువాత నీ యుచిత విషయములను విచారింపవలయును" అని యనుమానించి నిశ్చయించుకొని వెడలిపోయెను. కాని యొకరిద్దఱు భటులను మాత్ర మాయింటికిఁ గాపుంచెను.

దానేశునిప్రాణము లతిదారుణముగఁ గొట్టుకొని పోవుచుండెను. కీలుబొమ్మవలె రాజాసాహేబుతో శవపరీక్షా పర్యవసానమును దెలిసికొనుటకై పోయెను. ఉరివలననే యామె మరణించినట్లు డాక్టరుఖానా యందు వారికిఁ దెలియవచ్చెను. దానేశుఁ డింక రాజాసాహేబుకడ సెలవుఁ గైకొని రామప్రాణబాబునింటికిఁ బోవుటకై రైలుస్టేషనునకుఁ బోయెను. అపరాహ్ణము నాలుగుగంటల కాతఁడు రైలెక్కెను. బండిలో నాతఁ డొక్కఁడే— "యాధిక యేమని చెప్పినది? పాంచకడీని దసపాప ప్రార్థనకు సమ్మతింపఁ జేయఁజాలక హత్యజేసినదా? ఛీ! ఛీ! ఎంతటి ఘోరకృత్యము! అట్లయినచో పావనహృదయుఁ డగు నాతమ్ముఁడు నింద్య చరితయగు నావేశ్యచే నిహతుఁ డయ్యె నన్నమాట! ఇంక నెందుకు? నేను నరాధముఁడను. సర్వమును మఱచి గణికామోహమున మునిఁగిపోయితిని. ఉస్! ఎంతసర్వనాశము గావించితిని! నా యపరాధమువలననే నా భార్య యగపడకుండఁ బోయినది! ఓహృదయమా! ఈ సకలవార్తలను వినుచుండియు నీ వింకను బగిలిపోకున్నా వేమి? శాంతి దేవీ! నే నధమాధముఁడను; అపవిత్రుఁడను; ఇంద్రియదాసుఁడను! నీవు హైందవకుల వధూరత్నమవు! నీ విట్టియకార్యము నేల చేసితివి? నీ వేల నీయిల్లు విడిచి పోయితివి? ఎందుకు నాయెడల నసహ్యించు కొంటివి? ఏల నాహృదయమునఁ దుపానలమును రగులుకొలుపఁ గడంగితివి?" ఇవియే యాతని భావవికారములు!

ఇంతలో రైలుబండి కామపురపు స్టేషనునకు వచ్చి యాఁగెను. అప్పటికి సంధ్యాకాలము గడచిపోయినది. కూలివాండ్ర కేకలచే దానే

శునకు బాహ్యస్మృతి కలిగెను. చంచలమును, భయభ్రాంతమును, దుఃఖితమును, విదీర్ణము నగుహృదయమును గుదురు పఱచుకొని దానే శుఁడు మెల్లమెల్లగా బండినుండి దిగెను. స్టేషనువెలుపల నాతనికొఱకు సవారి సిద్ధముగా నుండెను. దానిపై నధిరోహించి యాతఁడు వెడలి పోయెను. అక్కడనుండి కామపురమున కొక మైలుదూరముమాత్రమే యుండెను.

౬౫

రామప్రాణబాబు భాగ్యవంతుఁ డగు జమీందారుఁడు. గ్రామముల వలన నాతని కధికాదాయము వచ్చును. నగదుకూడ చాల నున్నది. అతఁ డాపల్లెగ్రామములలో మహారాజువలెఁ గీర్తింపఁ బడుచుండెను. అతఁ డున్న కామపురము చాల పెద్దపల్లె. అందు నాలుగు పుష్కరిణులు గలవు. వాని ప్రక్కనే యుద్యానము లుండెను. ఆతని పశుశాల, వస్తుభాండాగారము, దేవాలయము, విద్యాశాల మొదలగునవి గ్రామమునందు సగముభాగ మాక్రమించుకొని యున్నవి. రామప్రాణబాబు విద్యాధికుఁడును, ధర్మాత్ముఁడు నైయుండెను. ఆతని కొక కొడుకు, నిద్దఱు కూతుండ్రును గలరు. కుమారుఁడు హైకోర్టువకీలు. తనయ లిరువురును వివాహితలును సంతానవతులు నైయుండిరి. దానేశుఁడు సవారి దిగి దర్శనగృహమునఁ బ్రవేశించెను. అక్కడ రామప్రాణబాబు డాక్టరు కొఱకు కనుపెట్టుకొనియే యుండెను. ఆతని జూచినంతనే రామప్రాణుఁడు "మీరు రెండుగంటల బండిమీఁదనే వచ్చెదరనియాశించితిని. పనితొందరచే నట్లు రాఁజాలక పోయితి రనుకొందును! ఏమైన నేమి! ముందు రోగిని బరీక్షింపుడు! తరువాత మాటాడుకొందము" అని రామప్రాణబాబు లేచెను. ఒకసేవకుని లాంతరు పట్టుకొని ముందు నడువు మని యాజ్ఞాపించెను. ఆవెలుఁగున నాతఁడు

డాక్టరును వెంటబెట్టుకొని యంతఃపురాభిముఖుఁడై పోయెను. అప్పుడు దానేసుఁడు “రోగి కేమిజబ్బు? ఇదివఱకే వైద్యునిచేఁ జూపించినారా!” అని ప్రశ్నించెను.

రామ — రోగి కాఁడు, రోగిణి! — ఒక వైద్యుఁడు చూచెను.

దానే — ఏమి జబ్బు?

రామ — గొప్పజ్వరము - కడుపులో వేదన-

దానే — ఎవరు పరీక్షించినారు?

రామ — నేటీవు వైద్యుఁడు!

దానే — రోగమును కాతఁ డెట్టి నామనిర్దేశము గావించెను?

రామ — మొట్టమొదట నాతఁడు న్యుమోనియా యని నిర్ణయించెను. నిన్నసాయంకాల మాతఁడు రోగము నాకుఁ బట్టుపడుట లేదని చెప్పివైచెను. అందుచేతనే మిమ్ముఁ బిలిపించితిని.

దానే — సాధారణముగా జ్వర మెట్లు వచ్చుచుండును?

రామ — దిన మంతయు జ్వరతాపమే — తఱచుగా నూటకొకటి యారుపాయింట్లవరకును వచ్చుచుండును. సాయంకాలము మాత్రము కొంచెముగా దగ్గుచుండును. రాత్రి పండ్రెండుగంటలకు నూఱుడిగ్రీలకు దిగును. కడుపులోనివేదన జ్వరము హెచ్చునప్పు డంతగా నుండదు. తగ్గుచున్నప్పుడు తాపము హెచ్చుచుండును.

దానే — ఆమెకు స్మృతి యుండునా!

రామ — జ్వరసమయమున నుండదు. తగ్గిన సమయమునఁ బిలిచిన చోఁ బలుకును.

ఇట్లు వారు సంభాషించుకొనుచు లోనికిఁ బోయిరి. ఒక సుపరిష్కృత మగుగదిలో రోగిణి శయనించి యుండెను. ఇరువురు నాగదిలో బ్రవేశించిరి. రోగిణియొద్ద రామప్రాణబాబు భార్య స్వయముగాఁ గూర్చుండి యుండెను. ఆమెతో నింకను నిద్దఱుముగ్గురు స్త్రీలుగూడ

నుండిరి. డాక్టరుగారును, రామప్రాణబాబును, నటకు వచ్చుటం గాంచి స్త్రీలందఱును నప్పటికిని గదిలోనికిం బోయి వైద్యుం డేమి చెప్పునో విన వలయు నని యుత్కంఠితలై యుండిరి. రోగిని సర్వాంగకములును శుభ్రవస్త్రాచ్ఛాదితము లై యుండెను. గదిలో గాజుదీపము వెలుగుచు నుండెను. శయ్యాసమీపమునకుం జని రామప్రాణబాబు "అమ్మా! తెలివి వచ్చినదా?" అని ప్రశ్నించెను. ప్రత్యుత్తరము లేదు. అప్పు డాతఁడు స్త్రీలున్న గదివైపు మరలి "నేఁటికిని నీమెకుఁ దెలివి రాలేదా?" అనియెను. రామప్రాణునిభార్య యొండొకస్త్రీ నవలంబనముగాఁ జేసికొని మృదుస్వరముతో "సాయంకాలమునకుఁ దరువాత స్మృతివచ్చినది. అప్పుడు మందు తీసికొని, పథ్యమును భుజించి పండుకొన్నది. ఇప్పుడు నిద్రించుచున్నది కాఁబోలును!" అనెను.

దానే — అట్లయినచో మీరాలో నెవరైన రోగిణివద్దకు వచ్చి కూర్చుండుఁడు! నేను నాడీపరీక్షయు, హృదయ పరీక్షయుఁ గావింప వలయును.

అప్పు డొకవిధవ యగు ప్రౌఢాంగన వచ్చి రోగిణిమొద్దఁ గూర్చుం డెను. దానేశుఁడు పరీక్షార్థమై మంచమునొద్దకుఁ బోయి యామె మొగము మీఁది ముసుఁగు నించుక యోసరించెను. ఆ యుజ్జ్వల దీపకాంతిలో సాంధ్య కమలమువలె వ్యాధివిషాదక్లిష్టమై వాఁడియున్న యామె మొగముం గాంచి దానేశుఁడు త్రుళ్ళిపడిపోయెను. ఆతనికన్నులు తిరిగి మూర్ఛ వచ్చునట్లుండెను కాని యెట్లో కుదురు పఱచు కొనియెను. అప్పు డాప్రౌఢయువతి రోగిణి నుద్దేశించి "అమ్మా! నీ కింకను మెలఁకువ రాలేదా?" అని ప్రశ్నించెను. రోగిణి నిజముగా నిద్రించుచునే యున్నది. ఆమెమాటలను విని యించుక కన్నులు తెఱచెను. ఆవెంటనే యామెకు సాక్షాత్కరించిన వా రెవ్వరు? ఎట్టయెదుటఁ దన జన్మజన్మాం తరములయందుఁ గూడఁ బరమభక్తితో నారాధింపఁదగిన పావనదివ్య

విగ్రహము! ఎన్నిరోజులా దినములనుండి నిశ్చల చిత్తముతో ధ్యానించుకొనుచున్న దేవతామూర్తి! హా శోకసంక్షోభము! ఏమిది? అలీక సుస్వప్నమునందలి యూహాప్రపంచమా? — కాక స్వాభావసిద్ధమగు సశరీరజీవన్మూర్తియా? — అనాటిశాంతి యెవ్వరనుకొనుచున్నారు? పాఠక మిత్రులారా! ఆమె మన శాంతిదేవి!

దానేశుఁడు రామప్రాణునిఁ గాంచి "మహాశయా! కొంచెమునే పోగవలయును. నాతల యతిభయంకరముగఁ దిరిగిపోవుచున్నది. ఇప్పుడు నేను రోగపరీక్ష చేయఁజాలను" అనియెను. శాంతిదేవి బలవంతముగ లేచి కూర్చుండుటకుఁ బ్రయత్నించెను గాని శక్తి చాలకపోయెను. ఒత్తిగిలి పడిపోయెను. చూచిన వారందఱును హాహాకారములు గావించిరి. శాంతిదేవి యున్మాదినివలె హీనదీనస్వరముతో "నాకడసారి యాశ తీరినది. నాయవసానవాంఛ పరిపూర్ణమైనది. ఇఁక సుఖముగా మరణింపఁ గలను. ఇంకొకసారి దర్శింపనిండు! నేనింకను గనులార, మనసార వీక్షింపనేలేదు!" అనియెను.

ఆమెరోగము హెచ్చిపోవుచున్నదనియు, నందుచేతనే పరాకు మాటలాడుచున్నదనియు నందఱును భయపడిరి. సన్నిపాతవికారము చేతనే యట్లు లేచిపడుచున్నదని వారు భావించిరి. కాని సంసార రసాభిజ్ఞుఁడగు రామప్రాణబాబు మాత్రము తనలో "పరమేశ్వరుని లీలామందిర మగునీజగంబునం దెచ్చటెచ్చట నెట్టి లీలాసంఘటనము లగుచుండునో యెవ్వరెఱుంగఁజాలుదురు? ఈ యువతీ యువకుల నడుమ నేదియో యొక నిగూఢసంబంధముండుటచేతనే యిరువురి యందు నిట్టి మనోవైకల్యము సంభవించినది!" అని యాతఁడు నిశ్చయించుకొనెను. డాక్టరుబాబు క్షణమునందే గది వెలుపలి వరాండాలోనికిఁ బోయెను.

రామప్రాణుఁ డాతనిం బిలిచి "బాబూ! లోపలికి రమ్ము! ఈమె

యవస్థ యంత బాగుగ లేదు. మందిచ్చుట కాలస్యము చేయుట యుచి
తము గాదు" అనియెను. కాని డాక్టరుబాబు లోపలికి రాఁజాలక
పోయెను. ఆతఁ డుద్వేలిత విక్షుబ్ధ చంచల ప్రతప్త హృదయమును రెండు
చేతుల తోడను బిగియఁ బట్టుకొని దర్శనగృహమునకు వెడలిపోయెను.

౬౬

కొంతసే పైనతరువాత డాక్టరుబాబు రోగిణి గదిలోనికిఁ బోయి
యామెను బరీక్ష చేసి వచ్చి మరల దర్శనగృహమునఁ బ్రవేశించెను.
అచ్చట రామప్రాణునకును దానేశునకు నీక్రింది విధముగా సంభాషణ
జరిగెను.

రామ — ఆమె యారోగ్యము చక్కఁబడువఱకును మీరిటనుండి
కదలఁ గూడదు.

దానే — నేనిచటఁ జాలసేపుండుట కవకాశము లేదు. కల
కత్తాయందు నేనొక కఠినరోగికి వైద్యము చేయుచున్నాను. నేఁడే
నేనచ్చటికిఁ బోవలసియున్నది! ఏమియు భయపడవలదు. ఆమె
త్వరగనే యారోగ్యము నందఁగలదు! నీళ్ళలో మునిఁగి చాలనీటిని
ద్రాగివైచినది. అందు కొంత బయటికి వచ్చినది. కాని యింకను
గొంత ఫుప్పుసమునందు నిలిచి యున్నది. ఆనుషంగికముగ గొప్ప
జ్వరము వచ్చుచుండుటచే నింతటి నీరసము గలిగినది. నేను చెప్పి
నట్లే చేయుచుండుఁడు! దానివలన మంచిప్రయోజనము గలిగి క్రమ
ముగా రోగము శమింపఁగలదు.

రామ — డాక్టరుబాబూ! నిజము చెప్పెదవా? ఆరోగిణి నీకేమి
యగును?

దానే — (అదరిపడి) నాకా? నాకు నామెకు నేమి సంబంధము!
లేదు — ఆఁ!

రామ — నిజముగా లేదా? ఆమె నీభార్యయై యుండు నని తోఁచు చున్నది.

దానే — నాభార్యయా? మీకెక్కడ లభించినది?

రామ — చెప్పెదను వినుము! నేను నాజహాంగీరు గ్రామములకు బోయి చూచుకొని యింటికి వచ్చుచుండఁగా నాకస్మికముగా నొక మానవుఁడు నదీజలములలోఁ బడినచప్పుడు వినవచ్చెను. నేను పడవను మరలించి యాశబ్దము వినఁబడిన దిక్కునకు వెనకఁ జని పడవవాండ్ర కాజ్ఞాపించితిని. అయిదాఱు నిమిషములకు వారు కేవలము మృతప్రాయ యై యున్న యామెను బడవలోఁ బడవైచిరి. ఎంతయో ప్రయత్నము మీఁద నెన్నియో యుపచారములు చేసినమీఁదట మూర్ఛితయై యున్న యామె శరీరమునం దించుక ప్రాణచైతన్యము గలిగెను. తరువాత నేనామెను నాబిడ్డగా భావించి మాయింటికిఁ దీసికొని వచ్చితిని. ఆ యమ్మ యప్పటి నుండియు స్మృతి తప్పియే పడియుండెను. ఆమెవిషయమున నింతవఱ కేమి యడుగుటకు నవకాశము గలుగలేదు. కాని యామె జ్వరతాపము నందును, వ్యాధి వేదనానుభవమునందును బ్రలాపించు పరాకుమాటలను వినుటం బట్టి యామె నిష్కల్మష చరిత్ర యనియు, విషమసాంసారికవిషజ్వాలలచే దగ్ధురా లగుచున్న దనియును గ్రహింపఁగలిగితిని.

దానేశుని కన్నులనుండి నిప్పులు గురియుచుండెను. ఆతని హృదయాంతరమున సహస్ర సహస్ర వృశ్చిక దంశనజ్వాలలు ఎగసిపడుచున్నట్లు బాధానుభవ మగుచుండెను. ఆతఁడు దృఢ స్వరముతో "లేదు! ఆమెకు నాకు నెట్టిసంబంధమును లేదు" అనెను.

ఇంతలో నొకదాసి యచటికి వచ్చి రామప్రాణబాబుం గాంచి "బాబూ! మీరొకసారి లోనికి రావలయును!" అని మనవిచేసెను. అప్పుడు రామప్రాణుఁడు దానేశునిం గాంచి "బాబూ! మీరు

కొంచెమునకై పోకుఁడు! నే నిప్పుడేవచ్చి మీరు రైలునకుఁ బోవుట కేర్పాటు చేసెదను" అని చెప్పి లోపలికిఁ బోయెను.

అప్పుడు రోగిణిమంచముకడ నిలువఁబడి రామప్రాణునిభార్య మందహాసము చేయుచుఁ దనకర కమలములతో రోగిణి లలాటము నందలి ముంగురులను సవరించుచుండెను. రామప్రాణుఁ డచ్చటికిఁ బోయి "ఏమునకై పిలిపించితివి? నీవేమో కొంచెము సంతోషముగ నున్నట్లున్నావే! ఈమె కించుక యారోగ్యము కలిగిన దనుకొందును! ఏమి యెట్లున్నది?" అనెను.

గృహిణి — చాల బాగుగా నున్నది. డాక్టరుబాబు మం దెంతపని చేసినదో యాతని దర్శనము కూడ నంతపని చేసినది! ఈ యమ్మాయి యెవ్వరో యెఱుంగుదురా?

రామ — నా కెట్లు తెలియును?

గృహి — ఈమె మా యక్కయ్యకూతురు! శాంతి!

రామ — ఏ యక్కకూతురు?

గృహి — నా కెందఱక్క లున్నారు - మేమిరువురమే యక్క చెల్లెండ్రము!

రామ — అట్లయినచో నీమెతల్లి సాగరమణియా?

గృహి — మాతల్లికి మగబిడ్డలు లేరు. మేమిరువురమే యాఁడుబిడ్డలము. శంభునగరమునందు మాయక్కకు బెండ్లియయ్యెను. ఆమె మగఁడు చిన్నతనమునందే మరణించెను. అప్పటి కామె కీయొక్క యాఁడుపిల్లయే జనించినది. అక్కకూడఁ గొన్నాళ్ళకు మరణించినది. ఈశాంతియే యామెకూఁతురు. నేను దీనిపేరుమాత్రమే విని యుంటిని. కన్నులతో నింతవఱ కెన్నఁడును జూడనేలేదు. మీయనుగ్రహముచేఁ దనయను, జామాతనుగూడ నిన్నాళ్ళకుఁ జూడఁగంటిని. ఒక్కసారి గానే యామె నా కూఁతు రనియు, డాక్టరుబాబు నాయల్లుఁ డనియు

దెలిసికొను నదృష్టముఁగలిగినది.

రామ — శాంతికి బాగుగఁ దెలివివచ్చినదా?

గృహి — ఆఁ! నే నీమెసంగతి యంతయు నడిగితిని. శంభునగరము మా పుట్టినయూ రనియు, శోణపురము మాయత్తవారియూ రనియుఁ జెప్పినది. నేను శాంతిని గాని, జామాతను గాని మొన్నటివరకును జూడకపోయినను నల్లునినామమును, నాతని గ్రామమునుగూడఁ దెలిసికొంటిని. నేను మందభాగ్యురాలను! మాపుట్టినింటివా రెవ్వరును లేరు. ఉన్న మామొకయక్కయైనను లేదు. ఇఁకనీ యల్లుని నూఁతఁడిని నాదరించువా రెవ్వరున్నారు?

రామ — శాంతి యేటిలోఁ బడిపోవుటకుఁ గారణ మేమైనా యడిగితివా? ఏయూరిచెంత నీమె పడిపోయినదో యాగ్రామముపేరు గంగారామపుర మని తెలిసికొంటిని. ఈమె యాగ్రామమునకు నెందుకు వచ్చినది?

శాంతి యప్పుడు కొంచె మొత్తిగిలి లేవఁబోవుచుండెను. రామప్రాణుని ప్రశ్నకు బదులు చెప్పవలెనని కాఁబోలును. కాని గృహిణి యామెను లేవనీయలేదు. ఆమె మెల్లగా "అమ్మా! ఇప్పుడు నీవు విశేషించి మాటాడినచో నిబ్బంది కలుగును. అన్ని సంగతులును రేపుచెప్ప వచ్చును లెమ్మా!" అనియెను. శాంతి యిఁక లేవనులేదు. ఏమియు మాటాడను లేదు. రామప్రాణుఁ డచటనే కొంతసేపు గూర్చుండి యేమేమో యాలోచించుకొని "చాల నానందమైనది! కాని—"

అనుచుండఁగనే యతనిభార్య మిగుల నుత్కంఠితయై "కాని—" అనుచున్నా రేమి?" అని ప్రశ్నించెను.

రామ — డాక్టరుబాబు హృదయమున నేదియో యుష్ణచ్ఛాయ యావరించుకొన్నది — సంశయకళంక మంకితమై యున్నది. కాని మనబిడ్డ శాంతిమాత్రము నిష్కళంకచరిత్రయనియే నావిశ్వాసము.

ఈ కారణముచే నవమాసములు జరుపవ మెళ్ళరుఁ డిక్రీసంఘటనమును చేసార్పి దుంపెనిలో యీకారణముచేతనే యిది శుభఫలదాయకమై శ్రీ న. దీపావళికి ఫలము లేదు.

రామప్రాణబాబు గృహిణికి యేమో చెప్పఁబోవుచుండెను. కాని చెప్పలేదు. ఇంతలోనే రామప్రాణబా బటనుండి వెడలిపోయెను. అతఁడు స్పష్టముగానైనను గావలసినంత దేహదార్ఢ్యము గలవాఁడు. అందు చేతనె తొందరగ నతికొంతసేపటికి పర్ణసగృహమునకుఁ బోయెను. దానేశుఁ డటఁ గూర్చుండి యేమేమో యాలోచించు కొనుచుండెను. అతని విచారమునకుఁ బారము లేదు. ఒకవంక భ్రాతృశోకము — మఱియొక వంకఁ గలుగఁబోవు నిష్ఫలప్రణయమువలని తీవ్రవేదన — ఇంకొకవంక నర్ధాంగియగు శాంతిదేవి సందిగ్ధచరిత్రము — ఈమూఁడును త్రేతాగ్ను లంబోలి యాతనిహృదయము నుడికించి వైచుచుండెను. అప్పుడాతఁడు తనలో “శాంతీ నీవేల చావలేదు? మరల నిన్నుఁ జూచుట తటస్థించిన దేమి! పాంచకడీ మరణించెను. నీవు మరణింపలే దేమి! అట్లయినచో నేనును సుఖముగా మరణింపఁ గలుగుదునే! శాంతీ! నిక్కముగా నీవు కళంకితవేనా? కావు! కావు! నాశాంతి యెన్నఁటికి నపవిత్రురాలు కాఁజాలదు? నే నపవిత్రుఁడను — శాంతి పవిత్ర — సతీరత్నము — సాధ్వీశిరోరత్నము! కాని — కాని, యామె యిల్లువదలి యెందుకు పోయినది? ఇంటియం దామె కెట్టిదుఃఖము సంభవించినది?” అని యనేకవిధముల భావించుకొనుచుండెను. సరిగ నా సమయముననే రామప్రాణబాబు నవ్వుచు నవ్వుచు నటకు విచ్చేసెను.

దానేశుఁ డాతనిఁగాంచి త్రుళ్ళిపడియెను. అతఁ డప్పుడు తనగడియార మును జూచికొని “బాబూ! వేళ యైనది. రైలునకుఁ బోవలయును. ఆలస్య మైనచో రైలు దొరకదు!” అనియెను. రామప్రాణబాబు నిశ్చలస్వరముతో “ఈరాత్రి నీప్రయాణము సాగదు” అనియెను.

"నీప్రయాణము!" రామప్రాణబా బెంతవృద్ధుఁడైనను, నెంతటి భాగ్యవంతుఁడగు జమీందారుఁ డైనను దానేశునుద్దేశించి యెన్నఁడును "నీవు — నీయొక్క" అనుమాటల నుపయోగింపలేదు. ఆకస్మికముగా నిట్లు పలుకుటకుఁ గారణ మేమి? దానేశుఁ డించుక విరక్తస్వరముతో "అట్లుకాదు మహాశయా! నేను తప్పక పోయి తీరవలయును" అనియెను.

రామప్రాణబాబు నవ్వుచు "నాభార్య నీకు సెలవిచ్చుట లేదు. నేనేమిచేయుదును బాబూ! నీవామె యొద్దకే పొమ్ము! ఆమెపట్టు వదల్చి కొనఁగలవేమో! పోయి యడుగుము. ఇఁక నామాట కేమి!" అనియెను.

దానేశున కేమియు నామాటలు బోధపడక యూరక యాతని మొగమువంక జూచుచుండెను. అప్పుడు రామప్రాణుఁడు "ఇది యంత యును నీకు వింతగానున్నదా! అవును! వింతపడవలసినదే — నీకన్ని సంగతులును దెలియలేదు! ఏమైన నేమి? నీవింత వఱకు మాత్రము తెలిసికొనుము! నీవు మాయల్లుఁడవు! ఇప్పుడే నేను నాగృహిణివలన నీయొక్కయు, నా తనయయొక్కయు, సంపూర్ణపరిచయమును దెలిసి కొనివచ్చితిని." అని గృహిణివలనఁ దెలియవచ్చినవిషయము లన్నియు నాతని కెఱుకపఱచెను.

దానే — ఔను మాయత్తవారికుటుంబమున నాకొక పిన్నత్తగారు మాత్ర మున్నదని నేనును వినియున్నాను. కాని యామె వృత్తాంత మేమో నాకిప్పటివఱకును దెలియలేదు.

రామ — (నవ్వుచు) మాకును నీపరిచయము గలుగలేదు. నిన్ను మేము కలకత్తాడాక్టరు వని మాత్రమే యెఱుఁగుదుము. ఏయూరివాఁ డవో, యెవ్వరివాఁడవో యన్నివిషయములను దెలిసికొనవలసినపని లేకపోయినది. రమ్ము! లోపలికిరమ్ము!

దానే — నన్ను క్షమింపవలయును. నేనీరైలునకుఁ బోవకతప్పదు!

నేను మీబిడ్డవంటివాఁడనుగదా! ఆజ్ఞయైనచో నెప్పుడైనను వచ్చెదను! కాని —

రామప్రాణుఁడు మాట కడ్డమువచ్చి "మనసునం దేమియును సంశయింపకుము. మాయమ్మాయి చరిత్రము నిష్కళంక మైనది. ఈవిషయము నేను ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను. కళంకిని యెన్నఁడును ప్రాణత్యాగము చేసికొనుటకుఁ బ్రయత్నింపదు. ఆమె నాపదవలో నజ్ఞానావస్థయందు బడియున్నప్పుడు కేవలము మనస్స్వామినే, హృదయనాథునే ప్రార్థించుట కారంభించినది. అట్టిసతీమణి యనుమానింపఁదగిన వ్యక్తి కాదు" అనియెను.

దానేశుఁడు దీర్ఘశ్వాసమును విడిచి "ఆమె యెట్టిదో తరువాత నాలోచింపవచ్చును. నేనిప్పు డొక భయంకర విపత్సముద్ర మధ్యమునఁ బడియున్నాను" అనియెను.

రామ — అది యెట్టి యాపద?

దానే — నాచిన్నతమ్ముఁడు నాయొద్దనే యుండెను. అతఁ డెప్పుడును మాడాక్టరుఖానాయందే శయనించుచుండును. నేఁడు తెల్లవాఱువేళ మాసేవకుఁ డటకుఁ బోయి తలుపుతెఱచి చూచెను. నాతమ్ముని నెవ్వరో చంపివైచిరి.

రామ — (అదరిపడి) ఏమనుచున్నావు? ఖూనీయా!

దానే — చిత్తము!

రామ — అయ్యో! చాలవిచారముగా నున్నది!

దానే — ఇంతవఱ కింకను బోలీసువారి హడావుడి తగ్గలేదు — అందుచేఁ దప్పక నేనింటికిఁ బోవలయును.

రామ — అట్లయినచో నేను నిన్నభ్యంతర పెట్టను. ఈసంగతి మీయత్తగారితోఁ జెప్పుట యెట్లు?

దానే — రహస్యముగా బిలిచి చెప్పుఁడు. శాంతికిమాత్రము

తెలియ నీయవలదు. దుఃఖముచే నామెరోగము మఱింత తీవ్రరోగము గాఁగలదు" అనియెను.

రామ — ఔను! అట్లే చేసెదను.

అని చెప్పి యాతఁడు కోశాధికారిని బిలిపించి "ఈతనికి ఫీజుక్రింద నూఱురూపాయ లిమ్ము! పల్లకిని సిద్ధము చేయింపుము!" అని యాజ్ఞాపించెను. ఆమాట విని దానేశుఁడు "రూపాయల నుండనిండు — ఎప్పుడైనను వచ్చి తీసికొందును!" అనియెను.

రామ — (మందహాసముతో) కూతురు పుట్టినింట నస్వస్థురాలై యున్నప్పుడు — అల్లుఁడైనను డాక్టరుఫీజు తీసికొనుచుండు నాచారము కలకత్తాయం దున్నడాక్టరులలో జిరకాలమునుండి యుండనే యున్నది.

దానేశుఁ డామాట కేమియు బదులు చెప్పక యొక్క-శుష్క-హాసము మాత్రము వెలువరించి రామప్రాణబాబునకుఁ బ్రణామము గావించి సవారిలో గూర్చుండెను. వాహకులు పల్లకిని రైలుస్టేషనునకు మోచికొనిపోయిరి.

## ౨౭

రామసేవకుని తల్లి దుర్గాంబయే యిప్పు డింటి యజమానురాలు. రామసేవకుఁడే యింటి కంతకును బెద్దయై యుండెను. గౌరాంగి మును పెట్లుండెనో యిప్పుడు నట్లే యున్నది. రమాదేవిమాత్రము పిచ్చిదై పోయినది. ఆమె చావనులేదు; బ్రదుకను లేదు. ఇప్పు డామె యెల్ల విషయములందును నిర్లిప్తయై నిరుద్దేశదృష్టులతో నొకచోటఁ బడి యుండి విచారించుచుండును. ఒకప్పు డామెనయనములు శుష్కములై నిప్పులు చెరగుచుండును. ఒకప్పుడు సిక్తములై కన్నీరు విడుచుచు నుండును. దాసి యామెను స్నానము చేయించినచో జేయును; లేకున్న మానును. వంటపను లన్నియు నిప్పుడు దుర్గాంబ చేతులందే యున్నవి.

ఆమె యనుగ్రహామును బట్టి, యభిరుచినిబట్టి యేదినమున కాదినమే దాసి బతిమాలగా రమాదేవి భోజనము చేయుచుండును. కాని యన్నపానములం దామెకు స్పృహయేలేదు.

ఆనాఁడు పదిగంటలవేళ దుర్గాంబ వంట చేయుచుండెను. రామ సేవకుఁడు గోడకుఁ జేరఁబడి కూర్చుండి యామెతో మాటాడుచుండెను. వంట చేయుచున్న యామె కుమారునిమాటలవలన నాతని వర్తమాన గౌరవాధిక్యమును గ్రహించి పులకిత సర్వావయవ యగుచు నడుమ నడుమ నానందసూచకముగా బ్రత్యుత్తరము లిచ్చుచుండెను. అప్పుడు రామసేవకుఁడు మాటల వెంబడిని "అమ్మా! ఎవనికి దినములు మంచి విగా మాఱునో యాతఁడట్లే గొప్పవాఁ డగుచుండును" అనియెను. దుర్గాంబ యానందముతో "బాబూ! నీవు నాకుఁ బరమేశ్వరుఁ డిచ్చిన దివ్యధనమవు! నీమూలమున వంశము వర్ధిల్లగా జూడవలయు నని నేనింతవఱకును బ్రదికి యుంటిని. సర్వసౌభాగ్యసంపన్నుఁడ వగు నీచేతులలో మరణింప వలయునని యాసించుచున్నాను!" అనియెను.

రామ — అమ్మా! నేనసత్యము చెప్పుటలేదు. ఈకొలఁది దినముల లోనే యీగ్రామమునందు వైద్యమువలన నాకెంత ప్రఖ్యాతి గలిగిన దనుకొన్నావు! ఒక్కనెలలో నేను నాలుగైదు రూపాయల సొమ్ము సంపాదింపఁగలిగితిని. ఈయూరికృషికు లందఱును నాశిష్యులే-అందఱును నేను చెప్పినట్లుచేయుదురు! ఇంకొకమాట యున్నది చెప్పనా?

దుర్గాం — అదేమిమాటయో చెప్పుము బాబూ!

రామ — బదరీనాథపురమునందు మిత్రవంశీయులపిల్ల యొకతె యున్నది. ఆమె దేవతాకాంతవలె నెంతో చక్కనిదఁట! ఆమెతండ్రి యెక్కడనో జడ్జీయట! ఆపిల్లను నాకీయవలె నని యున్నదఁట!

దుర్గాం — ఇంతకంటెను నానందము మరేమున్నది బాబూ! కాని నగలు, చీరలు, పెండ్లిఖర్చులు, వీనికి మనయొద్ద డబ్బెక్కడిది?

రే౯ను — సరిలేవమ్మా! అంతయు మన కెందు కమ్మా! ఆపిల్ల యొడలి నిండ బంగారమే — ఇంకను మనకుఁ గట్నముగా వేయిరూపాయ లిచ్చి వారే పెండ్లిచేయుదురు!

దుర్గాం — ఈశ్వరుఁడు వారి కట్టి మంచిబుద్ధి నిచ్చునుగాక! గొప్ప గాదు. కాని మనవంటి వంశము, నీవంటియల్లుఁడు నీగంగయివ్వాలి యొద్దునం దెక్కడ దొఱకును?

సరిగా నీ సమయమునకే ఆ గ్రామము నందలి చౌకీదారు తనయుఁ డుడుపులను దొడుగుకొని, పాగా తగిలించుకొని, లాఠీపట్టుకొని వచ్చి యింటిలోఁ బ్రవేశించి "రామసేవకమహాశయా! నిన్ను పోలీసు ఇన్‌స్పెక్టరుగారు పిలుచుచున్నారు!" అని కేకవైచెను. ఆకేక విని రామ సేవకునిగుండె గుభిల్లుమనియెను. ఆతఁడు డాబామీఁదినుండి దిగి వచ్చు నప్పటి కాతనితల్లియు నింటిలోనుండి బయటికి వచ్చి "రామా! చొక్కా తొడిగికొని మఱిపొమ్ము!" అనియెను. రామసేవకుఁడు విరక్తస్వరముతో "తొడిగికొనుట కిప్పు డవకాశములేదు!" అనియెను. దుర్గాంబ యడ్డము వచ్చి "బాబూ! కొంచె మాఁగుము. అద్దము దువ్వెనయు నిచ్చెదను. తల చింపిరిగా నున్నది. దువ్వికొని మఱి పొమ్ము! నీవంటి జుట్టు మఱి యెవ్వరికున్నది?" అనియెను.

చౌకీదారు నవ్వుచు "ఎందుకమ్మా! తలదువ్వుకొన్న నిప్పుడు వచ్చిన దేమి? ఇన్‌స్పెక్టరుగారు బైట నిలిచి యున్నారు. త్వరగా రావలయును" అనియెను.

రామసేవకుఁడు మెల్లమెల్లగా నడచుట కారంభించెను. చౌకీదారు త్వరగ నడువు మని యదలించెను. ఆయదల్పు దుర్గాంబకు మిగుల వ్యత్యస్తముగఁ దోఁచెను. చౌకీదారు రామసేవకుని దారోగా యెదు టికిఁ దీసికొనిపోయెను. ఇన్‌స్పెక్టరు రామసేవకునివంక వక్రకఠోర దృష్టిని బరగించుచు "నీపేరెవరు?" అని ప్రశ్నించెను.

రామ — (వడకుచు) రామసేవకుఁడు.

దారోగా యొక్క కనేస్టేబిలును బిలిచి "ఈతని చేతులకు సంకెలలు దగిలింపుము!" అని యాజ్ఞాపించెను. రక్షకభటుఁడు తనజేబులోనుండి యరదండాలను దీసి చౌకీదారుని బిలిచి "పట్టుకొనుము!" అనియెను. ఇరువురు నాతని చేతులు బిగియఁబట్టుకొనిరి. రక్షకభటుఁడు సంకెలలను దగిలించి యాతనిచెంపపై నొక చపేటాఘాతము గావించెను. అరెస్టయినట్టిచిహ్నమదియేకదా! ఆయవస్థఁగాంచి ద్వారమునొద్ద నున్న దుర్గాంబయు, రామసేవకుఁడు మిగుల దుఃఖించుచుండిరి. దూరమునందు వీధిలో నిలువఁబడి విష్ణుచంద్ర సర్కారు మందహాసము చేయుచుండెను. అప్పుడింకొకరక్షకభటుఁడు పోయి గ్రామములోని పెద్దలను బిలుచుకొని వచ్చెను. ఆవచ్చినవారిలో జగన్మఖోపాధ్యాయుఁడు విష్ణుచంద్రునిం గాంచి "ఈవ్యాపార మంతయు నేమి" అని ప్రశ్నించెను. విష్ణుచంద్రుఁడు నవ్వుచు "మఱేమియును లేదు. ఈయింటి చిన్నకోడ లగపడకుండ బోయినసంగతి వింటివి గదా! ఈనిర్భాగ్యుని మూలముననే యట్లుజరగియుండు నని నావిశ్వాసము! నేనెంతయో ప్రయత్నించితిని గాని వీఁడు నిజము చెప్పలేదు. అందుకే దారోగాబాబు నాశ్రయించి తీసికొని వచ్చితిని. మీరందఱు నిచ్చటనే యుండుఁడు! ఇప్పుడు సత్యము బయటఁ బడఁగలదు. మీరందఱును వినెదరు గాక!" అనియెను. "ఎంతకష్టపడి యెంత ప్రయత్నము చేసితివి!" అని జగన్మఖోపాధ్యాయుఁడు నవ్వెను. విష్ణుచంద్రుఁడు పెద్దమనుష్యులతోఁ గూడ నందఱిని చండీమండపమునకుఁ దీసికొనిపోయి ఇన్స్పెక్టరు నుద్దేశించి "దారోగాబాబూ! ఈపిల్లవాని నేల నిర్బంధించితివి? వీఁడు చాల గౌరవకుటుంబములోని వాఁడు!" అనియెను.

దారోగా ప్రత్యుత్తరము చెప్పకుండఁగనే రామసేవకుఁ డేడ్చుచు బిగ్గఱగా "నే నెట్టిగౌరవము గలవాఁడనో మీరందఱు నెఱుగుదురు

గదా! నన్నిట్లు నిర్బంధించు టెందుకు?" అనియెను. అప్పుడు దుర్గాంబ ద్వారము దాఁటి బయటికి వచ్చి "దారోగాబాబూ! నీకు నమస్కారము! వీనిని విడిచిపెట్టుము! వీఁడల్లరిపిల్లవాఁడు గాఁడు!" అనియెను.

దారా — మంచివాఁడా! మంచివాఁడైనచో ఖూనీ యెట్లు చేయఁ గలిగెను.

దుర్గాం — (భయకంపిత కంఠముతో) ఖూనీయా? మాపిల్లవాఁ డెవరిని జంపినాఁడు దారోగాబాబూ!

దారో — ఎవరినా? ఈయింటికోడలిని —

రామ — అయ్యో! అదేమి బాబూ! ఆమె యిల్లు విడిచి పోయి నది. నేనామె నెట్లుఁగా, నెందుకొఱకు హత్య చేయుదును?

దారో — నోరు మూయుము! ఉరికంబముపై నెక్కినప్పు డంతయు నిజము చెప్పుదువు గాని—

"అయ్యో! ఇదేమికర్మము బాబూ! మేమీయింటి కేల వచ్చితిమి బాబూ! నా బంగారుతండ్రివంటి కుమారరత్న మింకొకఁ డెవ్వఁడైన నున్నాఁడా?" అని కేకలు వైచుచు దుర్గాంబ యేడువఁ దొడంగెను. ఆమెతోఁ గలసి రామసేవకుఁడుకూడ నేడువనారంభించెను. విష్ణు చంద్రుఁడు దారోగాను జూచి "బాబూ! నిజముగా వీనికులగౌరవము మంచిదే — వీఁడు నిజముచెప్పినచో నురిశిక్ష కాకుండ క్షమించి విడిచి పెట్టెదరా?" అనియెను. దారోగా నవ్వుచు "నిజము చెప్పినచో నట్లే క్షమించెదను. కాని వీఁడు చాల తుంటరి. దొంగ! ఎన్నఁటికిని సత్యము చెప్పఁ డని నానమ్మకము!" అనియెను.

అప్పుడు దుర్గాంబ యేడ్చుచు "మావంశమం దెన్నఁడును దుంటరులు, దొంగలును జన్మించి యుండలేదు. ఆ లేచిపోయినదే తుంటరి! అదియే దొంగతనముగాఁ బోయినది! దానిమూలముననే

యింతి గందరగోళము పుట్టినది!" అనియెను.

విష్ణుచంద్రుఁ డామె నదలించుచు "నీవే నీ గోపాలకృష్ణు నిట్టి యవస్థకుఁ దీసికొనివచ్చితివి! నీ గారముచేతనే వీఁ డింతగా నధఃపతితుఁడైనాఁడు. ఇఁక నైన నిజము చెప్పనీయకున్నచో వీని కించుకంతయైన రక్షణము లభింపదు. నిజము చెప్పు మనుము! అప్పుడు దారోగా బాబు వీనిని విడుదల చేయును. వీని కన్ని సంగతులును దెలియును" అనియెను.

రామసేవకుఁ డేడ్చుచు "నేను చెప్పెదను! అంతయు సత్యముగ జెప్పెదను. ఆ తల్లి కెన్నఁడు నురిశిక్ష కాఁజాలదు! ఒకవిధముగా నాకే యురిశిక్ష కావలయును. ఆ తల్లివిషయమున నేనొక్క యసత్యమైన నెట్లు చెప్పుదును? నేను మహాభక్తుఁడను. ఈనాకంతమాల యానఁగా నిజము చెప్పెదను." అనెను.

దారో — చెప్పుము! నిజము చెప్పుము! ఆమె యెట నున్నది?

రామ — అయ్యో! నేను నిజము చెప్పుచుంటిని. ఆమె యెక్కడకుఁ బోయినదో నాకుఁ దెలియదు. కొందఱు మనుష్యులను బంపి వెదకించితిఁ గాని యామెపోఁబడి తెలియలేదు.

దారో — ఒక్క యక్షరముకూడ నసత్య మాడవలదు! అట్లు చెప్పిననే నీకు విడుదల యగును. సరే! ఆమె యెందు కిల్లు విడిచిపోయినది?

రామ — వినోదముకొఱకుఁ బరిహాసముగా నొకటి రెండు మాటలాడితిని. అందుచే నామె భయపడి యుండును.

దుర్గాంబ — బాబూ! మాఅబ్బాయికి తఱచుగా నవ్వులాటమాటలాడుచుండుట యలవాటు. అందఱి తోడను నట్లు హాస్యము లాడుట మంచిది కాదని వానికి బోధించుచూనే యుందును. అందఱును బరిహాసముగ భావింతురా? నాబిడ్డ నిజముగా నేమియు నెఱుఁగఁడు. చాల మరియాదగాఁ బ్రవర్తించుచుండును.

విష్ణుచంద్రుఁ డామె నదలించుచు "నీవు నోరుమూసి కొనియుండఁ జాలవా? కొడుకున కురిశిక్ష యగునంతవఱకు నూరకుండవు గాఁబోలును!" అనియెను. దుర్గాంబ యింక మాటాడలేదు. దారోగా మరల రామసేవకునిం గాంచి "హాస్యమునకే యనుకొందము! నీవామెతో హాస్యమున కేమంటివి?" అని ప్రశ్నించెను.

రామ — ఆమె నాతో నెన్నఁడును మాటాడుట లేదని యామెను మాటాడించుటకై యప్పుడప్పుడు నేను కొన్ని కొంటెపనులను జేయుచుంటిని.

దారో — అందువలన నామె యేమి చేయుచుండెడిది?

రామ — ఆమె పోయి మామేనత్తకు సర్వమును దెలుపుచుండెడిది. ఒక్కొక్కప్పు డామాటలు విని మామేనత్త నన్ను నదలించుచుండెడిది ఒకప్పుడు విని యూరకుండెడిది. అట్టిసమయములం దా శాంతిదేవి యేడ్చుచుండెడిది.

దారో — సరే. తరువాత!

రామ — ఆనాఁడు మిగుల నధికముగా దుఃఖించుచుండెను. అప్పుడు నేను "నీ సతీగౌరవ మంతయు నొక్కనిమిషములో వదలించి వైచెదను. ఈరాత్రి కొందఱు మనుష్యులు వచ్చి నిన్ను బలవంతముగాఁ నెక్కడకో తీసికొని పోఁగలరు! అప్పుడు నీకు దిక్కేమున్నది?" అని బెదరించితిని. ఆమె యెంత వెఱ్ఱిబాగులదో కాని నా కల్లబొల్లి మాటలకే భయపడి యారాత్రియే పాఱిపోయినది.

దారోగాబాబు విష్ణుచంద్రునివంకఁ జూచెను. విష్ణుచంద్రుఁడు క్రోధకర్కశస్వరముతో "ఓరీ! నీ వింతవఱకు నీ గ్రామమువారందఱి యెదుట నేమని చెప్పియుంటివో జ్ఞాపకమందున్నదా?" అని ప్రశ్నించెను. అప్పుడు దుర్గాంబ "అయ్యో! తండ్రీ! నీ వెంతటి పెద్దమనుష్యుఁడవయ్యా! లోకమం దెవ్వరైనఁ దమతప్పును దామే బయట బెట్టుకొనఁ

గలరా ? ఈ మాత్రము మీకుఁ దెలియదఁటయ్యా ! ఇంత పుట్టిముసుఁగు
నని మొట్టమొదట నెట్లు తెలిసెను ? ఇప్పు డురిత్రాడు గొంతునకుఁ
దగులుకొన్నది గానఁ జెప్పవలసివచ్చినది !" అనియెను.

ఈసారి దారోగా యామెను గట్టిగా నదలించి తిరస్కరించెను.
దుర్గాంబ వచ్చిన ట్లూరకుండెను. అప్పుడు రామసేవకుఁడు "నిజమే
బాబూ ! నేను నిజముగా నాతప్పు దాచుకొని యామె యొక యువ
కునితో లేచిపోయిన దని యందఱితోడను జెప్పితిని" అనియెను.

విష్ణు — ఆమాట యసత్యమేనా ?

రామ — ఔను.

విష్ణు — ఏమాట ?

రామ — నేను మొదట నందఱితోడను జెప్పినమాట —

విష్ణు — మొదటిమాట కల్ల యైనట్లును, నిప్పుడు చెప్పినది నిజ
మైనట్లును నిదర్శన మేమి ?

రామ — నిదర్శనము మామేనత్తయే — నే నారాత్రియాడిన తప్పు
మాటలను గుఱించి శాంతిదేవి యప్పుడే మామేనత్తకు జెప్పి దుఃఖపడి
నది. కాని మామేనత్త యెట్టిప్రతీకారమును గావింపక యూరకున్నది.
అందువలన నాకును కాంక్ష యధికమయ్యెను — తరువాత —

విష్ణు — మంచిది ! ఇఁకఁ జెప్పనక్కఱలేదు.

అని యాతఁ డొకపిల్లవానిని లోపలికిఁ బంపి దాసిని బిలుచుకొని
రమ్మనియెను. దాసి యా ద్వారమునొద్దనే యున్నది. ఆమె స్వయ
ముగనే యామాట విని యటకు వచ్చెను. విష్ణుచంద్రుఁ డామెం గాంచి,
"నీ విక్కడనే యుండి యంతయు వినుచుంటివి గదా ! ఈ రామ
సేవకుఁడు కడపటఁ జెప్పినమాట నిజమో కాదో గౌరాంగి నడిగి తెలిసి
కొని రమ్ము !" అని పంపించెను. దాసి వెడలిపోయెను. అందఱు
నామెరాక కెదురుచూచుచుండిరి. కొన్ని నిమిషములలోనే దాసి వచ్చి,

“పెద్దకోడలుగా రిట్లు చెప్పినారు: “ఈ సంగతియు నెఱుంగుదురు. శాంతిదేవియందెట్టి దోషమ్మయు లేదు. రామసేవకుఁ డెట్టి యత్యాచారము గావించునో యనుభయముచేతనే గృహత్యాగము గావించినది. నేను యుక్తసమయమున జాగ్రత్త పడకపోవుటచేతనే యిట్టి సర్వనాశనము తటస్థించినది” అని యామెమాటలను దాపి తెలియఁజేసెను.

అప్పుడు విష్ణుచంద్రుఁడు గ్రామస్థు లందఱిని జూచి “అయ్యా! మీరందరు నా సాధ్వీమణినామమును కళంకితము గావించితిరి. ఆమె జీవించియున్నను, లేక యమూల్యసర్వస్వ మగుసతీత్వమును గాపాడుకొనుటకై జీవితమును ద్యజించినను నామె నిశ్చయముగాఁ బతివ్రతా తిలకమే యని మీకుఁ దెలిసినదా? ఆమె సతీరత్నమే యని మీరందఱును వింటిరిగద! ఒకరాక్షసుని ఘోరకృత్యమునకు భయపడి యా పాపాత్ముని పాపకృత్యములకు గుఱి కాకుండ నాత్మరక్షణము చేసికొనుటకై యామె గృహత్యాగము చేసినది. అత్తగారికిఁ జెప్పినను, తోడికోడలికిఁ దెలియఁజేసినను బ్రయోజనము లేకపోయెను. భర్తకు నివేదించుకొనుట కవకాశమే లేదని మీకందఱకిని దెలియును. ఇఁక నాశ్రయము లేక, దిక్కు లేక హతభాగిని యగునామె మానభంగభయమున గత్యంతరము లేక యిల్లు విడిచి పాఱిపోయినది.” అని చెప్పెను. ఆ మాటలు విని యందఱికన్నులు నశ్రుపూర్ణము లైపోయెను. దారోగాబాబు నాజ్ఞచే నప్పుడు చౌకీదారు రామసేవకునిసంకెలలను వదలించి వైచెను. అందఱును రామసేవకుని పేరెత్తి నిందింప నారంభించిరి. రామసేవకుఁడు కన్నీటితోఁ జేతులయందలి సంకెలనొక్కులను జూచుకొనుచు, నుత్తరీయపుఁజెఱగుతోఁ గన్నీ రొత్తుకొనుచు లోపలికేఁగెను.

## ౬౧

ప్రాతఃకాల సూర్యకిరణములు మంచుతెరలను జించి చిందరవందర చేయుచుఁ జెట్లయాకులమీఁదను, మేడగోడలమీఁదను, వెదురుపొదల

కుసలను మిలమిల మెఱయుచుండెను. శీతలమందసమీరములు వీతెంచు చుండెను. పక్షిగణము ధరాతలమునఁ జేరి యాహారమును వెదకు కొనుచుండెను. అప్పు డాగ్రామమున రాయకుటుంబమునందలి శారద యనునొకయువతి శివమోహినియింటికి వచ్చి "శివూ! ఎక్కడ నున్నావు? నిన్నుఁ జూచి చాలదినము లైనది. రేపు నాకత్తవారింటికిఁ బ్రయాణము. కావున నిన్నొకసారి చూచి పోవలయు నని వచ్చితి!" ననియెను. శివమోహిని చటాలున లోపలినుండి వచ్చి "సోదరీ రమ్మా! ఎన్నాళ్ళ కగపడితివి! అత్తవారింటికిఁ బోయెదవా? రమణీమణులకుఁ బుణ్యతమ తీర్థస్వరూప మగు నత్తవారింటికిఁ బోయెదవా? ఎంతో పుణ్యముచే నిప్పుడు నీ దర్శనము లభించినది. అత్తవారింటి కేఁగు నీ దర్శనమే పుణ్యదర్శనము!" అనుచుండఁగా నామెకన్ను లశ్రుపూర్ణము లైపోయెను. ఇంతకు ముందే యామె మొగము శుష్కించి, కన్నులశ్రు భారాక్రాంతములై, ప్రాణములు తల్లడిల్లిపోవుచుండెను.

అప్పుడు శారద "శివమోహినీ! నీకు మరల నత్తవారయింటిపై నింతభక్తి గలిగిన దేమి? చిరకాలమునుండి నీ మాటయే యెత్తుట లేదె! ఏమి, నీ విప్పు డింతనీరసముగా నున్నావు?" అని ప్రశ్నించెను. శివమోహిని మృదుస్వరముతో "పద! లోపలికిఁ బద! చాలదినముల నుండి నిన్నుఁజూచుట లేదు. నా ప్రాణము లెంత తల్లడిల్లిపోవుచుండెనో నీకింతవఱకును వినుపింపలేదు. లోపలికి వచ్చినచోఁ గొంతవఱకు వినిపించెదను. పద!" అనియెను. ఆ మాటలు విని శారద మొగము కూడ సంచుక వాఁడిపోయెను. ఆమె జాలితో "పద సోదరీ! నీభావ మును గాంచిన నాకును భయ మగుచున్నది. ముఖ్యవిషయ మేమో స్పష్టముగాఁ జెప్పుము!" అనియెను. శివమోహిని తనచేతిలోని పని ముగించుకొని శారదను తనగదిలోనికి వెంటఁబెట్టుకొనిపోయెను.

శార — మీయక్క వచ్చినదఁట గాదా? సెలక్రిందటనే వచ్చినదని

విని యున్నాను. కాని యొకసారి వచ్చి చూడలేకపోయితిని.

శివ — ఔను. మాయక్క పురిటికి వచ్చినది. ఆమె గొప్ప యుద్యోగస్థుని యిల్లాలు — కూర్చుండి లేవలేదు! నేను మందభాగ్యురాలను. నామగఁడు పేదవాఁడు! అందుచేత నేను మాయక్కకు, ఆమె పిల్లలకుఁ జేయవలసిన యుపచారము లన్నియుఁ జేయవలసి వచ్చుచున్నది. ఏ మాత్రము లోపము గలిగినను నామెకుఁ గోపము! ఇఁక మాయమ్మ యెన్నివిధముల నవమానించునో, యెంతగా హేళన గావించునో చెప్పఁజాలను! శారదా! పతిపాదపీఠమునందే పడఁతుల సర్వసుఖ సౌభాగ్యములును, సర్వస్వాతంత్ర్యములును నాధారపడియుండె నని నేను మొట్టమొదటఁ దెలిసికొనఁ జాలకపోయితినే! తెల్లవాఱి లేచినది మొదలు రాత్రి పదిగంటలవఱకు విశ్రాంతి యనుమాటయే లేక చచ్చి పోవుచున్నాను. నేనేమైనఁ దింటినో, లేక పస్తుంటినో తెలిసికొని యాదరించి యడుగువా రింటిలో నొక్కరైనను లేరుగదా! నే నెంత నిర్భాగ్యురాలనో, ఎంతటి పాపాత్మురాలనో సోదరుఁడే యగుఁగాక, తల్లియే యగుఁగాక, సోదరియే యగుఁగాక- నానాథుఁడు నాయెడలఁ జూపించు నంతటి యాదరము, నంతటిప్రేమ, అంతటిదయ యితరు లెవ్వరును జూపింపఁ జాల రని నేనప్పుడు తెలిసికొనలేక పోయితినే! భర్తగౌరవమును బట్టియే భార్యకు గౌరవ మను సంగతి నాకప్పు డెంత మాత్రమును దెలియనేలేదు. అప్పుడు నాకు జబ్బు చేసినప్పు డెంతయో కష్టపడి యుపచారములు చేయుచుఁ జికిత్స చేయించెను. కాని నేను నిర్భాగ్యురాలను! అప్పు డాయన గౌరవమును గ్రహింప జాలకపోయితిని. అప్పుడు గొప్ప జ్వరము! పదిదినములు వేఁగిపోయితిని! ఉపవాసములు చేసితిని. కేవలమును బుడిసెడు మంచినీళ్ళు — ఇంత పంచదార — అవి యైనను సమయమునకు సరిగా లేవు! సోదరీ! నిజము చెప్పుచున్నాను — ఇఁక సహింపఁజాలను! ఇఁక మరల నా

కాయన దర్శనము లభించునా?'' అని చెప్పుచుండఁగా వాయుసంచాలితమగు వర్షాకుసుమ వల్లరినుండి జలబిందువులు పడినట్లుగా నామె కన్నుల నుండి యశ్రుబిందువులు జాలువారుచు నామె గండ భాగములను దడిపి వైచుచుండెను.

మరల నామె రుద్ధకంఠ స్వరముతో "వినుము శారదా! నేను నిర్భాగ్యురాలను! పాపాత్మురాలను! పాపజ్వాలలచే వేఁగిపోవుచున్నాను. నాయవస్థ మనస్సునం దుంచుకొనుము. ఆత్మేశ్వరుఁడును, అత్తవారిల్లును మాత్రమే రమణీమణుల కీ యిహలోకమునఁ బరమసుఖ సంపన్నిలయములని తెలిసికొనుము! స్వామి యందును, నాతఁడు చేయు పనులందును, నాతని యాజ్ఞల యందును, నాతని ప్రియవస్తువు లందును భక్తిశ్రద్ధలు గలిగి యుండుము! ప్రాణపణముగ నాతని యాజ్ఞలను నిర్వర్తించు చుండుము. అట్లు గావించినచో సకలవ్రత ఫలములును, సకల తీర్థఫలములును లభింపఁగలవు'' అనియెను. ఆ మాటలు విని శారదనేత్రాంతముల నుండియు నశ్రుబిందువులు వెలువడఁ దొడంగెను. ఆమె మృదుస్వరముతో "బావగారి వర్తమాన మేమియును దెలియుట లేదా?'' అని ప్రశ్నించెను.

శివ — లేదు. పరమేశ్వరుఁ డాయనకు దీర్ఘాయువు నిచ్చునుగాత! నన్నాయన ప్రాణముల కంటె నధికముగఁ బ్రేమించి యుండెను. కాని నేను మాత్రము దురదృష్ట వంతురాలను! నే నంతటి భాగ్యము ననుభవింపఁగలనా? ఆయన నేను చెప్పినవను లెల్లఁ గావించెను. నా సుఖము కొఱకు వాన యనక, యెండ యనక కష్టపడి సర్వవిధములఁ బ్రయత్నించెను. నామాట విని తల్లిని, సోదరులను, వదినెలను, స్వగృహమును గూడఁ ద్యజించి మాయింటికి వచ్చెను. నేను సుఖముగానుండు నను కారణమున నిట నుండి యెన్నియో యవమానములు, ఎన్నియో తిరస్కారములు, ఎన్నియో యీసడింపులు సహించి యూరకుండెను.

కాని నేను చేసినపని యేమి? ఆయన యెడల భక్తిశ్రద్ధలు చూపుట, సేవాశుశ్రూషలు గావించుట మాట యటుండ నిమ్ము! నేను చేసిన యపచారములను నీతోఁ జెప్పఁ జాలను శారదా! కాని యీ మాట మాత్రము చెప్పెదను. నేను గావించిన యపరాధములకుఁ దగిన శాస్త్రియే యీ యవమానమును, దుస్సహమగు నీ హృదయ జ్వాలయును — ఇఁక నా కాయనదర్శనము లభింపదు. ఇక నన్నాయన వలెఁ బ్రేమించి యాదరించువా రెవ్వరు నుండరు. ఆయనదర్శనము మాట కేమి? ఆయన యెచ్చట నైన సుఖముగా నున్నారనువార్త వినఁ గలిగినచో నేను సుఖ నయ్యెదను. అశ్రుపూర్ణ నయనములతో నాయన నన్ను విడిచి పోయెను. ఇంతవఱకు మరల రాలేదు. నిర్భాగ్యురాల నగు నే నట్టి సమయమునందుఁ గూడ నొక్క సాంత్వన వచన మైనఁ బలుకనైతిని.

శివమోహిని యిఁక మాట్లాడఁ జాలకపోయెను. ఆమె కంఠ స్వరము శోకరుద్ధ మైపోయెను. శారద సహానుభూతిని సూచించు స్వర ముతో "ఇట్టిస్థితిలో నీవత్తవారింటకే పొమ్ము! అచ్చటి కేఁగినచో నీకెంతయో శాంతి గలుగును" అనియెను. శివమోహిని గొంతు సవ రించుకొని "శారదా! నా పాపమువలననే యచ్చటి పండువంటి సంసా రము పాడైపోయినది. ఇప్పు డా యానందకానన మూషరక్షేత్ర ముగాఁ బరిణమించి పోయినది. నేనిప్పు డచ్చటికిఁ బోయి యేమి చేయుదును?" అనియెను.

శార — ఇంతగాఁ బరితపించిపోవు టెందుకు! పరమేశ్వరుని బ్రార్థిం పుము! దయామయుఁ డగునాతఁడే నిన్నుఁ గరుణించును. తప్పక బావగారు మరల నింటికి రాఁగలరు-నీవు పొమ్ము! అత్తవారింటికే పొమ్ము.

శివ — సోదరీ! శారదా! పరమేశ్వరుని బ్రార్థించుటకు నాకర్హత యెక్కడ నున్నదే! ఏ పాపాత్మురాలి కాత్మేశ్వరునియం దశ్రద్ధయు,

నభక్తియుఁ గలిగి యుండెనో, యే క్రూరురాలు నాథుని ననంత హృదయవేదనాజ్వాలలచేఁ బరితపింపఁజేయుటకు వెనుదీయలేదో, యామెకు భగవంతుని బ్రార్థించుట కధికార మెట్లున్నది? లేదు! నే నెట్టికర్మమును గావించితినో యట్టిఫలమునే యనుభవించుచున్నాను. ఇంతవఱకు ననుభవించితిని. ఇంకను నెట్టియనుభవము కలుగనున్నదో యేమని చెప్పఁగలను?

ఆసమయమున హరిచరణుఁ డొకచీటిని జేతఁబట్టుకొని నవ్వుచు లోపలఁ బ్రవేశించి తల్లిని, సోదరి శివమోహినిని బిలిచెను. వారు వచ్చినంతనే యింటిలోనివా రందఱు నచ్చటికిఁ జేరిరి. హరిచరణుఁ డట్లే నవ్వుచు వ్యంగ్యస్వరముతో "అమ్మా! అదృష్టచక్రము తిరిగిన దమ్మా! నీ చిన్నికొమరితను దీసికొనిపోవుటకై యామెయత్తగారు బండి పంపించినది! ఉత్తరము కూడ వ్రాయించినది!" అనియెను. హరిచరణునితల్లి చండిక యవజ్ఞాసూచకముగ నవ్వుచు "ఎంత యదృష్టము! మాననీయుఁ డగు నా పెద్దమనుష్యుఁడు స్వగృహమునకుఁ జేరుకొన్నాఁడా యేమి?" అనియెను.

హరి — లేదు. ఇదిగో! ఉత్తరము చదివెదను! వినుము:

అని హరిచరణుఁడు చదువుట నారంభించెను. ఆయుత్తరమునం దిట్లున్నది :— "బాబూ! హరిచరణా! నా దురదృష్టమును, నాదురవస్థయు నీవు వినియే యుందువు. దుర్గాంబయు, రామసేవకుఁడు నిట నుండి లేచిపోయినారు. దుర్గాంబయే యింతవఱకు నేదో యొకవిధముగా వంట చేసి పెట్టుచుండెను. ఇప్పు డొకపట్టెఁడన్నము వండి పెట్టువా రింట నొక్కరును లేరు. ఎన్నాళ్ళు బాధపడవలెనో, యెన్నాళ్ళు పాపఫల మనుభవింపవలెనో, యెన్నాళ్ళు బ్రదికి యుండవలెనో యన్నాళ్ళు నీ పాడుపొట్ట కింతపిండము పడవేయుచుండుట తప్పదు గదా! కాని యేమి చేయుదును? వండి పెట్టువా రెవ్వరు?

గౌరాంగి పుత్రశోకముచే మంచము పట్టియేయున్నది ! అందుచేతనే బండి నంపించితిని. శ్రీమతి శివమోహినిని దప్పక మాబండిపై( బంపవలయును ! దాసి నిస్తారిణినికూడ( దోడుగా నుండుటకు( బంపితిని. యతీశునివార్త తెలిసినది. ఆతడు బ్రదికియే యున్నాడు ! అంత మాత్రమే — క్షితీశ దానేశ పాంచకడీల వర్తమానమే తెలియుటలేదు. నేనిప్పు డెట్టియవస్థలో నుంటినో దీనినిబట్టియే మీరు గ్రహింపగలరు.

చిరాయురస్తు
రమాకేశః

అది విని చండిక గర్జించుచు “ ఏమది ! పంపవలయునా ! నాకూతురచ్చటికి( బోయి వంటపనులును, దాసీపనులును జేయుచుండునా ? దాసి లేదా ? దానిని బతిమాలుకొని, ముద్దుపెట్టుకొని, కొన్ని ములు నిచ్చి చేయించుకొనఁ గూడదా ? ఇన్నాళ్ళు కానిదో( జిన్న కోడలు కావలసివచ్చినదా ?” అని విసిగికొనెను.

శారద — దొడ్డమ్మా ! అట్లు కోపగించుకొనవలదు. పంపక యేమి చేయుదువు ? అత్తగారు పూజ్యురాలు ! కష్టసహాయమునందుఁ గోడలామె కుపచారము చేయనక్కఱలేదా ?

చండిక మఱింత యుచ్చైస్స్వరముతో “ సరిసరిలేవే ! పూజ్యురాలి నేనయూ ? ఇన్నాళ్ళు నది యెక్కడకుఁ బోయినది ? ఇప్పుడు నాపెద్ద కూతురు పురిటికి వచ్చినది. నేడో, రేపో ప్రసవించునట్లున్నది ! ఇట్టిస్థితిలో దీనిని నేనత్తవారింటికిఁ బంపుటా ? ఏమో దానియిష్టము ! పోయినచో నేను చేయవలసిన దేమున్నది ?” అనియెను.

అప్పుడు శివమోహిని వినమ్రదృఢస్వరముతో “ అమ్మా ! నేను పోయెదను !” అనియెను.

ఆ మాట విని తల్లి కోపముతో “ పోవలయును నని యున్నచోఁ

బొమ్మ్మ! కాని, బుడిబుడిదుఃఖములు తీయుచు మరలఁ బరుగెత్తుకొని యిచ్చటికి వచ్చుట కనకాశ యుండదు! బాగుగ నాలోచించుకొనుము! మరల నిచ్చట నీకాశ్రయము లభించు ననుట కల్ల! ఈమాటను మన మునం దుంచుకొని మఱిపొమ్మ్మ!" అనియెను. శివమోహిని యా మాటకు బదులు చెప్పలేదు. ఆమె తనమనస్సులోనే "అట్లే కానిమ్మ తల్లీ! అయింట — ఆ పవిత్రపుణ్యక్షేత్రమునందు నాకాశ్రయము లేకపోయి నచో నేయేటిలోనో, యేకాలిలోనో నాకు జిల్లనియాశ్రయము లభిం పకపోదు!" అని యనుకొనెను.

అంతలో నిస్తారిణి నవీనపుష్పహారిణితోఁ గాలుసేతులు గడిగికొని వచ్చెను. సాయంకాలము కావచ్చుచుండెను. అప్పుడు శారద "శివా! అట్లయినచో నీవు సత్తెనారెంటికిఁ బోయెదవా?" అని ప్రశ్నించెను. శివమోహిని యశ్రుపూర్ణనయనములతో నామెవంకఁ దిలకించి కను సన్నచేతనే "పోయెదను! అమ్మ యెంతయున్న చెప్పినను మానను!" అను భావమును సూచించెను.

## ౬౯

చిరప్రకాంక్షా వైఫల్యము చేతను, చిరప్రయత్నక్లేశ వైయర్థ్యముచేతను యూధిక హృదయమునఁ బొంగిపొరలుచున్న దుఃఖ వేదన పాంచకడీ హృదయరక్తపాతమువలన మఱింత యతిశయించి యొక్కసారిగాఁ దీవ్రమై, భీషణమై, దుస్సహమై ప్రకోపించెను. ఆమె యిన్నాళ్ళవఱకును నారకీయ విలోల లాలసత్వమును మద ద్రవ్య సేవనముచే మత్తిల్లి యుం డెను. ఆయున్మత్తతలో నామె స్వర్గీయము లగు ననేక పవిత్రవృత్తులను నిర్లక్ష్యముగ, నిర్విచారముగఁ జరణదళితములుగాఁ జేసివైచెను. తుట్టతుదకు పాంచకడీనిగూడఁ దన పొట్టను బెట్టుకొనియెను. కాని యాతని దానెంతగా ప్రేమించెనో యాసంగతిని గ్రహింపఁ జాలకపోయి

నది! పాంచకడీ లేక పోవుటచేఁ దన కిట్టి యున్మాదావస్థ తటస్థించు నని యూమె మొట్టమొదట దెలిసికొనఁజాలక పోయెను. తెలిసినచో నాతని హత్యకొఱ కింకొకటి కుతంత్రమును గావింపకయే యుండును. పాంచకడీ రక్తపాతములకుఁ జను హృదయజ్వాల చల్లారి పోవు నని యూమె యప్పుడనుకొనియెను. ప్రేమించుచు నుండు కానప్పుడు ప్రతిహింసానలజ్వాలను రగులుకొల్పుటనో లేచుచుఁ జరుగుచుండు నవలలలోని సంఘటనలను జనుప్రాటు కారణముగా నైన నామె యట్లు చేసి యుండును. ఆ ప్రతిహింసా జ్వాలలయందుఁ బడి పాంచకడీ భస్మమై పోవు ననియు, నిఁక నాతఁ డీలోకమునందు జాడ లేకుండ నశించుననియు నామె నిశ్చయించుకొనియెను. కాని యూమెయటనే దానును మండి బూడిద నైపోవలసి వచ్చునని యప్పుడామె యించుకంతయు నాలోచించుకొనలేదు. పాపమైనను మానవుని జీవనలీలను ముగముట్టింప వలయు నని మనసుపడి యూయుద్దేశము చేతనే హృదయమును రాయిగఁ జేసికొని విషదంశనము గావింపదు! పామునకుఁ గఱచునప్పు డట్టియాలోచన మేమియు నుండదు. కేవలము కోపము వచ్చినప్పు డది తన విసపుగోరలచే నొక్కసారి కఱచివైచి నిశ్చింతగాఁ దన దారిని బోవును. యూధిక పాపకృత్య మట్లు గాలేదు.

యూధిక యెంత మాత్రమును మనసు కుదుటపఱచుకొనఁ జాలకుండెను. స్నానము చేయు మని యూమెను సేవకుఁడు బతిమాలుకొనుచుండెను, భోజనము చేయు మని వంటవాఁడు పిలుచుచుండెను. కాని యూమె స్నానాహారములను గావింపలేదు. ఆమె కన్నులప్పు డూర్ధ్వదృష్టిలోఁ బడి యుండెను. ఆమె వస్త్ర లన్నియు నస్తవ్యస్తములై యుండెను. కుటిల కుంతలము లయత్నవిస్రస్తములై యుండెను. దానేశుఁడు వెడలిపోయిన తరువాత నామె సేవకునిం బిలిచి రాజా సాహెబు నింటి సమాచారమును దెలిసికొని రమ్మని పంపించెను.

ఆతఁడు పోయి వచ్చి రాజాసాహేబు భార్య యురి పెట్టుకొని మరణించిన దని చెప్పెను. అప్పుడు సంతాపోద్వేలితం బగు నామె హృదయము మఱింత యుచ్ఛ్వసిత మైపోయెను. మూఁడు జాముల కామె యొట్లో సేవకుఁడు బ్రతిమాలుటచేఁ గొంచె మన్నముదిని యిన్ని నీళ్లను మాత్రము ద్రాగెను. సాయంకాల మైనతరువాత నామె స్థిరముగా నుండఁజాలకపోయెను. అప్పు డామె సేవకుని బిలిచి "ఇన్‌స్పెక్టరింకను నిచ్చటనే యుండవచ్చును. నీవు పోయి నాకీ హత్యాసంగతులన్నియుఁ దెలియునని చెప్పి యాతని నిటకుఁ దీసికొని రమ్ము" అనిచెప్పి పంపించెను.

సమాచారము తెలిసినంతనే దారోగా యూధిక యున్నచోటికి వచ్చి యామెను దర్శించెను. ఆమె కేవలము నోడలు తెలియని యవస్థలో నున్నదని యాతఁడు గ్రహించి "ఈమెయే నిజముగా నీఖూనీ చేసి యుండును. కాకున్నచో నీహత్యాతంత్రమునందు సంబంధము కలిగియైన నుండును. ఇప్పుడు పశ్చాత్తాపపడుచు తనయపరాధమును నాయెదుట నంగీకరింపఁ దలఁచిన ట్లున్నది" అని యనుకొనెను. అప్పుడు యూధిక గంభీరవదనముతో, ననుద్విష్టస్వరముతో "ఇన్‌స్పెక్టరుబాబూ! ఇఁక పాంచకడీ లేనే లేఁడు. ఎంతప్రయత్నించినను మరల నాతనిఁ దీసికొని రాఁజాలము. కాని యాతని జంపిన దురాత్ముని బట్టి శిక్షించుటకుఁ బ్రయత్నింపవలయును. ఇదియే నా కోరిక!" అనియెను.

దారో — నా కోరికకూడ నదియే గాని, యేదో యొకసూత్రము లభింపనిదే హంతకునిఁ బట్టుకొనుట సాధ్యముగాదు.

యూధి — సూత్రము లభింప కేమి? ఆ హంతకుని నామపర్యంతేమును నేను చెప్పఁగలను.

దారో — తెలిసినచో జెప్పఁగూడదా! చెప్పినచో నాతని నిప్పుడే నిర్బంధించి తీసికొని పోయెదను! ఎవ రాతఁడు?

యూధి — రాజాసాహేబు!

దారో — ఈయింటి మార్వాడీయా?

యూధి — ఔను!

దారో — ఆతఁడు స్వయముగనే హత్య చేసెనా?

యూధి — స్వయముగనే చేసెనో, కాక యితరులచేఁ జేయించెనో యాతని నిర్బంధించి యడిగినచో నంతయుఁ బయటఁ బడును.

దారో — అలాగా? ఈ విషయమున నీకుఁ దెలిసినంతవఱకు జరిగిన సంగతులను జెప్పుము!

యూధి — రాజాసాహెబుభార్యకును, పాంచకడీకిని ప్రేమసంబంధమున్నది. అది తెలిసికొని రాజాసాహెబు పాంచకడీని హత్య గావించెను. మఱియుఁ దనభార్యను జిదుకఁ గొట్టుటచే నామె యవమానమును భరింపఁ జాలక క్రోధక్షోభములచే నాత్మహత్య గావించుకొనెను.

దారో — నేనుఁగూడ నట్లే యనుమానించుచుంటిని. కాని నిదర్శనము లేవియు దొరకకుండ నరెస్టు చేయుటకుఁ గాని, న్యాయస్థానమున రుజువు చేయుటకుఁ గాని యవకాశము లేదు.

యూధి — నిదర్శనములా? కావలసినన్ని యున్నవి.

దారో — ఏమి యేమీ! చెప్పుము!

అప్పుడు యూధిక ఇన్‌స్పెక్టరున కనేకవిషయములను దెలియఁజేసెను. యూధిక హృదయమునందుఁ బ్రజ్వరిల్లుచున్న దారుణనరకవహ్ని యెట్లును జల్లారుట లేదు. ఈసమస్తానర్థ విషయములును గూడ నట్టి నరకానలమునందలి యుచ్ఛ్వాసములే. మానవహృదయక్షేత్రమునం దొకసారి పాపబీజ మంకురించినచో నది క్రమముగా మహావృక్షము గాక మానదు. యూధికమాట లన్నియును మనసునఁ బెట్టుకొని దారోగాబాబు "యూధికా! నేను నీవు చెప్పిన విషయముల ననుసరించి యనుసంధానము గావించుచుండెదను. దానిఫలితముంగూర్చి సమయము వచ్చినపుడు నీకెఱిఁగించెదను" అని చెప్పి యాతఁడు వెడలిపోయెను.

దానేశచంద్రుఁడు తెల్లవాఱుజామున కింటికి వచ్చెను. ఆ వెంటనే యాతఁడు యూథికపడకగదిలోనికిఁ బోయి చూచెను. యూథిక యప్పు డున్మత్తాకారముతో నొకసోఫాపైఁ బడి యుండెను. ఆమె యింతకు నిద్రమత్తులో నుండెను. కాని యది సుఖనిద్రమాత్రము గాదు. అప్పు డామె యనేకబాధాకరము లగుదుస్స్వప్నములం గాంచుచున్నట్లు దానేశుఁడు స్పష్టముగా గ్రహింపఁగలిగెను. ఆమె మొగము నల్ల బడిపోయెను. నాడులు, సిరలునుగూడ నస్వాభావికముగ స్ఫీతములును, గుంచితములును, వక్రములు నగుచుండెను. ఆమె దారుణ పాపచింతానలజ్వాలలు స్వప్నరూపమున విస్తరిల్లి యామెను దహించి వైచుచుండె నని దానేశుఁడు గ్రహించెను. ఆతఁ డొకసారి యామెను బిలిచెను. ఆవెంటనే యామె యదరిపడి మేల్కాంచి తత్తరముతో లేచి కూర్చుండి, నిర్లక్ష్యవిరూపదృష్టులఁ బరగించుచు దానేశునుద్దేశించి "నీవు పాంచకడీవి గావు! ఇట్టిచో నీ వెందు కిటకు వచ్చితివి! యూథి కాప్రేమను గైకొనుటకా? హాహ్హాహ్హా! ప్రేమయా? — వట్టిమాట! మీవంటివా రందఱు నింద్రియమహారణక్షేత్రమున దప్పులు ప్రయోగించు వారు మాత్రమే — మీరు ప్రేమపరమావధిని గ్రహింపఁజాలరు! జీవితసాఫల్యమను ధ్రువతారను లక్ష్యముగాఁ జేసికొని యెట్లు మరణింప వలయునో పాంచకడీ యొక్కఁడే యెఱుంగును. ఎఱుఁగును గావుననే యాతఁ డంతటి మహత్త్వముం గాంచఁగలిగెను. అంతటిపవిత్రుఁడు గాఁగలిగెను. నీవు నాయెదుటినుండి పొమ్ము! ఇఁక రాకుము! నా యుపాసనమునకు—నాధ్యానమునకు—నేల విఘ్నము గల్పింతు?" వనెను.

దానే — యూథికా! నీవు నిజముగనే పిచ్చిదాన వైపోయితివే!

యూథి — హాహ్హాహ్హా! పిచ్చిదాన నైతినా! లేదు — ఇంతకాలము నుండియును బిచ్చిదాననై సంచరించితిని. ఇప్పుడు ప్రకృతిస్థనైయే

యున్నాను. ఎవ్వఁడు సత్యస్వరూపమును దెలిసికొనఁజాలఁడో యాతఁడే పిచ్చివాఁడు - అట్టి నీ వింకను బిచ్చివాఁడవుగనే యున్నావు. అందుచేతనే నీవింకను జెంపుడు కుక్కవలె నావెనువెంట నంటి తిరుగుచున్నావు! ఎందుకు తిరుగుచున్నావు! ప్రేమలోభముచేత! — హాహ్హాహ్హా! ప్రేమ యన నేమో నీకుఁ దెలియునే తెలియదని చెప్పితిని — హా! హాహ్హాహ్హా! ఇంతవఱకు నాకును దెలియదు! పాంచకడియొద్ద నించుక ప్రేమతత్త్వ మును గూర్చి నేర్చుకొన్నాను. కాని యాతఁడు నా హృదయమును బూర్తిగ పఱచి సమూలముగ దానిని ఖండించివైచి పోయినాఁడు. చిరకాలము నుండి నేను నాకతని యెడలఁ గలిగిన ప్రేమను రహస్యముగ నా హృదయ మునందే యుంచి పోషించుకొనుచుంటిని. అజ్ఞానుఁడవై అంధుఁడవై నీ వెంతమాత్రమును నాసంగతి గ్రహింపఁజాలకపోయితివి! ఆతఁడు మహాత్ముఁడు! పవిత్రుఁడు! నిష్కళంకుఁడు! అతఁ డీనా యపవిత్ర హృదయమును గైకొనునా? అల్పు లగు నీవంటివారు మోహప్రలోభ నమునకు వశులై పోవుదురు. ఆతని కట్టిప్రమాద మేల కలుగును? ఆ మహాత్ముని హృదయరక్తముతో నాహృదయకల్మషమును గడిగివైచి కొంటిని. ఇఁక నీవు నన్నంటకుము. నీవు పిశాచమవు! కావుననే పిశాచీ ప్రేమకు లోభించి పిశాచివెన్నంటి పరిభ్రమించుచున్నావు." అనిపలుకు చుండఁగా యామాధికకన్నులనుండి యనలజ్వాలలు వెడలఁదొడంగెను. ఆమె పండ్లు పటపట గొరుకుచు హాహ్హాహ్హాయని నవ్వుటకారంభించెను.

ఇంతకాలము నఱకును దానేశుని హృదయమున ననుతాపజ్వాలలు ప్రజ్వరిల్లలేదు. అప్పు డాతఁడు తనలో "నేను నిజముగా బిశాచమనే! నిజముగా నేను పవిత్రమును, శాంతమును, సుశీతలమును నగు వస్తువును బరిత్యజించి ఘోరనరకమునకై ప్రాఁకులాడితిని. అందుచేతనే భగవం తుఁడు నాకీ శాస్తి గావించె నని తెలిసికొంటిని. అందుచేతనే నాశాంతి నా హృదయమున నశాంతినరకజ్వాలను దరికొల్పి కలత్యాగము

పాపించె నని గ్రహింపఁగలిగితిని. నిజముగా నామె కళంకినియేనా ?— కాదు! కాదు! ఆమె యత్యాచార విషజ్వాల నెదిరింపలేక గృహమును త్యజించి పోయినది. పాపాత్ముఁరాలు మరణించుటకు సాహసింపదని రామప్రాణబాబు చెప్పియున్నాఁడు. అతనిమాట సత్యము. అజ్ఞానావస్థలోఁ గూడ శాంతి నన్నే ప్రార్థించుచుండెనట! రామప్రాణబాబు విద్యాధికుఁడు; ధార్మికుఁడు; బహుశ్రుతుఁడు; దూరదర్శి. అతఁడెంతమాత్రమును బొరపాటు పడువాఁడుగాఁడు. అందుచేతనే నాశాంతి నాదే యైనది. ఇఁక యూథిక యో — యూథిక నన్నుఁ గల్లవలపుచే మఱపించి కైవసము చేసికొన్నది. ఇంద్రియలంపటుఁడ నగునే నామె హృదయమును గ్రహింపఁజాలనైతిని! పాపాత్ముఁరాలగునామె మాయచే— కపటనటనముచే నాతమ్ముని గూడ లోఁబఱచు కొనుటకుఁ బ్రయత్నించినది. కాని వాఁడు బుద్ధిమంతుఁడు! ఇది పాప మనియు, నింద్యమనియు నాతఁడు గ్రహింపఁగలిగెను. అయ్యో! అట్టి పాపవాంఛితమునకు సమ్మతింపలేదని యీదురాత్ముఁరాలాతని యమూల్య జీవనమునే యపహరించి వైచెను.” అని భావించు కొనుచుండెను.

అప్పుడు యూథిక రక్తవికసిత నయనములతో “ఏమి యాలోచించు కొనుచున్నావు! నావిషయమా? యూథిక చచ్చిన దని యను కొనుము! ఇఁక నెన్నఁడు నాయొద్దకు రాకుము. నీకు భార్యయున్న దని వినియున్నాను. ఆమె యొద్దకేఁ బొమ్ము! వైద్యాలయముతో నాకెంతమాత్రమును బనిలేదు. అది యంతయును నీవే తీసికొనుము! నా సొంతడబ్బుతోనే నేనీజీవితశేషమును గడపుకొందును. స్పష్టముగా జెప్పుచున్నాను. ఇఁక నీవు నాయెదుటఁ బడకుము! ఈ నిర్భాగ్యురాలి జ్వాలామయ హృదయము చెంత కిఁక రాకుము! నేను నిశ్చలచిత్తముతో నామహాత్ముని పవిత్రచరిత్రమును ధ్యానించు కొను చుండెదను. నీవు వచ్చి యెట్టి ధ్యానభంగమును గావింపవలదు!” అనియెను.

దానేశుని హృదయ మప్పుడనుతాపానలముచే దగ్ధమై పోవుచుండెను. అజ్వాల యీ నిమిషములో దావానలజ్వాల నైపోయెను. మానవుఁడు తనజీవిత మంతటిలోనను నట్టి యొక్క నిమిషము నందే తనపాపముల నన్నింటిని దలఁచుకొని యవసన్నుఁ డై పోవును! తన జీవిత మంతటిలోనను సంపాదించిన తీవ్రహాలాహలము నొక్క-సారిగా నట్టి నిమిషమునందే పానము గావించి యస్థిరుఁ డై పోవును; సంక్షుభితుఁ డై పోవును! అట్టి శుభముహూర్తము, అట్టి పవిత్రమైన నిమిషము మానవజీవితమునం దెప్పుడు తటస్థించునో యెవ్వరుచెప్పఁగలరు! ఆసమయమే తటస్థించినప్పుడు మానవుఁడు తక్షణ మందే భస్మీభూతుఁ డై పోవును. ఆవహ్నియే దివ్యవహ్ని! అట్టిశుభక్షణ మన్ని మానవ జీవితములకును లభించునది కాదు!

దానేశునిజీవితమునం దిప్పుడట్టి శుభముహూర్తము తటస్థించినది. ఆతఁ డా దివ్యవహ్నియందు భస్మమై పవిత్రుఁడై నాఁడు. దానేశుని కన్నుల కప్పుడు యూధిక రాక్షసివలె నగపడుచుండెను. చిరకాలము నుండి నెలకొనియున్న యీమెపైఁ గలవల పిప్పుడు విదగ్ధమును, విధ్వస్తమును నై పోయెను. దానేశుఁ డట నిలువక వైద్యాలయమునకు వెడలి పోయెను. అచ్చటనే యాతఁ డావినిద్రయామినిం గడపి తెల్లవారు జాముబండిపై కామపురమునకుఁ బయనించెను.

## ౭౧

ఆతఁడు కామపురము చేరునప్పటికిఁ బ్రాతఃకాల మెనిమిదిగంట లయ్యెను. అచ్చటికిఁ బోయి దానేశుఁడు శాంతికి బాగుగ నారోగ్యము కలిగినట్లు వినెను. ఆమెకు నిన్న జ్వరము తగిలినది గాని నేఁడు తగులలేదు. ఆమె హాయిగఁ గూర్చుండి యందఱితోడను మాట్లాడుచుండెను. ఆ దినమున నాయింట దానేశునకు "అల్లునివిందు" — రామప్రాణునిభార్య తన

యల్లుని నెంతో యాదరించి మెన్నియో మంచిమాటలచేఁ బరితుష్టుని గావించెను. ఇఁక నెన్నఁడు నల్లునకు, గూఁతునకును విశ్లేషము గలుగ కుండునట్లు కటాక్షింపు మని యామె దేవుని బ్రార్థించెను.

వసంతప్రభాతమునందలి మలయమారుతములు వీచుటచేఁ బుష్పనికుంజము సవిలాసముగ నత్యంత మైనను నించుక కంపానుభవముం గాంచు నట్లే — యా శుభసంయోగమునందు దానేశునిహృదయ మానందో చ్ఛ్వాసముం గాంచి యున్నను, శాంతిదేవి నిష్కలుష యగునా కాదా యను ననుమానముచే నించుకఁ బ్రకంపితముకూడ నగుచుండెను. ఇంచుక వికలముగూడ నగుచుండెను. గలితకేశుఁ డగు రామప్రాణ బాబు మంచి లోకానుభవము గలవాఁడు. అతఁడు దానేశునిహృదయ భావమును సంపూర్ణముగ గ్రహింపఁగలిగెను. అందుచేతనే యాతఁడు భోజనానంతరమున దానేశునిం గాంచి " బాబాజీ! మన మిప్పు డొక పని చేయవలసి యున్నది!" అనియెను.

దానే — ఏమిపని ?

రామ — భార్యాభర్తల సంబంధము మిగులఁ బవిత్రమైనది. ఇట్టి సంబంధమునందు బరస్పరవిశ్వాసము దృఢపడి యుండవలయును. ఏ మాత్రము నవిశ్వాసమైనను, ననుమానమైనను గలిగినచో నది యిరువు రకును నేకాంత అసుఖకారణము గాక తప్పదు ; అందుచేతనే నేనొక యూహ గావించితిని.

దానే — అది యేమో సెలవిండు !

రామ — శాంతిచరిత్రము పరమపవిత్రమ యైనది. ఆమె తన యమూల్యస్త్రీధర్మమును సంరక్షించుకొనుటకై ప్రాణమునుగూడఁ ద్యజిం చుట కుద్యోగించినది. అయినను నీకు సందేహము కలుగవచ్చును. అట్టిసందేహమునకుఁ బరిణామము మహాకష్టమును, నశాంతియునే —

దానే — మీరు విజ్ఞానధనులు. మీరు చెప్పినమాట యెన్నఁడు

నసత్యము కానేరదు.

రామ — ఇప్పుడు శాంతిదేవి చరిత్ర పవిత్రము స్వప్రమాణముగ నిరూపించుటయే మీ యిరువుర శ్రేయము కోరుచుండు నాత్మీయులకుఁ బ్రధానకర్తవ్యమై యున్నది. అందుకొఱకే నేనిప్పుడు నిన్ను వెంటఁ బెట్టుకొని గంగారామపురమునకుఁ బోవుచుంటిని.

దానే — అక్కడకుఁ బోవుటవలన నేమగును ?

రామ — శాంతిదేవి తన పినతల్లితోఁ జెప్పినవిషయము లన్నియు సత్యము లగునో కాదో యచ్చటఁ దెలిసికొనవచ్చును.

దానే — మీరు పరమబంధులు. ఉభయులహితమును గోరినవారు. మీకుచిత మని తోఁచినరీతిని గావింపుఁడు. సోదరమరణదుఃఖముచే నాహృదయ ముడికిపోవుచుండె నని చెప్పనక్కఱ లేదుగదా — దానిపై నీజ్వాల సామాన్యమైన దైనను నుపేక్షింపఁదగినది మాత్రము గాదు. ఇప్పుడు కేవలమును నామనసు స్తిమితముగా లేదు.

రామప్రాణబాబు విహారనౌక ననియుండే సిద్ధపఱుపఁబడి యుండెను. ఆజ్ఞ యైనంతనే సేవకులు వలయుద్రవ్యములం గొనిపోయి యందుఁ జేర్చిరి. పశ్చిమదేశీయులగు నలుగురు డఫేదారులతోడను, వంటవానితోడను, దానేశునితోడను రామప్రాణబాబు ప్రయాణము గావించెను.

దానేశుఁ డీసారి వచ్చినదిమొదల లొకసారియైనను శాంతిదేవిని దర్శింపలేదు. రామప్రాణుఁడు గాని యాతనిభార్య గాని యందుకుఁ దగుయత్నమునుగూడఁ గావింపలేదు. శాంతిచరిత్రము విషయమునం దాతనియనుమానము తీరి నిస్సంశయుఁ డైనప్పుడే యిరువురికిని దర్శన స్పర్శన సంభాషణము లుచితములై యుండునని వారు నిశ్చయించుకొనిరి. సందేహవాహినీ వేగము నరికట్టినచో నది పూర్ణముగ నిండి గట్లు త్రెంచుకొని యనిరుద్ధవేగముతో నుద్వేలితమై దరులను ముంచి ప్రవహింపక మానదు. ఇట్లు భావించియే రామప్రాణబాబు దానేశుని యనుమతిం

గాంచి యాతనిపద్ధతి ననుసరించియే యూరిలో వైద్యునిచే శాంతిదేవికి జికిత్స చేయించుట కేర్పాటు గావించెను.

## ౨౨

కామపురినుండి గంగారామ పురమునకు మూఁడుదినముల ప్రయాణము. ఆ నౌక రెండు దినములు, రాత్రులు నవిరామముగఁ బయనముచేసి మూఁడవనాఁటి యుదయముననకే గంగారామ పురముచేరెను. అప్పుడు రామప్రాణబాబు దానేశునితోఁగూడఁ బడవలోనుండి యొడ్డునకు దిగెను. ఇరువురు డఫేదారులు లాటీలు పట్టుకొని వారి వెనుకముందుల నడచు చుండిరి. తక్కిన వారందఱును బడవలోనే యుండిరి. రామప్రాణ దానేశు లూరిలోనికిఁ బోయి గోపాలదేవుని యింటిని గూర్చి యనుసంధానము చేయుచుండిరి. గోపాలదేవుఁ డప్పుడు హుక్కాను సేవించుచు ముంగిటఁ గూర్చుండి యాపెద్దమనుష్యులను డఫేదారులను జూచి, భయపడి చేతిలోని హుక్కా గొట్టమును గ్రిందఁ బారవైచి, వారియెదుటికి వచ్చి వినమ్రుఁడై నిలువఁబడెను. రామప్రాణబా బాతనిం గాంచి "నీపేరేమి?" అని ప్రశ్నించెను. ఆతఁ డదరిపడి నమస్కారము చేసి "గోపాల చంద్రదేవు" అనియెను.

రామ — ఇప్పటికి గొన్నిదినముల క్రిందట మీయింటి కొక యువతి వచ్చి యున్నదఁట గాదా?

గోపా — లేదు! లేదు బాబూ! మేము దీనులము!

రామ — అసత్యము చెప్పవలదు. నీ కేమియును భయములేదు. కాని నిజము చెప్పకున్నచోఁ గష్టములపా లగుదువు.

గోపాలదేవు నిజముగా దుఃఖించుచు "బాబూ! ఆ యమ్మమూలముననే మా కింతటిసర్వనాశము సంభవించినది!" అనియెను.

రామ — ఏమి?

గోపా — చిత్తగింపుఁడు! మా గ్రామాధికారి రాయమహాశయుఁడు మాయిల్లు, వాకిలి, పొలము, పుట్ట మొదలగునవి యన్నియును విక్రయము చేయించెద నని పంతము పట్టి యున్నాఁడు.

రామ — ఎందుచేత? నీకు భయము లేదు. చెప్పుము!

గోపా — ఆయువతి యొకనాఁడు తెల్లవారిన వేళ నదీ కూలమునఁ గూర్చుండి యేడ్చుచుండెను. అప్పుడు నా భార్యయు, మా పొరుగింటి గృహిణి యొకతెయు నామె నూఱడించి మాయింటికిఁ దీసికొని వచ్చిరి. వారు వచ్చుచుండఁగా త్రోవలో రాయమహాశయుఁ డామెను జూచెను. ఆతని స్వభావము మంచిది గాదు. పెద్దవారే యట్లయినచో నిఁక నెట్లు? ఆతఁ డొకవిధవను మాయింటికిఁ బంపించెను. ఆమెమాటలు విని నా భార్య మండిపడియెను. ఆయమ్మ చాల సత్తమురాలు బాబూ! ఆమెకూడ నా విధవమాట లాలకించి యెంతో దుఃఖపడినది. ఆమె దేవునిఁ బ్రార్థించుచు రాయమహాశయు ననేకవిధముల శపించినది.

ఆమాట విని దానేశుఁ డొకయుష్ణదీర్ఘశ్వాసమును విడిచి యట నుండి యించుక జరగి నిలువఁ బడియెను.

గోపా — అప్పు డావిధవ పోయి యిక్కడి వృత్తాంత మంతయు రాయమహాశయునకుఁ దెలిపినది. అందుపైనాతఁడు నన్నుఁ బిలిపించి యా యువతిని దన కొప్పగించినచోఁ దగిన బహుమాన మిచ్చెద నని నా కాశ కల్పించెను. ఒప్పింపకపోయినచో నీకు సర్వనాశనము గావించెద నని నన్ను భయపెట్టెను. నీవు పంపకున్నచో నలుగురు మనుష్యులను నీయింటికిఁ బంపి యామెను బలవంతముగా రప్పించుకొందు నని ధిక్కరించి పలికెను — నేను మారుమాటాడక యింటికి వచ్చి నా భార్యతో నెల్ల సంగతులను జెప్పితిని. ఆయమ్మకన్నీరు చూచి నాభార్య జాలిపడి, తన ప్రాణములైన నర్పించి యామెసతీత్వమును రక్షింతు నని శపథము చేసెను. ఆమెమాట లాయువతికూడ విని యుండును. అప్పటికి రెండు

జాముల రాత్రియైనది. మేమామె నిదురించుచున్న దనుకొన్నాము. తరువాతఁ గొంతసేపటికిఁ జూడఁగా నామె యింట నగుపడలేదు.

రామ — ఆమె మూలమున నా సర్వస్వమును బోయెనని నీవు చెప్పితివే! ఎందుచేత?

గోపా — ఆ మఱునాఁ డామె యగుపడకపోవుటచే నేనే యామెను బంపివైచితి నని కోపించి రాయమహాశయుఁడు నాపేరఁ గొన్ని వందలకు దొంగనోటులను సృష్టించి దావాలు చేయించినాఁడు.

రామ — నీకు భయము లేదు. నేను కామపురపు జమీందారుఁడ నగు రామప్రాణబాబును! ఇప్పుడు నే నా పాపాత్ముని జూడఁ దలంచుకొన లేను. ఆ దావాలు నిన్ను బాధింప కుండునట్లు సహాయము చేసెదను. ఆ దురాత్మునకుఁ గూడఁ దగినశాస్తి చేయించెదను.

కామపుర మక్కడకు మూఁడుదినముల ప్రయాణపుదూరమం దున్నను గంగారామపురప్రజలకు రామప్రాణబాబు గొప్పతనము పరిచితమే యైయుండెను. ఆతనికీర్తిప్రతాపము లామండల మంతటను సువిదితములై యుండెను. గోపాలదేవప్పు డాయనకు సాష్టాంగప్రణామము గావించి కూర్చుండుఁ డని ప్రార్థించెను. కాని రామప్రాణబా బాతని కభయ మిచ్చి యటనుండి వెడలిపోయెను. అట్లు కొంతదూర మరిగిన తరువాత రామప్రాణుఁడు దానేశు నుద్దేశించి "నీవెప్పుడైన నీయూరు వచ్చితివా? మీయూరి కిది సమీపమే యనుకొందును. దూరమైనచో నొక్కరాత్రిలో శాంతిదేవి తెల్లవాఱునప్పటి కిక్కడకు రాఁగలుగునా?" అనియెను.

దానే — ఒక్కరాత్రిలోనే వచ్చియుండునని మన మెట్లూహింపఁ గలము!

రామ — శాంతిదేవి తనపినతల్లితోఁ జెప్పినది గాదా?

దానే — నేను చిన్నతనమునుండియుఁ గలకత్తాయందే యుంటిని.

ఇచ్చటి గ్రామములనుగూర్చి నాకుఁ దెలియదు.

అప్పుడు రామబ్రహ్మణ్యముగారు గోపాలదేవుని కుద్దేశించి "ఇక్కడ నుండి శోణపుర మెంతదూరమున్నది!" అని యడిగెను.

గోపా — సమీపమే బాబూ! కొంచె మెచ్చుతగ్గుగా మూఁడు క్రోశము లుండును.

రామ — పడవమీఁదను బోయినచో నెంతసేపటికిఁ బోఁగలము?

గోపా — ఇదిగో! నది యిచ్చటనే కాదా! పడవమీఁదఁ బోయి నచో సాయంకాలమునకుఁ బోవచ్చును.

రామబ్రహ్మణ్యుఁ డాతని కుపకారము చేసెద నని చెప్పి పంపించి తానును, దానేశుఁడును, పరివారమును దిగి వచ్చి నౌకయందుఁ బ్రవేశించిరి. ఆ మధ్యాహ్నస్నిగ్ధ వాయుభరమున నౌక వేగముగను మందముగను గాని గమనముతో నదీమధ్యమునుండి తరలి పోవుచుండెను.

## 23

రాత్రి రెండుజాము లయ్యెను. శోణపురప్రజ లందఱును నిద్రలో నుండిరి. చల్లనిగాలి యడవిపూవులపరిమళములతోఁ బయలువెడలి, ఝిల్లీరవము లతోఁ జంద్రకిరణాలంకృతమై యలరారు ధాత్రిదేవి నంటుచునందు మంద గమనమునఁ బ్రసరించుచుండెను. విరహపీడచే విగతనిద్రమై వృక్షచూడ మున వసించి పెంటికై యెదురుచూచుచున్న యొకభరతపక్షి సప్తమ స్వరమున విషణ్ణగీతము నాలాపించుచు దిగంతములఁ బ్రతిధ్వనింపఁ జేయుచుండెను. తీరమునందు నౌకను నిలిపి దానేశ రామబ్రహ్మణ్యు లొడ్డున దిగిరి. పాచకుఁడును, నౌకదఫేదారును మాత్రము నౌకయం దుండిరి. తక్కినవా రందఱును దిగి వారిని వెంబడించిరి. వారందఱు నప్పుడు నిశీధనిస్తబ్ధపల్లీపథము ననుసరించి శోణపురమధ్యమునఁ బ్రవేశించిరి. వీధిలో వారి కెవ్వరు నగపడ లేదు. అచ్చటచ్చట నిండ్లముందరఁ బరుండి

యున్న యొకటిరెండు కుక్కలు మాత్రము వానియడుగులసవ్వడి విని తత్తరముతో మోరలెత్తి యొకటిరెండు సారులు మాత్రము మొఱిగి మరల శయనించెను.

చిరకాలమునకు దానేశుఁడు తనపైతృకజీర్ణశీర్ణావసన్న మందిరము యొక్క సింగిటిద్వారముకడకుఁ జేరుకొనియెను. ద్వారము బంధింపఁబడి యుండెను. అప్పు డాతఁడు బిగ్గరగా "అమ్మా!" అని కేక వైచెను. నిశాసమీరాన మా మధురారవమును గొనిపోయి యామందిర మంతటను బ్రతిధ్వనింపఁ జేసెను. ఆయింటిలో నింకను దీపము వెలుఁగుచుండెను. రమాదేవి, జయంతి, గౌరాంగి, శివమోహిని, దాసి మొదలగువా రందఱు నింకను మేల్కనియే యుండిరి. వారు విజయదశమికి గంగాస్నానార్థము పోవలయునని సిద్ధపడుచుండిరి. శోకతాపములచే నింటివారందఱును జిక్కి యుండిరి. విష్ణుచంద్రసర్కారు, తనభార్యను, తనయను, చెల్లెలిని గంగాస్నానార్థము తీసికొనిపోవఁ దలఁచెను. వారితోఁ గూడ వీరును బోవుటకుఁ బయనమగుచుండిరి. వారి సుఖసంసార మంతయును నిప్పు డస్తవ్యస్త మైపోయెను. ఈ భాగీరథీస్నానమువలన జన్మజన్మార్జితములగు తమపాతకము లన్నియును నశించి యీశ్వరానుగ్రహమున నెప్పటికైనఁ గుటుంబశ్రేయము లభింపఁగల దని వారియాశ! పవిత్ర మగుగంగాయాత్ర యిహసుఖము గూర్చుటే కాక పరసుఖమును గూడఁ గల్పించు నని వారినమ్మకము! హిందువుల పరలోకవిశ్వాసమే వారిధర్మసౌధమునకు సరళ సోపానస్వరూప మైనది! వారొకపడవపై కలకత్తాకుఁ బోవుటకు సిద్ధపడుచుండిరి. తెల్లవాఱుజామున విష్ణుచంద్రసర్కారువచ్చి వారిని బిలుచును. అందుచేతనే వారు ముందుగా లేచి యాతని పిలుపునకు నిరీక్షించుచుండిరి. ఇంతవఱకును నిద్రించుచున్న యతీశచంద్రుఁడు కూడ నప్పుడు లేచి యుండెను.

ఆకస్మికముగాఁ జిరపరిచిత మగునామధురస్వరము — "అమ్మా!"

యను నాయమృతమధురశబ్దము రమాదేవి కర్ణకుహరమునందు చల్లగా బ్రవేశించెను. బిడ్డ తప్పిపోయి వెదకికొనుచున్న యావు, దూడయఱపు విని యెట్లుత్కర్ణమై యుండునో యట్లే దానేశుని తల్లియగురమాదేవి యాశబ్దమును విని యశ్రుసిద్ధనయనములతో దాసిని దిలకించుచు "నిస్తారిణీ! మనదానేశుడు వచ్చిన ట్లున్నది! ఆతని కంఠస్వరము వంటి స్వరముతోనే "అమ్మా!" యనుపిలుపు వినఁబడినది!" అను చుండఁగనే దానేశుఁడు మరల "అమ్మా!" అని కేక వైచెను.

అది విని పెద్దకోడలు జయంతి "ఔను! నిజమే! మఱఁది గారే వచ్చి యున్నారు!" అనియెను. దాసి పరుగెత్తుకొని పోయి తలుపులను దెరచెను. దానేశుఁడు తనతో వచ్చినవారి నందఱిని వెంటఁబెట్టుకొని గృహమధ్యమునఁ బ్రవేశించెను. వారందఱును గూర్చుండుటకు దాసి తివాసులను బఱచెను. దానేశుఁడు ముందుగఁ బోయి మాతృచరణములకుఁ బ్రణామ మాచరించెను. రమాదేవి పెద్ద పెట్టున నేడువనారంభించెను. దానేశుఁడుకూడ నేడువఁదొడంగెను. తల్లియేడుపు మరణించిన చిన్నిమనుమఁడు శచీశుని కొఱకును, గృహమును ద్యజించిన చిన్న కోడలి కొఱకును — దానేశుని దుఃఖము పాంచకడీ కొఱకు — కాని రమాదేవి కాసంగతి తెలియదు. దానేశుఁడుకూడ శాంతిదేవికొఱకును శచీశుని కొఱకునే యేడ్చుచుండె నని యనుకొనెను. పిమ్మట రమాదేవి పాంచకడీ క్షేమమునుగూర్చి ప్రశ్నించెను. దానేశుఁడు కంపిత కంఠస్వరముతో "క్షేమముగనే యున్నాఁడు!" అని చెప్పెను.

ఆసందడి విని యతీశుఁడు లేచి వచ్చి రామప్రాణ బాబు పరిచయమును దెలిసికొని యాతని నుచితరీతి నభ్యర్థనకుశల ప్రశ్నాదులచే గౌరవించెను. తరువాత యతీశుఁడు తన కుటుంబావస్థంగూర్చియు, విచారముం గూర్చియు రామప్రాణునకు విన్నవించి నిశ్శబ్దముగ నశ్రుమోచనముం గావించెను. రామప్రాణుఁ డంతయు నాలకించి "ఇట్టి

కట్టుబాటు లేకుండుటకును, నింతటి యశాంతి ఘటిల్లుటకును, ఈ సంసార మిట్లు పాడైపోవుటకును మూలకారణము కేవలము నీ యల క్ష్యమే — సంసారము నందు ధైర్యముతోడను, వివేచనముతోడను దృఢనిశ్చయము తోడను గార్యములను గావింపఁ జాలకున్నచోఁ దుద కిట్టి విషమ ఫలములనే యనుభవింపవలసి వచ్చుచుండును. ఏమైన నేమి? — ఇఁక ముందైనను జాగ్రత్తగా నుండుట మంచిది!" అనియెను. యతీశుఁడు నిట్టూర్పు విడిచి "దీప మారిపోయిన తరువాత జమురు పోయుట వలన నేమిలాభము!" అనియెను.

ఇంతలో నొకదాసిని వెంటబెట్టుకొని విష్ణుచంద్రసర్కా రచ్చటికివచ్చి యపరిచితుఁ డగు నొకపెద్దమనుష్యునితో నింటికి వచ్చియున్న దానే శునిం గాంచి తనలో "ఇఁక వీరింటికి దాళము వైచికొని గంగాస్నాన మునకు వచ్చుట కవకాశములేదు." అని యనుకొనెను. విష్ణుచంద్రునిం గాంచినంతనే యతీశుఁడు "నాన్నగారూ! ఈయన కామపురపు జమీందారుఁడు — బాబు రామప్రాణ చౌధురి!" అని పరిచయముం గావించెను. ఆపేరు విన్నంతనే విష్ణుచంద్రుఁ డాశ్చర్యముతో "ఈ మహాశయుఁ డిచ్చటికేల వచ్చెను?" అని ప్రశ్నించెను.

యతీ — ఈయన మన దానేశునకుఁ బినమామగారు!

విష్ణు — ఆలాగా? ఈసంగతి నేనింత వఱకును విననే లేదు! ఇప్పుడు వీరి యాగమనము వలన మనగృహము పవిత్రమైనది. మన గ్రామము పవిత్రమైనది. కాని మిక్కిలి విచారింపవలసిన విషయ మే మనఁగా—

రామ ప్రాణబాబు విష్ణుచంద్రుని మాట కడ్డము వచ్చి "మా యమ్మాయి మాయింటికి వచ్చినది! ఆమెకొఱకుఁ బరితాప పడ నక్కఱలేదు! అందుచేతనే నేనిక్కడకు వచ్చితిని" అనియెను.

ఆ చల్లనిమాట విని యందఱును బులకితు లైపోయిరి. మొదటి

నుండి తుదివఱకు నెల్లసంగతులను రామప్రాణబాబు వారికి వినిపించెను. అంతయును విని విష్ణుచంద్రుఁడు "ఆమె ధర్మమే యామెను సంరక్షించి నది. దీనినిబట్టి ధర్మ మెన్నఁటికిని ధార్మికులను ద్యజింపదని లోకు లంద ఱును విశ్వసింతురుగాత!" అనియెను. తరువాత దుర్బుద్ధి యగు రామ సేవకుని దుష్ప్రవర్తన మంతయు నాద్యోపాంతముగా రామప్రాణ బాబున కెఱుక పఱచెను. రామప్రాణుఁడు దానేశునిం గాంచి "బాబూ! వింటివా?" అనియెను.

అంతయును విని దానేశుఁడు తల వంచుకొనియెను. ఏమియు మాటాడఁ జాలకపోయెను. రమాదేవి, జయంతి మున్నగువా రందఱు నానందోత్ఫుల్లనయనలై యుండిరి. దాసి రామసేవకుని పేరెత్తి శత సహస్రవిధముల శపింప నారంభించెను. అప్పుడు విష్ణుచంద్రుఁడు "యతీశా! మీరందఱును వచ్చుట కవకాశము కలుగదేమో! గంగాస్నానమునకు మీయమ్మను మావెంటఁ దీసికొని పోయెదము!" అనియెను. అది విని రామప్రాణబాబు "అందఱమును గలసియే పోవచ్చును. ఇదియే మంచి శుభయోగము. పడవత్రోవను బోయినచోఁ గామపురము మీఁదుగనే కలకత్తాకుఁ బోవలయును. మేమిప్పుడు పడవనుండియే యిటకు వచ్చి తిమి. ఈ రాత్రియే మనము బయలుదేఱవచ్చును. శాంతి కింకను బూర్ణారోగ్యము కలుగలేదు. కావున మేమిట నాసింపఁ గూడదు. మాయింటికిఁ బోవుదము. అందఱు నచ్చట నొకనాఁ డుండి తరువాత గలకత్తాకుఁ బోయినఁ బోవచ్చును. రామపురము నొద్ద గూడ గంగానది యున్నది. దశహరాస్నాన మచ్చటఁ జేసినను, జేయ వచ్చును" అనియెను.

అందు కందఱును సమ్మతించిరి. అప్పటి కందఱు నుచితరీతి నుపా హారములు గావించి తేనీరు ద్రావి తెల్లవారుజామున నౌకారోహణము గావించిరి. ముందు వెనుకలుగా రెండు పడవలును నదినుండి తరలిపోయెను.

ఆదినము పరమానంద దాయకమైనది. పడవలు రెండును గామపుర తీరమునకు వచ్చునప్పటికి నిదాఘనిశావసాన మయ్యెను. అందఱు దిగి రామప్రాణబాబు మందిరమునకుఁ జేరిరి. శాంతిదేవికి జ్వరము తగ్గిపోయినది. ఆమె పథ్యము తీసికొన్నది. అందఱును వచ్చినవార్త నాలకించి యామె మిగుల వ్యాకుల చిత్తముతో వారిచెంతకుఁ బరుగెత్తుకొని వచ్చి యొక్కొక్కరికే పాద ప్రణామములను గావించి పెద్దకోడలు జయంతిని బిగ్గఁ గౌఁగిలించుకొని బాలికవలె నేడువఁ దొడంగెను. అప్పుడు జయంతికిఁ గూడఁ గన్నీరుఁ గారినది గాదు! తరువాత రమాదేవి, గౌరాంగి, శివమోహిని, విష్ణుచంద్రుని గృహిణి మున్నగువారిం గలసి శాంతిదేవి యథోచితసల్లాపములు గావించుచుండెను. అప్పుడు రామప్రాణునిగృహిణి వచ్చి, యందఱిని యథావిధిగ గౌరవించి పరమాదరముతో నందఱిచెంతను గూర్చుండి యామాటల నీమాటల నాడుచు రాత్రిశేషమును గడపివైచెను.

దానేశుని హృదయమునం దింకను నానందము స్థిరముగ నెలకొనఁజాలకుండెను. పాంచకడీ మరణదుఃఖము నాతఁ డడంచుకొనఁ జాలకుండెను. ముఖ్యముగా నట్టిదుర్వార్త తల్లి వినినచో నామె యెక్కడ గుండెపగిలి చచ్చునో యని యాతఁడు పరితపించి పోవుచుండెను. అట్టి విచారముతో వ్యాకులహృదయుఁ డగు దానేశుఁడు దర్శనగృహము వైపునకు బోవుచుండఁగా దల్లియగు రమాదేవి యాతనిం బిలిచి "బాబూ! ఇక్కడనుండి కలకత్తా యెంతదూరము?" అని ప్రశ్నించెను.

దానే — ఎంతయో దూరము లేదు. ఎందుకు?

రమా — పాంచకడీ నొకసారి పిలుపింతము! వానిని జూచి చాల దినములైనది.

దానే — అలాగే!

రమా — మీచిన్నన్న క్షితీశుని వర్తమాన మేమైనఁ దెలిసినదా?

దానే — లేదు. కలకత్తాలోమనదేశీయు లెక్కడనుండిరో యక్కడి కెల్ల బోయి యనుసంధానము చేసితిని. ఏమియు నాతని వృత్తాంతము తెలియలేదు. ఆయన కలకత్తాకు వచ్చినట్లే లేదు.

రమా. — (కన్నీటితో) వాఁడు బ్రదికియే యున్నాఁడో యేమో? ఏసంగతియుఁ దెలియుట లేదు.

సమీపమునందు నిలిచియున్న శివమోహిని యామాట విని పైట చెఱఁగుతోఁ గన్నులను దుడిచికొనియెను. దానేశుఁ డట నిలువఁ జాలక దర్శన గృహమునకుఁ బోయి యచ్చటఁగూడఁ జాలసేపటి వఱకును మనసు కుదురు పఱచుకొనఁ జాలక పోయెను. అతఁడు క్షితీశుని దలఁచుకొని తనలో "అక్కటా! ఆయన యింకను జీవించి యుందురా? ఏమో — పాంచకడీ మరణవార్త ఎప్పటికైన నమ్మకుఁ దెలుపక తప్పదుగదా — అప్పు డామె యేమగునో, తలచు కొన్నంతనే గుండె పగిలిపోవుచున్నది!" అని యనుకొనుచుఁ, నీ మైదాఱుదినముల నుండియు రామప్రాణబాబు పేర వచ్చియున్న యింగ్లీషు దినపత్రికల నన్నిటిని దీసి చదువ నారంభించెను.

అది గ్రీష్మప్రభాతము! ఇల్లంతటను నించుక వేఁడి వెలుఁగు వ్యాపించి యుక్కగా నుండెను. అం దితరు లెవ్వరునులేరు. గడియారము మాత్రము టిక్కుటిక్కు మని చప్పుడు చేయుచుండెను. దానేశుఁ డొక పత్రికను విచ్చి యందలి సంపాదకీయవ్యాసమును జదువుచుండెను. అప్పు డాకస్మికముగా నాతనిదృష్టి యాపత్రమునందలి యొకవైపునకుఁ బ్రసరించెను. తోడనే యాతఁడు సంచలితుఁడై యాభాగము నందలి విషయము నొక్కసారి — రెండుసారులు — మూఁడు సారులుగ పఠించెను. పిమ్మట నాతఁ డాపత్రికను జేతఁబట్టుకొని యటనుండి ప్రధానమందిర

మునకుఁ బోయెను. అచ్చట రామ ప్రాణబాబు, యతీశుఁడు, విష్ణు చంద్రుఁడు మొదలగువా రందఱును గూర్చుండి మాటాడుకొనుచుండిరి. దానేశుఁడు రామప్రాణబాబున కాపత్రిక నిచ్చి యందొక పేరాను వ్రేలితో జూపుచు "ఈ యద్భుతసమాచారమును దిలకింపుఁడు!" అని యెను. రామప్రాణబాబు ససంభ్రమముగ నావిషయముం జదివి యానంద మందస్మిత నయనములతో దానేశునిం గాంచుచు "ఈక్షితీశచంద్రుఁడు నీ కేమగును?" అని ప్రశ్నించెను.

దానే — మా మూఁడవ యన్నగారు!

అప్పుడు యతీశచంద్రుఁడా క్షితీశుని పేరు విని యెట్టి యాపద తటస్థించెనో యని భయపడి దానేశు నుద్దేశించి "తమ్ముఁడూ! క్షితీశున కేమైనది?" అని ప్రశ్నించెను.

దానే — ఆయనవర్తమాన మేమియుఁ దెలియుట లేదు. కాని యీ పత్రికయం దాతనితో సంబంధించిన విషయ మొకటి యున్నది! వినుఁడు!

అని, దానేశుఁ డాభాగమును జదివెను. అందిట్లున్నది: — "మేము మిగుల దుఃఖముతో గతసంచికయందు మా సహకారసంపాదకుఁడు మిస్టరు జన్ స్టోనుదొరవారి యాకస్మిక మరణ వార్తను దెలుపుకొంటిమి. ఆయన మరణపర్యంతము నవివాహితుఁడగనే యుండెను. ఆయన కర్మవీరుఁడు; లోకోపకార కృత్యములయందే తనజీవితము నుపయోగించిన వాఁడు! దీనపోషణమునకు వ్యయముకాఁగా మిగిలిన యాతని స్వార్జితవిత్త మంత తక్కువగా లేదు, ఎనుబదివేల రూపాయలు! మరణకాలమునం దాయన యొక మరణశాసనము వ్రాయించి రిజిస్టరు చేయించి పోయెను. ఆధనమంతయు గొందఱు మధ్యవర్తులకడ నున్నట్లు విల్లులో నుదహరించి యున్నాఁడు. అందు నలుబదివేలు తన జన్మభూమి యగు లండనునందు గల దరిద్రసమాజమున కధ్యక్షుఁడగు వానికి దీన

పోషణార్థమై యిచ్చివైచెను. ఆతఁ డొకప్పుడు ఓఢ్రదేశమునందు కఱవు పుట్టినప్పుడు ప్రజలకష్టములను దర్శించుటకై యచ్చట సంచారము గావించెను. ఆసమయమునం దొకపల్లెచెంత పొలములలోఁ బడి సైకిలుపైఁ బ్రయాణము చేయుచుఁ బ్రమాద వశమున నొకచోఁ బడిపోయెను. అప్పు డాతనికి జీవితసంశయముం గలిగించు బలమైనగాయము లయ్యెను. ఆ సమయమందు నిస్వార్థపరుఁడగు నొకపథికుని యమూల్య సాహాయ్యమువలనను, శుశ్రూషలవలనను నాతఁడు జీవింపఁగలిగెను. అట్లు తనకు సాయపడిన యాబంగాళీబ్రాహ్మణునకు మిగిలిన నలువది వేలలో నిఱువదివేల నిచ్చినట్లు వ్రాసి యుండెను. ఆ బంగాళీబాబుపేరు క్షితీశచంద్ర రాయలు! ఆతని గ్రామము వంగదేశమునందలి శోణపురము! ఇఁక మిగిలిన యిరువది వేలలోను, పదివేలుదుర్భిక్షనివారణ సమితికిని, పదివేలు మిషనరీఫండునకును దానము గావించెను" అని — దానేశుఁ డట్లు చదివి ముగించినంతనే యతీశచంద్రుఁడు "తమ్ముఁడూ! క్షితీశుఁ డెక్కడ నున్నాఁడు! వాఁడా సొమ్మును దీసికొనియెనా?" అని ప్రశ్నించెను.

దానే — ఈ పత్రికవిషయ మిది. ఆయన సంగతి తెలిసికొనుట కిందు వలన నవకాశములేదు. నేనీ రెండుజాముల బండిమీఁద గలకత్తాకుఁ బోయి యీ పత్రికా కార్యస్థానమున నెల్లసంగతులను దెలిసికొని వచ్చెదను.

యతీ — అట్లయినచో నీక నాలస్య మెందుకు? ఆవశ్యకమైనచో నేనుఁ గూడ నీతో వచ్చెదను.

ఇట్లువారు సంభాషించు కొనుచుండఁగా నొక సేవకుఁ డటకు వచ్చి "ఒక పెద్ద మనుష్యుఁడు వెలుపల నిలువఁబడి యున్నాఁడు. ఆయన డాక్టరు బాబును దర్శింపఁ గోరుచున్నాఁడు!" అని మనవి చేసెను.

రామప్రాణబా బామాట విని "విదేశీయుఁడా?" అని యడిగెను.

సేవ — ఏమో! నాకుఁ దెలియదు.

రామ — లోపలికి రమ్మని చెప్పుము!

సేవ — లోపలికి దయచేయుఁ డని నేను చెప్పితిని. ఆయన యంగీకరింపలేదు. డాక్టరుబాబును జూచి యాయన యిప్పుడే పోవునఁట!

దానేశచంద్రుడు లేచి సేవకునితోఁ గలసి పోయెను. సింహద్వారము నొద్ద నొక పెద్దమనుష్యుడు నిలిచి యుండెను. అతఁడు ప్రక్కగాఁ దిరిగి సింహద్వారపు చెక్కడపు బనిని బరిశీలించుచుండెను. దానేశుఁడు సమీపించి యేమి మహాశయా యని పలుకరించెను. పెద్దమనుష్యుఁడు తిరిగి చూచెను. దానేశుఁ డొక్క యుదుటనఁ బరుగెత్తుకొని పోయి యాతని పాదములపైఁ బడి పొరలుచు, "చిన్నన్నయ్యా! మమ్ముల నందఱిని త్యజించి యెక్కడకుఁ బోయితివి?" అని దుఃఖింప దొడంగెను. క్షితీశుని కన్నులు గూడ జలభారాక్రాంతము లయ్యెను. అతఁడు గద్గద ఖిన్నకంఠముతో "చాలదూరము తిరిగితిని. ధన మెచ్చట లభించునో యన్వేషించుటయే నా సంచారమున కుద్దేశము! తుదకుఁ గలకత్తావచ్చి బౌబజారువీధిలో నీ పేరుతో నున్నబోర్డును జూచి పరమానందముతో నీవో కావో తెలిసికొనఁ దలఁచి లోనికిఁ బోయి యచ్చటివారి నడిగితిని. ఆవైద్యాలయము నీదే యని వారు చెప్పిరి. అచ్చట మఱియొక భయంకర దుఃఖవార్తగూడ నా చెవులఁ బడినది. అయ్యో! మన ప్రేమాధారుఁ డగు పాంచకడీ హత్యగావింపఁబడెను! ఎంత దారుణ వార్త! ఎంతటి విపరీత సంఘటనము! అయ్యో!" అని యేడువఁ దొడంగెను.

దానే — చిన్నన్నయ్యా! మాటాడవలదు! ఊరకుండుము! అమ్మ, పెద్దవదినె, పెద్దన్నయ్య యందఱు నిచ్చటనే యున్నారు. ఈ దారుణవార్త నొక్కసారిగా నందఱు నాలకించి దుఃఖపరితప్తులై యేమగుదురో చెప్పఁజాలను. విశేషించి తమ్ముఁ డమ్మకుఁ బ్రియ

మైన యెుడిలోనిబిడ్డ! అందువలన నీభీషణవార్త శ్రవణమున నాకస్మికముగాబడిన నష్టమే మైపోవునో!

క్షితీ — ఏమిరి! కుటుంబము వారందఱు నిక్కడ కేలవచ్చితిరి?

దానే — ఈమందిరాధికారి కామపురపు జమీందారుఁడు రామప్రాణ బాబు నాకుఁ బినమామగా రగుదురు. ఇక్కడ కంద ఱమును వచ్చుట కనేకకారణము లున్నవి. తరువాత నన్నియును వినఁగలవు. లోపలికి రమ్ము! నేనిక్కడ నున్నట్లు నీవు నా బసలోనే తెలిసికొంటి వనుకొని యెదను.

క్షితీ — ఔను. నేను మొట్టమొదట నిన్న నీ బసకుఁ బోయితిని — మరల నీ యుదయము పోయితిని. అచ్చటికాంపౌండరు నీవు కామపురపు రామప్రాణబాబుగారింటికిఁ జికిత్సకొఱకుఁ బోయితి వనియు, నింకను రాలే దనియుఁ జెప్పెను. ఇంకను నెట్టి దుస్సంఘటనలు కలుగునో యని నేనిటకుఁ బరుగెత్తుకొని వచ్చితిని.

దానే — చిన్ననాన్న! నీవెప్పుడైన నోఢ్రదేశమునకుఁ బోయితివా?

క్షితీ — కేవలము నోఢ్రదేశ మననేమి? భారతదేశ మంతయుఁ జాలవఱకు సంచారము చేసితిని.

దానే — ఆ దేశమునం దొకపల్లెటూరి పొలములో నెవరో దొరగా రొకప్పుడు సైకిలుమీఁది నుండి పడి పోయిరఁట! ఆ సంగతి నీకేమైనఁ దెలియునా?

క్షితీ — తెలియకేమి? అప్పు డాయనను నేనే లేవనెత్తి గాయము పైఁ గట్టు కట్టితిని. తరువాత నాతని నాపల్లెకుఁ దీసికొని పోయితిని. అట నాతని కుపచారములు చేయుచు నారాత్రి యెరువురము నందే యుంటిమి. తెల్లవారజామున నేనే యాయనను బూరీకిఁ బంపించితిని.

దానే — అలాగా? పాప మాదొరగారు మరణించెనఁట!

క్షితీ — అయ్యో! ఆయన చాల మంచివాఁడు. మరణించెనా? నా

దురదృష్టము! ఆతఁడు నా దీనావస్థం గాంచి విని నన్నుఁ గలకత్తాకు రమ్మనెను. ఏదైన నాకొకయుద్యోగ మిప్పించు నని యనుకొంటిని. కాని కొంతకాలము తీర్థయాత్రలు గావించిన నించుక శాంతి గలుగు ననియుఁ, దరువాతఁ గలకత్తాకుఁ బోయి యాతని దర్శింపవచ్చు ననియుఁ దలంచితిని. అట్లే నేను కలకత్తా వచ్చునప్పటికి నీ బససంగతి తెలియవచ్చినది. దొరగారిని కలిసికొనుట కవకాశము గలిగినదే కాదు. ఇఁకఁ గలిసికొనుట కేవ రున్నారు? కాని దానేశా! ఈ యోఘ్ర దేశపు సంగతి నీకెట్లు తెలిసినది? నీవా దొరగారితో మాటాడితివా? మాటలవరుసను నా ప్రస్తావము కూడ వచ్చినదా యేమి?

దానే — లేదు. ఆతఁడు తన మరణశాసనమునందు నీ కిరువదివేల రూపాయల నిచ్చునట్లు వ్రాసి యున్నాఁడు. ఈసంగతి నేనిప్పుడే పత్రికయందుఁ జదివితిని. అందు నీపేరును, నప్పుడు జరగిన యుపకారమును కూడ వ్రాయఁబడియుండెను.

క్షితీ — ధన్యహృదయుఁడు! ఈ సామాన్యవ్యక్తిని, అప్పుడు చేసిన సామాన్యోపకారమును మరణకాలమువఱకును స్మృతియం దుంచుకొన్నాఁడు! ఎంత యుత్తముఁడు!

దానే — రమ్ము! లోనికి రమ్ము! అక్కడఁ బెద్దన్నయ్య, విష్ణునాన్నగారు మొదలగువా రందఱును గూర్చుండి యున్నారు. వారిని దర్శింపుము! అమ్మ కగపడుము. ఆమె నీకొఱకుఁ దల్లడిల్లిపోవుచున్నది. తరువాత భోజనము చేసి నీవును నేనును గలకత్తాకుఁ బోవుదము! పోయి నీకు రావలసినసొమ్ము రాఁబట్టుకొనుటకుఁ బ్రయత్నించి తీసికొని వత్తము.

క్షితీశుఁడు దానేశుని వెనుకనే దర్శనగృహమునకుఁ బోవఁదొడంగెను. ద్వారము నొద్ద చేరినంతనే దానేశుఁడు బాష్పరుద్ధకంఠస్వరముతో "పెద్దన్నయ్యా! చిన్నన్నయ్య వచ్చినాఁడు!" అని

కేక వైచెను "క్షితీశుఁడా!" అని యతీశచంద్రుఁ డొక్కఁయుదుటన లేచి వచ్చెను. క్షితీశుఁ డాతనికి సాష్టాంగప్రణామము గావించెను. ఉభయులును బరస్పరప్రేమాలింగనములఁ గావించుకొని కన్నీరు విడిచిరి. అప్పు డాస్థల మంతయు నానందోచ్ఛ్వసిత మయ్యెను. రామప్రాణబాబును, విష్ణుసర్కారును బరమానంద భరితులైరి. తరువాత క్షితీశుఁడు మందిరమునఁ బ్రవేశించి మాతృచరణవందనము గావించెను. అప్పుడు రుద్ధాశ్రుజలములచే రమాదేవికి దృష్టిరోధ మయ్యెను. చిరసంచిత మగు దుఃఖజలప్రవాహ మొక్కసారిగాఁ బొంగి పొరలివచ్చి యామెకన్నులను నింపివైచెను. తుద కామె క్షితీశుని మస్తకమునఁ జేతులతో దువ్వుచు నాశీర్వాదము చేసెను.

రామప్రాణబా బెంతటి విచక్షణుఁడో, యెంతటిసద్వివేచకుఁడో యాతని గృహిణికూడ నట్టిదియే. ఇంతటి దీర్ఘ వియోగానంతరమున దంపతుల కొకసారి కలిసికొనవలయు నను నభిలాష విశేషించి యుండుననియు, తన యిల్లు పరాయి దగుటచే వారికట్టి యవకాశము, స్వేచ్ఛ కలుగదని వారు శంకింతు రనియు నామె గ్రహించెను. వెంటనే క్షితీశుని లోనికిఁ దీసికొని రమ్మని వారిదాసి నిస్తారిణినే పంపించెను. దాసి క్షితీశుని గాంచి "మీరొకసారి లోనికి రావలయును!" అని పిలిచెను.

క్షితీ — నన్నే పిలుచుచున్నావా ? — నీవు పొరపాటుపడితివేమో !

దాసి — నేను పెద్దమనుష్యులయింటి దాసిని — పొరపాటుపడు నిమిషము నా కెప్పుడును తటస్థింపలేదు ! మీరే రావలయును. మిమ్ములనే పిలుచుచున్నారు.

క్షితీశుఁడు లోపలఁ బ్రవేశించెను. పిచ్చిదానివలె శివమోహిని పరుగెత్తుకొని వచ్చి యూతని చరణతలమునఁ బడిపోయెను. ఆమె యాతని పాదములు పట్టుకొని యేడ్చుచుఁ గంపితకంఠముతో "నన్ను మీరు దయ యుంచి క్షమించెదరా ?" అనియెను.

క్షితీ — శివూ! నీవా? నన్ను నీవు క్షమింపఁ గోరుచున్నావా? మీా యన్నగారు భాగ్యవంతుఁడు! నేను దరిద్రుఁడను. నా చెంతకు వచ్చుట మీావంటివారికి లోకువ — అసహ్యము — అవమానము —

శివ — నే నాఁడుదానను. బుద్ధి లేనిదానను. ఇట్టి నేను ముందుగా నింతవఱకు వచ్చు నని గ్రహింపలేకపోయితిని. స్వామిచరణచ్ఛాయ యందే సతీమణి సకలసుఖములు నాశ్రయించి యున్న వనియు, స్వామి యనుగ్రహావీక్షణము నందే సతీమణి యిహపరకష్టసుఖము లాధారపడి యుండు ననియు నేను మొట్టమొదట దెలిసికొనలేక పోయితిని. నేను మీా యాశ్రితురాలను; సేవకురాలను; బుద్ధి లేనిదాననగు నన్ను మీారు క్షమింపవలయును. "క్షమించితిని శివూ!" అని మీారు పూర్వ స్వాభావికం బగుప్రేమమయ కంఠస్వరముతో నను గ్రహింపవలయును.

క్షితీ — శివూ! నీకీమాట లన్నియు నెవరు పాఠము చేయించిరి?

శివ — కాదు స్వామీా! ఇవి కేవలము ముఖస్థము లైనమాటలు కావు! ఇవి యన్నియును నా ప్రాణాంతరమునందలి వచనములు! ఇప్ప టికి నాకు మీావియోగ మన నెట్టిదుస్సహ మైనదో తెలిసినది! అత్త వారియి ల్లనిన నెంతటి మాహాత్మ్యము గలదియో తెలిసినది! అందు చేతనే నేనిప్పుడు పుట్టినిల్లు విడిచి మనయింటికే వచ్చి యుంటిని. అట్టి సత్కర్మఫలమువలననే నా కిప్పుడు మీా సాక్షాత్కారము లభించినది!

క్షితీ — కాని నేనుమాత్రము మునుపటి దరిద్రుఁడనే!

శివ — మీారు నారాజరాజేశ్వరులు! ఒక్కచీర చించుకొని మన మిరువురమును ధరింతము! ఒక్కపూట వండుకొని మనము మనవా రందఱితోడను గలసి భుజింతము! అదియే మనకు సుఖము! అదియే మనకు గౌరవము! అత్తవారిల్లును, ఆత్మేశ్వరుడు మాత్రమే సుదతికి సుఖగౌరవస్థానములు! ప్రేమానురాగ నిధానములు! పుణ్యపవిత్ర తీర్థక్షేత్రములు!!

అప్పుడు క్షితీశచంద్రుని చిరవియోగ విచారక్లేశము లన్నియు నొక్కసారిగా హృదయమునఁ బొంగిపొరలుటచే నాతఁ డిక సహింపఁ జాలక శివమోహినిని కౌఁగిలించుకొని గులాబిపూవులవంటి యామె గండభాగములందు సతీపతులసమ్మేళన సూచకచిహ్నములను దఱచుగ ముద్రించివైచెను.

## ౭౫

క్షితీశదానేశులు నాఁటి మధ్యాహ్నపు బండిమీఁదఁ గలకత్తాకుఁ బోయి ప్రతికాకార్యాలయమును జేరి యచ్చటివారిని గలిసికొనిరి. అప్పుడు దానేశుఁడు వారికి క్షితీశుని పరిచయము నెఱిఁగించెను. పత్రికాధికారి వారిని "ఎటర్నీ"యొద్దకుఁ బంపించెను. దొరగారి ధనమంతయును నాతనియొద్ద నుండెను. వారచటికిఁ బోయి తమ పరిచయము దెలిపికొని, కలకత్తాలోని యొక పెద్దమనుష్యునిచేఁ గూడ రుజువు చేయించి యిరువదివేల రూపాయలు నాతనియొద్దనుండి దీసికొనిరి. వైద్యాలయ మెట్లున్నదో చూడవలె నని దానేశుఁ డనుకొనెను. కాని యక్కడకుఁ బోయినచోఁ దనయన్న యెదుటనుండగనే యా నిర్భాగ్యురాలు వచ్చి యేమేమిదుర్భాష లాడునో యని శంకించెను. ఆ మరునాఁడు తానే యొంటిగా వచ్చి చూడవలె నని నిశ్చయించుకొనెను.

ఆ సాయంకాలపు బండిమీఁదనే యన్నదమ్ము లిరువురు బయలుదేఱి యథాసమయమునకుఁ గామపురము చేరుకొనిరి. వారు బండిదిగునప్పటి కాకాశము మేఘాచ్ఛన్నమై యుండెను. వారు వచ్చుటకై రామప్రాణబాబు రెండుగుఱ్ఱములను స్టేషనునకుఁ బంపియుండెను. వారా యశ్వముల నధిరోహించి వాయువేగముతో నింటికి వచ్చుచుండిరి. కాని వర్షమునకు ముందుగనే వా రిల్లు చేరఁజాలకపోయిరి. గ్రామమధ్యమునఁ బ్రవేశించు నప్పటికే వర్షారంభమయ్యెను. ఆ వర్షములోనే

యించుక కదలి దేవాలయము నందు వారు తలదాచుకొని యుండిరి. క్రమముగా నురుములు, మెఱపులు నధికమై కుంభవృష్టి గురియ నారంభించెను.

చాల సేపటికి వాన వెలిసి ప్రకృతి సుస్థిరమూర్తిని వహించి యుండెను. కాని మబ్బులింకను బూర్తిగా విడిపోలేదు. కొంచెము కొంచెముగా జినుకులు పడుచుండెను. నడుమ నడుమ మెఱపులుకూడ మెఱయు చుండెను. ఆ యన్నదమ్ము లిరువురు నింకను దేవాలయము నందే యుండి ప్రసంగవశమునఁ బాంచకడీ మరణముం గూర్చి చెప్పుకొనుచు విచారించుచుండిరి.

ఆకస్మికముగా వెలుపలనుండి "ఈ దేవగృహమునం దెవరున్నారు? అయ్యా! కొంచెము తలుపు తెఱువుఁడు! నేను చాలగాఁ దడిసిపోయి బాధపడుచున్నాను!" అను కేకలు వినవచ్చెను. క్షితీశుఁ డా కేకలు విని విస్మయ చకిత నయనములతో దానేశునిం గాంచుచు చంచల గళ స్వరముతో "దానేశా! దానేశా! అది మన పాంచకడీ కంఠమువలె లేదా?" అనియెను. దానేశుఁ డాత్రముతో లేచి పోయి తలుపు తెఱ చెను. దేవగృహము నందలి దీపకాంతి వెలుపలికిఁ బ్రసరించెను. ద్వారము నెదుట నభావ్యము, నచింత్యము, నద్భుతము నగుదృశ్యము! భయవిస్మయములతో క్షితీశదానేశు లిరువురును గంపితులై పోయిరి. ఆ ద్వారము నెదుట పాంచకడీ!—అతని చంకను జిన్ని శచీశుఁడు! ఇరువురును దడిసి పోయి యుండిరి — ఈ దృశ్యము స్పష్టముగా వారి కగపడెను.

అప్పుడు దానేశుఁడు కంపితకంఠస్వరముతో "పాంచకడీ! మేమిప్పుడు మీ ప్రేతమూర్తులను గాంచుచుంటిమా యేమి? మీరిరువురును పర లోకమునుండి వచ్చి యిట్లు మాకన్నులఁబడి యేల భ్రమింపఁ జేయు చున్నారు?" అని ప్రశ్నించెను. పాంచకడీ పెద్దపెట్టున నవ్వుచు "కాదు దాదా! మీరీగ్రామమునం దున్నట్లువిని కలకత్తానుండి యిక్కడకు

వచ్చితిని. నా చంకనున్న వాఁడు శచి! అంతయుఁ దనవాత జెప్పెదను. మేమిపుపురమును వానచేఁ దడిసి పోయితిమి. మీయుత్తరీయము నొక సారి యిందు! శచియొడ లంతయుఁ దుడిచి యాతనికిఁ జుట్ట బెట్టెదను.” అని చెప్పుచు లోపల ప్రవేశించి శచీశుని క్రిందికి దింపెను. దానేశుఁడు కంపితకరములతో శచీశుని స్పృశించెను. అటనుండి శచీశుఁడు పరుగెత్తు కొని పోయి క్షితీశుని గాఁగిలించి యొడిలోఁ గూరుచుండెను. బాలుఁడగు శచీశుఁడు దానేశు నంతిగా నెఱుఁగఁడు. ఆవచ్చిన యిరువురి శరీరము లును రక్త మాంసాస్థి మేదో మస్తిష్క సమన్వితములే యనియు, ఛాయామయము లగు ప్రేతమూర్తులు గారనియు వారు స్పష్టముగా గ్రహింపఁ గలిగిరి.

అప్పుడు దానేశుఁడు “ప్రియుఁడవగు తమ్ముఁడా! పాంచకడీ! నేనేమి కల గనుచుంటినా?” అనియెను.

పాంచ — లేదుదాదా! ఇది కల గాదు. నేను మరణింపలేదు. యూధిక నన్నుఁ జంపింపవలె నని దుస్తంత్రము పన్నినది. రాజాసాహేబు తన వంటవానికి రెండువేల రూపాయల నిచ్చెద నని చెప్పి నన్ను జంపుభార మాతనిపైఁ బెట్టెను. కాని యాతఁడు బ్రాహ్మణుఁడు! హత్యచేయకుండఁ గనే రెండువేలను దీసికొనవలె నని యాతఁడు నిశ్చయించుకొని యర్ధ రాత్రివేళ నేను శయనించుగదిలోఁ బ్రవేశించి, నన్ను లేపి “నీవు కొన్నాళ్ళవఱకు నెటకేని బోయి యుండుము! యూధిక పగనుండి నీకు రక్షణము లేదు” అని చెప్పెను. నేనందు కంగీకరించితిని. నా మూలమున నీకు గూడ నెట్టి యనిష్టము కల్పించునో యనికూడ భయ పడితిని. అప్పుడు నన్నాతఁడా యింటనుండి పంపివైచి యొక మేకను గోసి యారక్తముతో నాపడకను దడిపి యింటయం దంతటను రక్తము చల్లి యా ఛాగ శరీరమును దీసికొని పోయెను.

దానే — ఎంతపని చేసినాఁడు! ఇప్పు డాబ్రాహ్మణుఁ డెక్కడ నున్నాఁడు?

పాంచ — ఆతఁ డా మరునాఁడే రాజాసాహేబునొద్ద సొమ్ము దీసికొని సుఖముగా స్వదేశమునకుఁ బోయినాఁడు.

దానే — సరే. తక్కినవిషయములం గూర్చి తర్వాత మాటాడు కొందము. ఈశచి నెట్లు పడయఁ గలిగితివి? వీని మృతకళేబరమును శ్మశానమునఁ బారవైచి వచ్చినట్లు నేను విని యుంటినే!

పాంచ — ఔను! ఆ సంగతికూడఁ జెప్పెదను. ఆ వంటవాని యాలోచననంగీకరించి నేనారాత్రియే యటనుండిబయలుదేఱి శియాల్దా స్టేషనునకుఁ బోయితిని. ఈ బండిమీఁద నింటికిఁ బోవుదమా యని యాలోచించితిని. అక్కడకుఁ బోయినను శాంతి యుండ దనియుఁ, గొంతకాలము దేశసంచారము గావింపవలయు ననియు భావించితిని. కాని పోవుట యెక్కడకు?—అప్పు డాస్టేషనును విడిచి యిసుకతిప్పలవైపు నకుఁ బోయితిని. అచ్చటనున్న కాలవయొద్దుననే తిరుగుచుంటిని. అప్పు డొక పెద్దమనుష్యునితో నాకుఁ బరిచయ మాయెను. ఆతఁ డాయడవి యొద్దనుండియే పోవలసి యుండెను. ఆతఁడు పడవను గుదుర్చు కొనుటకుఁ బ్రయత్నించుచుండెను. నేను గూడ నాతనితో వచ్చెద నని చెప్పితిని. అందు కాతఁడు నంగీకరించెను. ఒకపడవ మాటాడుకొని యిరువురము దాని నధిరోహించితిమి. పడవ యరణ్యాభిముఖముగాఁ దరలి పోవుచుండెను.

సంగ్రామపురమును గూర్చి మీరు వినియున్నారా? అచ్చట యశోహరప్రభు వగు ప్రతాపాదిత్యునకును, ఢిల్లీచక్రవర్తి సేనలకును పూర్వము ఘోరయుద్ధము జరిగినది! అప్పుడు ప్రతాపాదిత్యునికే విజ యము లభించెను. మాపడవ యాపురమును విడిచి పయన మగు చున్ననాఁటి రాత్రియే ఝంఝామారుతముతో గొప్పవర్షము కురియఁ దొడంగెను. ఆ దుర్యోగమునందు మాపడవ నదిలో మునిఁగిపోయి నది. ఆ పెద్దమనుష్యుఁడును, బడవవాండ్రు నప్పు డెక్కడకుఁ గొట్టుకొని

పోయినో తెలియదు. నేనుమాత్ర మీఁదుకొనుచు నెట్లో యొడ్డు చేరితిని. ఆప్రదేశ మంతయును భయంకరమహారణ్యము! నలుదెసలనుండియు వన్యజంతువుల దారుణ ధ్వనులు వినవచ్చుచుండెను. అప్పుడు నేను జీవితాశ వదలుకొని యాయడవిలోఁ బడి పోవుచుంటిని. కొంతదూరమునం దించుక వెలుఁగు నా కగపడియెను. అచ్చట నెవ్వరైన మనుష్యులు కూడ నుండవచ్చు నని నా కాశ కలిగెను. ఆ యుత్తరక్షణమునందే యొకఘంటానాదము వినఁబడెను. నేనించుక ధైర్యము తెచ్చుకొని యా వెలుఁగువైపునకు లక్ష్య ముంచుకొని పోయి యచ్చోటు చేరితిని. అచ్చట నొకదేవమందిర మగపడియెను. మందిరద్వారము తెఱచియే యుండెను. ఆ వెలుగునఁజూడఁగా లోపలఁ గాళీవిగ్రహము నాకంటఁ బడెను. ఆ తేజోమయ దివ్యమూర్తి యెదుటఁ బద్మాసనస్థుఁడై యొక సన్యాసి యాదేవిని బూజించుచుండెను. అగరుధూపములయు, కర్పూర దీపములయు, పరిమళములు దిగంతవ్యాప్తము లగుచుండెను. నేనును లోపలికిఁ బోయి భక్తిపులకితగాత్రుఁడనై మాతృచరణముల సన్నిధిని ప్రణామము గావించితిని.

దానే — మనశ్చీటిఁ దేవిధముగా, నెచ్చట దొరకెనో యావిషయ మింకను జెప్పితివికావు.

పాంచ — ఆవిషయమే చెప్పుచున్నాను. చాలసేపటికి నాసన్యాసి ధ్యానమును విడిచి ప్రకృతిస్థుఁడయ్యెను. నేను తడిబట్టలతోఁ బ్రక్కగాఁ గూర్చుండి యుంటిని. ఆతఁడు నావంకఁ జూచి నాపరిచయము నెఱుంగఁ గోరెను. నేను నాచరిత్ర మంతయుఁ దెలిపితిని. ఆ మందిర పార్శ్వమునం దింకొక గృహమున్నది. సన్యాసి పిలిచినంతనే యా యింటినుండి యొక మనుష్యుఁడు వచ్చెను. సన్యాసి యాతనిచేఁ బొడి బట్టలను దెప్పించి నా కిప్పించెను. నే నార్ద్రవసనములను ద్యజించి, వానిని గట్టుకొని సన్యాసి యనుగ్రహించిన కాళీప్రసాదమును భుజించితిని.

తరువాత నచ్చటనే నిద్రించి యారాత్రి గడపితిని. మఱునాఁ డుదయమున లేచి సన్యాసియొద్ద సెలవుగైకొని పోవలయు నని యాతనికడకుఁ బోయితిని. ఆతనిసమీపమునందే మనశచీశుఁడు !! చూచి నాగుండె గుభిల్లు మనియెను. 'ఈతఁడు మాశచీశుఁడు' యని ప్రశ్నింపఁదలఁచితిని గాని యట్లు ప్రశ్నింపకముందే శచీశుఁడు "చిన్ననాన్నా !" అని పిలుచుచు నొక్కయుదుటున వచ్చి నామెడఁ గౌఁగిలించుకొని "ఇంటికి బోవుదము పద!" అని తొందరపెట్టెను. మఱియు నేడువ నారంభించెను.

ఇది యెంతటి విస్మయకర సంఘటనమో చెప్పవలయునా ? ఆ బిడ్డ మృతకళేబరమును నేనే నాచేతులతో శ్మశానమునం దుంచివచ్చితిని. ఆ బిడ్డయే బ్రదికి వచ్చి "చిన్ననాన్నా ! ఇంటికిఁ బోవుదము పద !" యని నన్నుఁ గౌఁగిలించుకొని యేడువఁదొడంగెను ! అతిదూర మగు విజనారణ్యమునందు — కాళీమందిరమునందు — ఒకసన్యాసిప్రక్కను — ఎట్లు వచ్చి శచీశుఁడు నాకంటఁబడియెను !

నేను సన్యాసి పాదములపై బడి విస్మయ గద్గద కంఠముతో నీ యద్భుత సంఘటనముం గూర్చి ప్రశ్నించితిని. సన్యాసినవ్వుచు "తల్లి మహాకాళి యిచ్ఛామయి ! ఆదేవి యెట్టిసంకల్పముతో నెట్టి యద్భుత కృత్యములను గావించునో యెవ్వరు నెఱుంగఁజాలరు. మీయన్నబిడ్డ యగు నీతని మీరు శ్మశానమున విడిచి పోయిననాఁడు నేనా శ్మశానము నం దుంటిని. నేను దేశసంచారము చేసి యానాఁటికి మీగ్రామ సమీపమును జేరి యారాత్రి నేనచ్చట నమావాస్యారాధనము గావించు చుంటిని. అప్పుడు నాకొక శవదేహము కావలసివచ్చెను. వర్షముమూలమున మీరు వెడలిపోయినప్పుడు నేనీ బిడ్డకళేబరమును దీసికొని పోయితిని. ఎత్తి చూచునప్పటి కింకను వీని శరీరమునం దపాన వాయు సంచాలన మగుచునే యుండెను. ప్రాణవాయువు మాత్రము పోయి యుండెను. కాని, త్రాచుగట్టి యెగురవైచిన ఢేగను త్రాడుతో నెట్లు

ద్రింపవచ్చునో యట్లే యపానవాయు సాహాయ్యముచే నెగసిపోయిన ప్రాణవాయువుల నాకర్షింపవచ్చును. సర్పవిషముచే నీతని ప్రాణములు పోయినవి. నాకు సర్పవిషచికిత్స తెలియును. దానికి దగిన మందు నాకు సమీపముననే లభించెను. దానిం గైకొని చికిత్స చేసితిని. పిల్లవానికి ప్రాణము వచ్చెను. అప్పుడు నేను మీ యూరువచ్చి మీసంగతి తెలిసికొని మీబిడ్డను మీకిచ్చివేయవలె నని యనుకొంటిని. కాని, మీరు వీనిని జచ్చినట్లుగానే భావించి వీనితోడి సంబంధమును ద్యజించి కొనియే పోయితిరి. అందుచే వీనిని మీకియ్యకున్నచో నాకు దోషము లేదుగదా యని మరల దలంచుకొంటిని. ఇంతేగాదు. నాకొకపిల్లవాఁడు కావలసియుండెను. నేను మాతృదేవి సేవకుఁడను. నాయనంతరమున నింకొక సేవకుఁడు గావలసిన యావశ్యకత యున్నది. అందుచే నీ పిల్లవానిని బెంచి, పెద్దవానిని జేసి యుక్తకాలమునఁ దంత్రదీక్షితుని జేసి, నా తరువాత వీనినే కాళీసేవకునిగా నియోగించి శరీరత్యాగము చేయవలె నని నిశ్చయించుకొని వీనిని నావెంట దీసికొని వచ్చి పెంచుచుంటిని'' అనిచెప్పెను.

నేను మరల నాతని పాదములపైఁ బడి పొరలుచు "ప్రభూ! మీరీ బిడ్డను బ్రదికించితిరి. ఈతని ప్రయోజనముకొఱకు నేను నా జీవితమును మీకు సమర్పించుకొందును. వీని నెట్లయిన మాయింటికి గొనిపోవుట కనుమతి దయచేయఁగోరెదను. ఈబిడ్డ మాకుటుంబ సర్వస్వమై యున్నాఁడు!'' అని ప్రార్థించితిని. సన్న్యాసి యశాంతదృష్టులతో హసించుచు "ఔరా! మాయాపు లగుమానవు లెంతటి భ్రాంతులు! ఎవ్వరి కెవ్వరున్నారు? ఈశచి మరణించెను. ఎవ్వరును వీనిని బ్రదికింపఁ జాలరుగదా! మరలఁ బ్రతికినాఁడు! మీయేమపు వలనఁ గాని, యత్నమువలనఁ గాని బ్రదుకలేదుగదా! ఇట్టిస్థితిలో నీకు మమకార మెందుకు? ఈ యజ్ఞాన మెందుకు?'' అనియెను. నేను నిరుత్తరుఁడ నై

పోయితిని. అప్పుడు సన్యాసి "సరే! నీవు నీ బిడ్డను దీసికొని పొమ్ము నేనును బోయెదను" అనియెను.

నేను — ప్రభూ! ఎచ్చటికిఁ బోయెదరు?

సన్యా — ఎచ్చటికా! పరలోకమునకు! నేనీరాత్రియే యీమానవ శరీరమును త్యజించి వైచెదను. నాకీజన్మమునఁ బరమాయువు నిండిపోయినది. నేనీబిడ్డ నింతవఱకును బెంచితిని. కావున వీనికిఁ గొంత సామిప్యమయఁ దలఁచితిని.

నేను — ఈబిడ్డ మీదాసుఁడు! మీ యిచ్ఛానుసారము చేయ వచ్చును. కాని నాకుఁ జాల విచారముగా నున్నది. మీ శరీరత్యాగ విషయమును విని నాగుండెలు తల్లడిల్లి పోవుచున్నవి. నా ప్రాణములు సంచలించి పోవుచున్నవి. మీ చరణయుగళము నాశ్రయించి మీకటాక్షమువలనఁ దాంత్రికయోగోపదేశముం గాంచవలయు నని నే నభిలషించుచున్నాను.

సన్యా — సరే! నేను నిన్నిప్పుడే దీక్షితునిగాఁ జేసెదను. ఈ దేవీ సేవ యంతయు నీమీఁదనే యుంచి పోయెదను. ఈ దేవియు ద్దేశము కూడ నదియే యని తోఁచుచున్నది. అందుచేతనే తలఁపని తలంపుగా నీ విచటికి యుక్తసమయమునకు వచ్చి యుంటివి.

నేను — మీయాజ్ఞవలన నాదేహ మంతయు నానందపులకిత మగు చున్నది. కాని నేనిప్పు డొకటి రెండుమాటలు మనవి చేయుదును.

సన్యా — చెప్పుము!

నేను — మొదటిమాట — మీమాటలనుబట్టి చూడఁగా మృత్యువు మీయిష్టానుసారము వర్తించుచున్నట్లు బోధ యగు చున్నది. కావున మీరింకను గొన్నిదినములు దేహత్యాగము చేయకుండ నుండఁ గూడదా?

సన్యా — మృత్యువు నాయధీనమునందు లేదు. అరిష్ట సూచనలను

బట్టి నాకిప్పుడు మృత్యువు సమీపించె నని తెలిసికొంటిని. *అరిష్టదర్శనము వలన నాకిప్పుడు మరణము సమీపించె నని తెలిసికొనఁగలిగితిని. కాని మఱియొక్క కాలమున జీవాత్మ పితృయానపథమునఁ బోకుండ దేవయానపథమునఁ బోవుటకై యోగావలంబనము గావింపవలయును. కావున నేను సాయంకాలమునకు దరువాత యోగావలంబనము గావింతును. తెలిసినదా? ఇఁక నీవు చెప్పఁ దలఁచిన రెండవమాట యేమి?

నేను — నేను మీయొద్ద దీక్షితుఁడనై మీవలెనే మాతృచరణసేవ గావించుచుండెదను. ఇదియే నాజీవితమునకు సార్థకసాధన! కాని ప్రభూ! మీవలె నాకెట్టియైశ్వర్యమును లేదు. అట్టి నేనీ నిర్జనమహారణ్యమునం దుండుట కనకాశ మెట్లుండును?

సన్యా — ఇప్పు డీయిచ్ఛామయి యగు దేవి లోకాలయమునఁ బ్రవేశింపఁ దలఁచి యున్నట్లు నాకు బోధ యగుచున్నది. నీవీమూర్తిని దీసికొనిపోయి మీయింటనే ప్రతిష్ఠించుకొనుము! రమ్ము! నేనీ శచీశున కీయఁదలఁచిన ధనమును, విశ్వమాత యగు నీదేవిధనమును జూపించెదను రమ్ము! —

అని యాతఁడు నన్ను వెంటఁ బెట్టుకొని యతిసాంద్ర మగు మహారణ్యమధ్యమునఁ బ్రవేశించెను. అచ్చట నొకపురాతన వృక్షమూలమునఁ ద్రవ్వి చూపించెను. అందేడు బిందె లున్నవి! వానిఁ జూపి యా సన్యాసి “ ఇందైదుబిందె లీదేవివి! తక్కినవి రెండును నావి. వానిని శచీశున కిమ్ము! తక్కినయైదింటిని నీవు తీసికొనిపోయి దేవిసేవ కుపయో

---

*మరణమునకుఁ బూర్వమందే కొంచెము కొంచెముగ స్వాభావిక వైపరీత్యములు కాన నగుచుండును. వానితోఁ గూడ వివిధశారీరిక మానసిక వికారములు మార్పు నందుచుండును. ఆ వికారములును, ఆ మరణ లక్షణములు సంచయును గ్రహింపలేరు. కాని సాధకు లగువారు, యోగు లగువారును మాత్రమే వాని నెఱుంగుదురు. అట్టి వికారములును, అట్టి మరణలక్షణములును, తంత్ర శాస్త్రపరిభాషను బట్టి “ అరిష్టములు” అను నామమున వ్యవహృతము లగుచుండును.

గింపుము ” అని చెప్పెను. తరవాత వాని నెప్పటివలె మూసివైచి మరల దేవీమందిరసన్నిధానమున కిరువురమును వచ్చితిమి. అంత సన్యాసి నాచే స్నానము చేయించి మాతృచరణసన్నిధానమునఁ గూర్చుండఁజేసి నాకుఁ బూర్ణాభిషిక్త దీక్షాప్రదానము గావించెను. అప్పుడు నేను నవజీవన లాభముం గాంచఁగలిగితిని.

తరువాత మాతృపూజను ముగించి నాపేరు, నాతండ్రిపేరు, నా యూరు, మున్నగువిషయముల నాయన కెఱిఁగించితిని. పిమ్మట సన్యాసి యెక్కడకుఁ బోయెనో కాని సాయంకాలమునకు ముందే తిరిగి వచ్చి యొకరిజిస్టరీదానపత్రమును నా చేతి కందించెను. అందా దేవతను, దేవీధనమును నాయధీనము గావించినట్లు లిఖింపఁబడి యుండెను. సాయంకాలమునకుఁ దరువాత దేవికిఁ గర్పూరహారతి నిచ్చి, సంధ్యా భోగమును స్వహస్తములతోనే దేవికి నివేదించి నాపరమగురుఁడు — దేవీసేవకుఁ డగుసన్యాసి పద్మాసనాసీనుఁడై యోగము నవలంబించి యుండెను. రాత్రి రెండుజాముల వేళ నాతని పవిత్రాత్మ యా భౌతిక దేహమును ద్యజించి మాతృధానమును జేరుకొనియెను. మఱునాఁటి యుదయముననే నేనాయనపావన దేహమునకు సత్కారముగావించితిని. పిమ్మట శచీశుని, కాళీమూర్తిని, ధనమును నింటికిఁ దీసికొనిపోవుట యెట్లని యాలోచించి, తుదకు పోలీసువారిసాహాయ్యమును బడసి, యా ధనము నంతను వారికొప్పగించి నేను శచీశు నెత్తికొని కలకత్తాకుఁ బోయితిని. అచ్చట నీతో నాలోచించి యాధనము దీసికొనిపోవుటకుఁ దగిన యేర్పాటు చేయింపవలయు ననుకొంటిని. ఇదికాక యచ్చటఁ బడవ కూడ దొరకినది కాదు. కలకత్తాయందైన నొకపడవ మాటాడుకొని యున్నిటిని దీసికొనిపోవచ్చు ననికూడఁ దలంచితిని. కలకత్తాలో మన యింటికిఁ బోయినప్పుడు నీవు కామపురపుజమీందారగు రామప్రాణ బాబుగారి గృహమునకుఁ జికిత్స చేయుటకై పోయితి వని తెలిసినది.

యూధిక సొమ్ములు విడిచి తన తల్లియింటికిఁ బోవుట ! పోలీసులు రాజాసాహేబు ననేకవిధముల నిర్బంధించుచుండిరి. ఒకపెద్దమనుష్యుఁడు నామూలమునఁ గష్టపడుటను సహింపఁజాలక నేను పోలీసువారికడకుఁ బోయి, నేను మరణింపలేదని యెల్లవృత్తాంతమును వారికి నివేదించితిని. ఖూనీయే యసత్యమైనప్పు డిఁక రాజాసాహేబునకు భయ మేమున్నది. అంతయు మీతో మనవిచేసితినిగదా ! అనంతరకర్తవ్య మేమియైనా మీరే యేర్పాటు చేయవలయును. చిన్నన్నయ్యా ! మీ రెప్పు డిచ్చటికి వచ్చితిరి ?

క్షితీ — నేను ప్రాతఃకాలముననే యిటకు వచ్చితిని. ఆ సన్యాసికుర్ర ధనమును పోలీసులకుఁ జూపించియే వచ్చితివా !

పాంచ — లేదు.

క్షితీ — కేవలము నేనే కాదు. అమ్మ, పెద్దన్నయ్య, పెద్దవదినె, చిన్నవదినె, మీ చిన్నవదినె, మామగారుదలు - అందఱు నిచ్చటనే యున్నారు.

పాంచ — ఎందుచేత ?

క్షితీశుఁ డన్ని సంగతులును దెలియఁజేయుచుఁ దనకు దొరగారివలన లభించిన యిరువదివేలరూపాయల సహాయమునుగూర్చికూడఁ దెలిపెను. అంతయు విని పాంచకడీ యానందముతో "జగన్మాత విశ్వమునందలి జీవలోకము నంతను నేవిధముగ నాడించి పరిభ్రమింపఁజేయుచుండునో యెంత యాలోచించినను గ్రహింపఁజాలము. వెన్నెలవెలుఁగు కానవచ్చుచున్నది. వాన వెలిసినది. రంగు పోవుదము. పుత్రశోకతప్త లగుతల్లిదండ్రులయొడిలో నీశచీశు నెప్పుడు చేర్తునా యని కుతూహలపడుచున్నాను" అని చెప్పి పాంచకడీ శచీశు నెత్తుకొనెను. అప్పుడు ముగ్గురుసోదరులును రామప్రాణబాబుమందిరమునకుఁ బోయిరి. మరణించిన శచీశుని మరలఁ బడసి యెల్లయద్భుతసంఘటనములను విని

యచ్చట వారికుటుంబమువా రందఱు నెంతటి యానందముచే నుచ్ఛ్వసితులై పోయిరో లిఖితరూపమున స్పష్టముగాఁ బ్రదర్శించుట కవకాశము చాలదు. ఎట్టిమాటలు నప్పటియానందమును బ్రకటింపఁజాలవు. ఆ యానందమును మాపాఠకు లెవరికి వారే భావించుకొని యనుభవము చేతనే గ్రహింపవలయును.

రామప్రాణబా బారాత్రియే రెండుపడవల నేర్పాటు గావించెను. యతీశుఁడు క్షితీశుని, పాంచకడీని వెంటఁబెట్టుకొని పోయి, యా మహారణ్యమును బ్రవేశించి యందలి కాళీమూర్తిని, తనరత్నములను దన యింటికిఁ దీసికొని రావలెనని యాపడవల నధిరోహించి బయలు దేఱెను. పోవునప్పుడు శచీశుఁడు పాంచకడీతోఁ దానును వచ్చెద నని పట్టు పట్టెను. అప్పు డాతనితల్లి గౌరాంగి, పాంచకడీ నుద్దేశించి "బాబూ! వీనిని నీవే తీసికొని పొమ్ము! శచి మావాఁడు కాఁడు! నీవాఁడే! మావాఁడనుకొని మమకారముచే మేము వీని నొకసారి పోఁగొట్టుకొంటిమి. నీవేచచ్చినబిడ్డను మరలఁబ్రదికించి తీసికొని వచ్చితివి. ఇఁక మావాఁడని చెప్పి యెట్టియనర్థమును గల్పించుకొనఁ జాలము. ఈ బిడ్డ మీ యందఱివాఁడును! నావాఁడు మాత్రమే యని యిఁక నేనెన్నఁడును ననుకొనఁజాలను." అని జాలి పుట్టునట్లు స్వయంకృతాపరాధమును వెల్లడించుచుఁ బశ్చాత్తప్తచిత్తముతో వచియించెను. ఏమైన నేమి-శచీశుఁడు కష్టపడు నని చెప్పి పాంచకడీ యాతని నెట్లో మఱపించివైచెను. ఇదియంతయును గాంచుచున్న రామప్రాణబా బానంద పులకితుఁడయ్యెను. రెండు మూఁడుదినము లాతనియింట నీవిధముగా శుభసంయోగ మహోత్సవము చెలంగెను. ఆమహోత్సవమునకు "కులపెద్ద" యగువిష్ణుచంద్ర సర్కారు ప్రధానఋత్విజుఁడై యుండెను.

నాలుగవనాఁడు విష్ణుసర్కారు "ఇఁక మన మందఱము నింటికిఁ బోవచ్చును. ఇక్కడ మనకు గంగాస్నానలాభమును, విచ్ఛిన్నకుటుంబ

శుభయోగమును లభించినవి. అక్కడనుండి యతీశుడు మున్నగువారీపాటికిఁ బడవమీఁద నింటికిఁ జేరియుందురు. కావున మనమింకను నిచ్చట నాలస్యము చేయుట యుచితము గాదు!" అని చెప్పెను. ఆమాటలు విని రామప్రాణబాబానందబాష్పపూరితనయనములతో "జగదీశ్వరు సనుగ్రహముచే నీవిధముగా నీకుటుంబమునకు శుభయోగమగు నని యెవ్వరును స్వప్నమందైన భావించి యుండరు. ఇట్టి యసంభావితసంఘటనము పురుషప్రయత్నముచే సిద్ధించునది గాదు. అంతయును బరమేశ్వరీవిలాసము. అందఱికిని గుటుంబకృత్యము లుండును. అందుచేత మీప్రయాణమునకు నేనిప్పు డెట్టియభ్యంతరమును జెప్పఁజాలను. కాని యిట్టియానందమును నే నెన్నఁడును నా జీవితమధ్యము నం దనుభవించి యుండలేదు!" అనియెను.

పిమ్మట రామప్రాణబాబు రెండుపడవలను సిద్ధము చేయించెను. ప్రాతఃకాలముననే గంగాస్నానమును చేసి యందఱును పెందలకడనె భోజనములు గావించిరి. ప్రయాణసమయమునఁ బరస్పరమును బ్రియసంభాషణములతో సెలవు లందుకొనవలయును గావున గృహిణి యగు రమాదేవి రామప్రాణబాబును, ఆతనిభార్యనుగాంచి "అమ్మా! పాంచకడీ కాళీమూర్తిని దీసికొనివచ్చి మాయింటఁ బ్రతిష్ఠించుచని విని యున్నాను. ఎవ్వరిపావనపుణ్యప్రభావముచే మాకుటుంబమున కంతకు నింతటిశుభయోగ మయ్యెనో యట్టిమావియ్యములగుదంపతులు మీ రిరువురును గాళీప్రతిష్ఠగావించుసమయమున మామందిరమును మీచరణములచేఁ బవిత్రముగఁ జేయవలయునని మేమందఱమును, మనఃపూర్వకముగాఁ బ్రార్థించుచున్నాము" అని వేడుకొనెను.

రామప్రాణుఁ డదియు నంగీకరించెను. శాంతిదేవి తనపినతల్లి పాదములకుఁ బ్రణామము గావించి కన్నీరు పెట్టుకొనెను. పినతల్లియు నామె శిరంబును జుంబించి యాశీర్వాదము గావించెను. దానేశుఁడు రామ

ప్రాణునకు వందన మాచరించెను. అప్పుడు రామప్రాణుఁ డొక రిజిష్టరీ దస్తావేజును దానేశునిచేతి కందించెను. అప్పుడు దానేశుఁడు "మామ గారూ! ఇది యేమి?" అని ప్రశ్నించెను.

రామ — అల్లునికీయవలసిన యౌతకధనపత్రము! మీ దేశము నందు నేను గోగ్రాసమునకై కొనిన పదు నేనుగ్రామములు నా జమీందారీకిఁ జేరియున్నవి. వానివార్షికాదాయ మైదువేలకంటె నధికముగనే యుండెను. ఆగ్రామములను నీకుఁ గట్నముగా నిచ్చితిని. అదియే యీదానపత్రము!

దానేశుఁడు విస్మయవిహ్వలుఁడై కృతజ్ఞతాసూచక వీక్షణములతో రామప్రాణునివంకఁ జూచుచు నిలువఁబడిపోయెను. అప్పుడు సమీపమందే యున్న విష్ణుచంద్రసర్కారు "మీవంటి మహాపురుషుల కార్యకలాపములు నిరుపమానములును స్తవనీయములు నైనవి" అని యభినందించెను. రామప్రాణబాబు నవ్వుచు "ఇందు నాగొప్పతన మేమున్నది? నే నీయీవి దారినిపోవువాని కెవ్వనికైన నిచ్చినచో మీ రని నట్లు ప్రశంసింపఁ దగినదే—కుమారుఁ డొక్కఁడు! అతఁడు బ్యారిష్టరుపని చేయుచు నెలకు నాలుగైదు వేలు సంపాదించుచున్నాఁడు. నాకు నలువది వేల యాదాయముగల జమీందారీ యున్నది. అందిరువదియైదు వేల యాదాయముగలగ్రామములను నాపుత్రునికొఱకుంచితిని. నాయిరువురు కుమారికలకును జెరియైదు వేలరూపాయ లాదాయముగల గ్రామముల నిచ్చితిని. వారితోఁబాటు శాంతి దేవికిఁగూడ నీగ్రామము లిచ్చితిని. వీనితో నాపుత్రికలు ముగ్గురికిని బదునేను వేలువచ్చు భూసంపత్తి నిచ్చిన ట్లాయినది!" అనియెను.

పిమ్మట నందఱును నౌకారోహణము గావించిరి. అనుకూలవాయు చాలనమున బడవ పయనము సాగించుచుండెను.

శోణపురము నందలి యా యసంస్కృత శిథిల భవన మిప్పు డానంద కోలాహలములచే మాఱు మొఱయు చుండెను. ఇప్పు డిల్లంతయు బాగుగఁ బరిష్కృతమై, పరిశుభ్రోజ్జ్వల కాంతులచే దేజరిల్లుచుండెను. నలుగురు సోదరులు నేకమనస్కులై గృహకార్యముల నిర్వర్తించు చుండిరి. నలుగురు కోడండ్రు నైకమత్యముతో నెట్టిస్వార్థ పరత్వమును లేక యన్యోన్య సాహాయ్యముతో నింటిపనులఁ దీర్చుకొనుచుండిరి. ఆ దంపతుల ప్రేమవాహిని, యపార కాంతార మధ్యమున నిశ్శబ్దముగఁ బ్రవహించు తరంగిణింబోలి ప్రవహించుచు నామందిరమును బవిత్ర పుణ్యతీర్థముగాఁ బరిణమింపఁ జేయుచుండెను.

ఈసారి పాంచకడీకి పెండ్లిసంబంధము లనేకములు తటస్థించు చుండెను. కాని, పెండ్లి చేసికొనుటకు పాంచకడీ యంగీకరించుట లేదు. ఆతఁడు "విశ్వజనని యగు కాళిక కామినీమూర్తిని బరిత్యజించి మాతృమూర్తితో సాక్షాత్కరించినది. ఇట్టిస్థితిలో వలదు దాదా! నాకు బంధమును గల్పింపవలదు! నేను పూర్ణాభిషిక్తుఁడ నైతిని. తల్లి చరణసేవ గావించుచు నేనుగృతార్థుఁడ నగున ట్లనుగ్రహింపుడు! మనశచియే మన వంశోద్ధారకుఁడు!" అనియెను.

సన్యాసి యిచ్చిన రెండు కలశముల ధనముతోడను యతీశుఁడు భూములను గొనుట కారంభించెను. మిగిలిన పంచకలశ స్వర్ణముద్రలును మాతృమూర్తివి! పాంచకడీ యందుఁ గొంత భాగమును వెచ్చించి యొకవిశాల రమణీయ మందిరమును గట్టించెను. ఆమందిరమునకుఁ జేర్చి అతిథిశాల, దరిద్రనిలయము, చికిత్సాలయము, సభాభవనము మున్నగువానిని గూడఁ గట్టించెను. పాంచకడి స్వయముగా గైరిక వసనధారియై రుద్రాక్షమాలికలను గళమునఁ దాల్చి, విభూతి పూసికొని జటాసమన్వితుఁడై పరమయోగిమూర్తిని ధరించి మాతృసేవ

గావించుచుండెను. దేవీపూజాదిక వ్యయమునకై మిగిలిన ధనముతో నొక జమీందారిని గొని దానిని దేవాదాయముగఁ జేసివైచెను. తాను నిరంతర దరిద్ర సేవావ్రత గ్రహణము గావించి పాటు పడుచుండెను. మఱియుఁ దమ విచ్ఛిన్న కుటుంబమునకు లభించిన శుభయోగస్మృతి శాశ్వతమై యుండుట కామందిర ద్వార పార్శ్వమునందు క్షీరశిలాఫలక ముపై స్వర్ణాక్షరములతో —

## శుభయోగ మిళనమందిరము

అని లిఖింపఁ జేసెను.

ఒక సంవత్సరమునకుఁ దరువాత నామందిరమున మహాసంరంభముతో దేవీపూజా మహోత్సవము లారంభింపఁ బడియెను. ఆ యుత్సవములకు రామప్రాణబాబుకూడ సతీసహితుఁడై వచ్చి యుండెను. రాయ కుటుంబమునకు సంబంధించిన జ్ఞాతిబాంధవు లందఱును, మిత్రు లంద ఱును గూడ నాహ్వానింపఁ బడి వచ్చియుండిరి. వారి చరణుఁడు ఆతని తల్లి ఆతని భార్యయును వచ్చిరి!

రామప్రాణబాబు మాతృదేవతోపాసకుఁడు! ఆతఁ డా పూజా విశేషములం గాంచి మోహితుఁడై పోయెను. మందిర మధ్యమునందు నీలమేఘశ్యామలయు, దిగంబరయు, ముక్తకుంతలయు, కరాళవదనయు, విలోలరసనయు, చతుర్బాహు విలసితయు నగు కాళీమూర్తి! ఆజనని సమ్ముఖమునఁ బద్మాసనస్థుఁడగు నవీన సాధకుఁడు పాంచకడీ! పాంచకడీ కేశములు రూక్షములు; జటలు బద్ధములు; వసనములు గైరిక వర్ణములు — ఆతనియొడలి నిండ విభూతిపూత — గళమున రుద్రాక్షమాలి కలు — కపాలమున రక్తచందనచర్చ! ఆతని దక్షిణపార్శ్వమునఁ బుష్ప పాత్రయందు రక్త శ్వేత పీతవర్ణ కుసుమములు కుప్పలై యుండెను. వామ పార్శ్వమునఁ బూజాద్రవ్యములును, వానికి సమీపమున సుగంధ

వాసిత జల పూర్ణ కలశము నుండెను. నలుదెసలను ఘృత ప్రదీప ములు విరాజిల్లుచుండెను. యజ్ఞధూపము, అగరుగంధ ధూమమును మందిరము నామోదితముగ జేయుచుండెను. వెలుపల నాట్యమందిరము నందు బ్రాహ్మణపండితులు దేవీయజ్ఞము నారంభించి చేయుచుండిరి. కొందఱు హోమములను, గొందఱు పూజలను, గొందఱు జపములను జేయుచుండిరి. కొందఱు కొందఱు ప్రాణాయామ ధ్యానధారణలయందు నియుక్తులై యుండిరి. కొందఱు స్వరలయసంయోగము గావించి చండీ గీతములను గానము చేయుచుండిరి. మందిరప్రాంగణమునఁ గులకాంతల కరతాళధ్వనులును, శంఖారావములును దెసల మాఱుమ్రోగించు చుండెను. సింహద్వారమున వాదకులు వివిధవాద్యములు వాయించు చుండిరి. గాయకులు మలహారిరాగమున మాతృగాథలను బాడుచుండిరి. రామప్రాణబాబు తిరిగితిరిగి వీని నన్నిటిని గాంచి యానందించుచుండెను. అట్లాతఁడు ప్రదక్షిణము చేయుచు నొకచోటఁ గన్నీటితో వక్షము తడసిపోవుచుండ దేవింగూర్చి గానము చేయుచున్న యొకబ్రాహ్మణుని దర్శించెను. ఆతఁ డచ్చట సుస్థిరచిత్తముతో నిలిచి శ్రవణపేయమగు నొక గీతము నాద్యోపాంతముగ నానందముతో నాలకించుచుండెను. ఆ బ్రాహ్మణుఁ డిట్లుపాడుచుండెను —

" మేలుకొనుమమ్మ! కాళీ! క ♦ రాలి! జనని
లేచిరావమ్మ! కులకుండ ♦ లిని! భవాని!
ఎంత దుర్బుద్ధియో, రోష ♦ మెంత గలదొ
ఎంత యుత్సేకమో, కాంక్ష ♦ యెంత గలదొ
విజయమదమత్తులగు దైత్య ♦ వీరులెల్లఁ
బాపచింత నీర్ష్యాద్వేష ♦ పరవశులయి

మనుజదివిజోష్ణరక్త వా ♦ హినులు గొలిపి
కలఁచుచున్నారు జగముఁ బం ♦ కిలముఁ జేసి
మేలుకొనుమమ్మ! కాళీ! క ♦ రాలి! జనని!
లేచి రావమ్మ! కులకుండ ♦ లిని! భవాని!
క్రూరదుర్జయదానవ ♦ వీరసంఘ
మారణోద్యమ ప్రథిత దు ♦ ర్వారశక్తి!
త్రిభువనావని! విశ్వధా ♦ త్రీ! మృడాని!
చరణానమిత త్రిలోచనా! ♦ శ్యామలాంగి!
ఛిన్నమస్త! విపర్యస్త ♦ చికురపాశ!
త్రిపురసుందరి! లలితాంబ! ♦ దేవ దేవి!
ఖండితోద్దండవిమత ప్ర ♦ కాండ! విజయ
సమర తాండవామోదినీ ♦ శయకృపాణి!
మేలుకొను మమ్మ! కాళీ! క ♦ రాలి! జనని!
లేచి రావమ్మ! కులకుండ ♦ లిని! భవాని!"

రామప్రాణుఁ డాగీతము నానందాశ్రువులతో నాలకించి దేవీప్రసాద వితరణమును బరిశీలించుచుండెను. దీనులు, దరిద్రులు మున్నగువా రామందిర మంతటను నిండి యుండిరి. దరిద్రసేవాగృహమునం దన్నపు రాసులు కొండలపొడుగున గూర్పఁబడి యుండెను. జయంతి, గౌరాంగి, శివమోహిని, శాంతిదేవియుఁ బైటచెఱఁగులతో నడుములు బిగించుకొని వంటశాలలో నన్నవ్యంజనాదులు వండి పోయుచుండిరి. యతీశుఁడు, క్షితీశుఁడు, దానేశుఁడును, మిత్రబాంధవసహితులై యెల్ల వారికిని భోజనములు పెట్టుచుండిరి. ఈ విధముగా దేవీయాగ మహోత్సవము కొన్నాళ్ళవఱకును జరిగెను. కుటుంబసహితముగా దేవీదర్శనమున కేతెంచిన బంధుమిత్రు లందఱును క్రమక్రమముగాఁ దమతమ యిండ్లకుఁ బోవుచుండిరి.

నేఁడు రామప్రాణబాబు ప్రయాణము. ఆతఁడా యన్నదమ్ములను ఆయింటికోడండ్రను యజమానురాలిని పిలిచి "ఇఁక నాకింటికిఁ బోవుటకు సెలవిండు! మీతోఁ గలసి నేనిచ్చట సుఖముగనే కాలక్షేపము చేసితిని. కాని నేనింటికిఁ బోక తీరదుగదా! ఎట్లయిన మీకందఱకు నేనొకటిరెండుమాటలు చెప్పఁ దలఁచితిని. మనసుంచి వినవలయును! చూచితిరా! మీలో మీరు స్వార్థపరులై యొకరికిఁ దోఁచినట్లు వారు పోయి పండువంటిసంసారమును పాడు చేసికొంటిరి! అన్నదమ్ములు విడిపోయి యెవరిసంపాదనతో వారు కాలక్షేపముచేయుటయే సుఖముగ నుండు నని దూరదృష్టిలేనికొందఱు కుతూహలపడుచుందురు. కాని యందువలన సుఖ మెంతమాత్రమును గలుగదు. కొన్ని గడ్డిపోచలను జేని దానితో నేనుఁగునైన బంధింపవచ్చును. అట్లే యన్నదమ్ముల యేకీభావముచే నెంతబలమైనఁ జేకూరఁగలదు. మీయీర్ష్యాద్వేషములవలనను, స్వార్థపరత్వమువలననే యిట్టి యున్నతి లభించె నని మీరెంతమాత్రము ననుకొనవలదు. అట్లు భావించినచో మరల నిర్భ్రాంతిలోఁ బడిపోక తప్పదు. ఎన్నఁటికిని మేము విడిపో మనియు నట్టి స్వార్థచింతనమువలననే యిన్నికష్టము లనుభవించితి మనియు, నిదివఱకువలెనే వేఱుపడి యున్నచో నిప్పటిమహోన్నతస్థితి నెప్పటికిని లభింపదనియు జ్ఞప్తియం దుంచుకొనుఁడు! మీ రెట్టిపాపము గావించితిరో దానికిఁ దగినశాస్తి యైనది! పశ్చాత్తాపమువలన దానికిఁ బ్రాయశ్చిత్తముకూడ నైపోయినది. తుదకు మీ రెవరియదృష్టమునకుఁ దగిన ఫలమును వారందఱు గలిగిరి. బిష్టయను శచీశుని మరణము మీ కొక పాఠము నేర్పినది - ఎవరికొఱకు కూడఁబెట్టుట? ఎవరికొఱకు ధనము దాఁచి కుటుంబమువారి సంపదలని గష్టపెట్టుట? ఆతఁడు కాలగర్భమున మునిఁగిపోయెను! ఎంత యేడ్చినను, నెన్ని యత్నములుచేసినను వానిని మరలఁ దీసికొని రాఁగలిగితిరా? — తరువాత నింకొక పాఠము! అదృ

ష్టమే యన్నిటికిని మూలకారణము. ఎవరియదృష్టమునుబట్టి వారి యిష్టఫలములు లభించు చుండును. కాకున్నచో శచీశుఁడు రెండు కల శముల స్వర్ణముద్రలను బడయఁగలఁడా! మీరెవ్వరైన సంపాదించి యింతధనము వీనికిఁ గూడఁబెట్టి యియ్యఁగలరా? — పాంచకడీ మీ వంశమునకుఁ దిలకస్వరూపుఁడు! ఈతని సంయమబలమువలననే మహా రణ్యవాసిని యగు కాళీదేవి మీమందిరాధిష్ఠాత్రి యైనది! ఈతని మాతృపూజాబలమువలననే మీకు విశ్వజననీప్రసాదము లభించినది." అని బోధించెను.

పిమ్మట నందఱును వినీతిహృదయములతో రామప్రాణబాబు చరణ ములకు సాష్టాంగప్రణామములఁ గావించిరి. అంతే నాతఁడు భార్యా సహితుఁడై వారియంపకముం గాంచి పరివారముతోఁగూడఁ బడవ నధిరోహించి స్వగ్రామమునకుఁ బయనము గావించెను.

## 22

పెద్దకోడలు జయంతి సుస్థిరభక్తిభావ హృదయముతో దేవీమందిర కార్యభార మంతయును వహించెను. దేవీభవనపరిచర్యలకై యనేక దాసదాసీజను లున్నను, మందిరమార్జనము, సభామందిర పరిష్కారము, నిర్మాల్యవిసర్జనము, రోగులకుఁ బథ్యాన్నపాచనము, మున్నగుపను లన్నియు నామెయే స్వయముగఁ జేయుచుండెను. పాంచకడీ యీదేవికి నిత్యారాధనము గావించుచుండెను. తనకుఁ దోడుగా నింకొక పూజక బ్రాహ్మణునిగూడ నియోగించుకొనియెను.

ఒకనాఁడు పాంచకడీ దానేశుని బిలిచి "చిన్నన్నయ్యా! ఈదేవి దయవలన వత్సరమున కైదువే లాదాయముగల భూసంపత్తి యేర్ప డినది. ఆశ యనునది చాల చెడ్డది. దాని నెంతవఱకుఁ బొడిగించిన నంతవఱకు వర్ధిల్లుచునే యుండును. తృప్తి యనుమాట యెక్కడ?

ఇంకను "చాకిరీ" చేసి డబ్బు సంపాదించి యేమిచేయుదుము? ఈతల్లి సొమ్ము కొంత తీసికొని నీవు కలకత్తాకుఁ బోయి వైద్యాలయమునకుఁ గావలసినపరికరములు, మందులు మొదలగువానిని గొనితీసికొనిరమ్ము! దేవీదర్శనార్థమై వచ్చుచుండు యాత్రికులలో జబ్బుచేసినవారికిఁ జికిత్సా సేవ గావించుచు ధన్యజీవనమును గడపుచుండుట ధర్మముగాదా? దీన మానవసేవనముకంటెఁ బరమార్థ మేమున్నది?" అని విన్నపము గావించెను. దానేశుఁడు పరమానందముతో నందు కంగీకరించి కలకత్తా ప్రయాణమునకు సంసిద్ధుఁ డగుచుండెను.

ఆ సాయంసమయమున నంతఃపుర మందిరమునకు వచ్చియున్న యాత్మేశ్వరుఁడగు దానేశునిం గాంచి శాంతిదేవి చిఱునవ్వునవ్వుచు, "మీరు కలకత్తాకుఁ బోవుట యీరాత్రిబండిమీఁద నేనా?" అని ప్రశ్నించెను.

దానే — (మందహాసముతో) ఔను! ఏమీ? నాప్రయాణమున కభ్యంతర మేమైన నున్నదా?

శాంతి — అభ్యంతరము లేదు - కాని యొకభయ మున్నది!

దానే — ఎందుకొఱకు భయము?

శాంతి — యంత్రజలముకొఱకు - అది యెంతో పరిష్కృత మైన దఁట గాదా?

దానే — అచ్చటియంత్రజలము పరిష్కృతమైన దనుమాట నిజమే- కాని యంతస్సారశూన్య మైనది! కాని యొడ్లు త్రెంచుకొని రివ్వునఁ బ్రవహించుచుఁబోవునదీజలమువలె నది యిచ్చవచ్చినట్లు పోఁజాలదు!

శాంతి — ప్రియుఁ డగుసముద్రుఁడు దానివంకఁ గన్నెత్తి యొక సారియైనఁ గటాక్షింప కున్నప్పుడు గత్యంతరములేక యాతరంగిణి మహావేగముతో సముద్రాభిముఖముగఁ బ్రవహించి పోక యింకేమి చేయఁగలదు? పోకున్నచో నెవ్వ రాసముద్రుని దనచెంతకు రప్పింపఁ

గలుగుదురు ?

దానేశుఁ డప్పుడా యనింద్యసుందర పులకితగండస్థలమునం దొక ప్రీతిచుంబనముద్ర గావించి నవ్వుచు "వర్షజల మీయమంత్రజలమునఁ బడకయే యున్నచో నాకోటినిర్భాగ్యులదాహము శాంతించుట కవకాశమేమున్నది?" అనియెను.

శాంతి — (నవ్వుచు) మరల నెప్పటికి వచ్చెదరు ?

దానే — రేపటిరాత్రిబండిమీఁద వచ్చెదను.

శాంతి — అక్కడి మీ యా వైద్యాలయమునుగూడ నొకసారి చూచి వచ్చెదరా ?

దానే — ఆ. పోయెదను. అవకాశమునుబట్టి యచ్చటఁగావలసిన యేర్పాటులు చేసి వచ్చెదను.

శాంతి — అట నున్న రోగికి మందులనుగూడ నిచ్చివచ్చెదరా ?

దానే — ఆరోగి కిప్పుడు డాక్టరులమందు లక్కఱలేదు - భూతవైద్యుల మంత్రచికిత్సలును - నస్యములును గావలయును.

శాంతి — ఒకనాఁడె మనశచీశు నెత్తికొని మఱిపోఁగూడదా ?

దానే — బండివేళ యైనది. పోవలయును.

అని చెప్పి దానేశుఁడు వెడలిపోయెను. శాంతిదేవి స్వాశ్రునయనయై శయ్యపై నొరఁగెను. సరిగా తెల్లవారుసరికి దానేశుఁడు కలకత్తా చేరుకొని బౌబజారునకుఁ బోయి చూచెను. ఆతని వైద్యాలయము కేవలము తెఱువఁబడిమాత్ర ముండెను. సేవకుఁ డాతనికి సలాము చేసెను. కాంపౌండరు వందనము చేసి యెదుట నిలువఁ బడియెను. దానేశుఁ డౌషధాలయ పరిస్థితింగూర్చి యాతని నడుగగా "మీరు వచ్చుట లేదు. మీకొకటి రెండుత్తరములుగూడ వ్రాసితిని. వానికిఁ బ్రత్యుత్తరమును లేదు. అందుచేత నిచ్చటి యితరపరిచారకుల నందఱిని సెలవిచ్చి పంపివైచితిని. ఈసేవకునిమాత్ర ముంచుకొని నేనే యా

వైద్యాలయ కృత్యములను గావించుచుంటిని. మా జీతములును, కర్చులును బోఁగా గొంతలాభముకూడ వచ్చినది. మీకుఁ దెలిసియే యుండు ననుకొందును. యూధికాబీబీ యీసమయమందే తనధనమును వస్తువులను దీసికొని యిక్కడనుండి వెడలిపోయినది" అని చెప్పెను.

దానేశుఁడు వైద్యాలయ మంతయును బరీక్ష గావించెను. అందలి మందులును బరికరములును దేవీమందిరమునకు వచ్చురోగులకుఁ జికిత్స చేయుటకు జాలినన్ని యుండె నని యాతఁ డూహించుకొనెను. అప్పు డాతఁడు సేవకుని, కాంపౌండరును దనతో రావలయునని కోరెను. వారందు కంగీకరించిరి. ఆవెంటనే యందలి సమస్త పరికరములను బెట్టెలలోఁ జేర్పించి రైలుపైఁ బంపుటకు సిద్ధపఱుపుఁ డని దానేశుఁడు వారి కాజ్ఞాపించెను. పిమ్మట నాతఁ డొకబండిమీఁద గంగాస్నానార్థము పోయెను. అతఁడు స్నానముచేసి మరల బండిపై నెక్కు చుండఁగా సమీపమందున్న రాధా ఘట్టమునకుఁ బార్శ్వమునఁ గూర్చుండి యున్న యొకయున్మాదిని యాతని కంటఁ బడియెను. అనేకు లగుబాల బాలిక లామెచుట్టును మూఁగి యుండి యామె పిచ్చిని మరింత వర్ధిల్ల జేయుచుండిరి. చూచిన మాత్రముననె యామె యూధిక యని దానేశుఁడు గ్రహింపఁ గలిగెను.

యూధికయే యాయున్మాదిని. ఆమెకన్నులు గుంటలుపడి నిప్పులను వర్షించుచుండెను. మేలిమి బంగరువంటి యామె నెమ్మోనిచాయ మలినపంకిలమై యుండెను. ఆ నవనీతకోమల తనువల్లి శుష్కించి పోయెను. ఆ సాహిత్యవిజ్ఞానము — ఆ రూప రసగంధ శబ్దస్పర్శాది సమస్తేంద్రియ జ్ఞానము — అంతయు విలుప్తమై పోయెను. దానేశుఁ డామె చెంతకుఁ బోయినను నామె గుర్తుపట్టఁ జాలకపోయెను. ఆనవాలే పట్టినచో భావాంతరము గలిగి యొకమాటయైన నాడకుండునా? కాని యామె యాతనితో మాటాడలేదు. సరిగదా! నాతనివంక చూడనే

లేదు. ఆ పావనజలకల్లోలనినాదిని యగు భాగీరథీసైకతమున, బహుజనాకీర్ణ తటసన్నిధానమున నిలువఁబడి యూధికను జూచిచూచి విచారించుటవలన నప్పు డాతనిహృదయమునం దొకతత్త్వజ్ఞాన ముదయించెను. ఆప్రేమ యంతయు నేమైపోయె నని యాతఁడు భావించెను – ఏ రూపమును జూచి, యే గానమును విని, యే బాహ్యగుణములకు ముగ్ధుఁడనై నే నామెను ప్రేమించితినో యా రూపగానగుణములకు స్థిరత్వ మెక్కడ నున్నది? యూధికకు రూప మున్నది; గుణ మున్నది; వయ సున్నది; మనోహరకటాక్ష విలాస మున్నది; వచనమాధుర్య మున్నది – అందుచేతనే నే నామెను ప్రాణాధికముగఁ బ్రేమించితిని. కాని యిప్పు డవి యన్నియును రూపు మాసిపోయినవి, ఆ రూపము పోయినది! ఆ గుణము పోయినది! వానితోఁ గూడ నా ప్రేమయును బోయినది! ఏమిది? ప్రేమకు స్థిరత్వము లేనేలేదా? – గంగాతటము నుండి యలవోక తెమ్మెరలు "తప తప" యని ధ్వనించుచు నాతని ప్రశ్నకు సదుత్తరము నిచ్చెను. ఆపిల్లవాయువులు "రూపము జడము! గుణమును జడమే-చైతన్యస్వరూప మగు నాత్మను జడముతో నాకర్షింప గల సమర్థు లెవ్వ రున్నారు? సుందరవదనముం గాంచి మోహాంధుఁడ వైతివి. బాహ్యగుణములకొఱ కున్మత్తుఁడ వైపోయితివి. ఆరూప గుణములు రెండును జడములే! ప్రకృతియే జడాత్మిక! కొన్ని జడపరమాణువులు జీవాత్మను మోహింపఁజేసి విభ్రాంతిం గూర్పఁగలవా? ఎన్నఁడు నట్లు చేయఁ జాలవు! కాని యీ జడపదార్థాంతరాళము నందు దివ్యమగు నీశ్వరశక్తి నిహితమై యున్నది. అందుచేతనే వానిలో నుండి యీశ్వర సంబంధ మగు ప్రేమవాహిని ప్రవహించు చున్నది. ఓమానవుఁడా! తపస్సు చేయుము! అప్పుడు నీకుఁ బరమేశ్వఁ డొక పెద్దసూదంటురాయి యనియు, మానవులందఱును లోహాణుస్వరూపు లనియు బోధపడఁ గలదు. మానవు లందఱును సర్వథా, సదా

యీశ్వరునిచేతనే యాకర్షితు లగుచున్నారు. అందఱు నాతనిఁ బడయుటకు శక్తిఁగొలఁదిఁ బ్రయత్నించు చున్నారు. కాని రూపరసగంధ స్పర్శ శబ్దమయి యగు ప్రకృతి యాద్వారమున కడ్డపడి యున్నది. ప్రకృతిని నీవెంతకాలము కామినీమూర్తిగా భావించుచుందువో; దాని నుపభోగించుటకై వాంఛించు చుందువో యంతకాలము వఱకును నీవా జడబాహ్యవులచే నాకర్షింపఁ బడి దయారహితుఁ డవై క్షుధాతాశూన్యుఁడవై జ్వాలామయదుఃఖ వేదనల ననుభవించు చుందువు. ఎప్పటికైన నీవు భార్యను మాతృభావమున దర్శింపఁ గలిగినచో నప్పుడే నీకాప్రకృతిబాధ లన్నియు నిశ్శేషములై పోవును. అప్పుడే నీవు స్వరూప ప్రేమయొక్క స్వరూపానందలాభముం గాంచుటకు సమర్థుఁడవు కాఁగలవు!'' అని చెప్పుచుండెను.

ఆగాలి తిరిగిపోయినది! దానేశునిచూపులు యూధికవంకకుఁ దిరిగి నవి! యూధిక కిప్పుడు బాహ్యజ్ఞానమే లేదు. ఆమె తనలోఁ దానే యేమో మాటాడుకొనుచుండెను. ఒకప్పుడు పకపక నవ్వుచుండెను. ఒకప్పుడు గొంతెత్తి యేడ్చుచుండెను. ఒకప్పుడు నిస్తబ్ధ యగుచుండెను. దానేశుఁడు కొంతసేపటివఱకును నిలువఁబడి చూచెను. అంతలో నింత వఱకును గూర్చుండియున్నయూధిక లేచి నిలువఁబడియెను. అప్పు డామె యున్మత్తనయనద్వయమునుండియు నశ్రుధారలు ప్రవహించు చుండెను. ఆమె యున్మత్తవికృతస్వరముతో "పాంచకడీ! ప్రాణ ప్రియుఁడ వగు పాంచకడీ! నేనే నిన్నుఁ జంపుకొంటిని. నేను పిశాచిని! — రమ్ము ప్రియమిత్రమా! రమ్ము! రమ్ము! నాపయ్యెద చెఱఁగు పఱచెదను — నీవిం దాసీనుఁడ వగుము! నేను నిన్నే ప్రేమించి తిని — పువ్వువలెఁ బ్రేమించితిని! — పిట్టవలెఁ బ్రేమించితిని — బిడ్డవలెఁ బ్రేమించితిని — అయినను నెంతయో యధికముగఁ బ్రేమించితిని! ఇంతటిప్రేమ నేనిదివఱ కెవ్వరియెడలను గలిగి యుండలేదు — కాని నా

యెట్టయెదుట నీ ప్రేతముఖమా? మరల దోషమును నానెత్తిపైఁ బెట్టి పోయెదవా? అహ్హాహ్హాహ్హా! పోవద్దు పోవద్దు! నిన్నుఁ బట్టుకొని తీరెదను. ఎక్కడకుఁ బాఱిపోయెదవు?'' అని ప్రలపించుచు యామాధిక తన్మయురాలై పఱుగెత్తి పోవుచుండెను. అల్లరిపిల్లలు "పిచ్చిది! పిచ్చిది!" అని కేకలు వైచుచు నామెను వెంబడించిరి. కాని యందొక్కరును నామెను గలిసికొనలేకపోయిరి.

దానేశుఁడామెయవస్థఁ గాంచి చాల విచారించెను. ఆతఁడు సంక్షుభిత వికలచిత్తముతోఁ బండిపై నెక్కిపోయెను.

ఆనాటి రాత్రియే యాతనినైద్యాలయము నందలి వస్తువుల నన్నిటిని దీసికొని రైలులో పార్సెలు చేయించి తానును శోణపురమునకు బయలుదేఱి వచ్చెను. అప్పటినుండి దానేశుఁడు పాంచకడీ దేవీమందిర పక్షమున డాక్టరుగా నుండి రోగులకు జికిత్సగావించుటలో తనజీవిత మంతయును సుఖముగాఁ గడపినైచెను. ఆనాటినుండియు నాయన్న దమ్ములు నలువురు నైకమత్యముతోఁ దమతమజీవితములను సుఖమయములుగఁ జేసికొనుచుండిరి. అప్పటినుండియు నా కుటుంబమునకు లభియించిన శుభయోగము దేవదేవుని కరుణాకటాక్షవీక్షణములచేఁ గ్రమ క్రమాభివృద్ధి నందుచుండెను!

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి. 5347/1949

